# తెలుగు వ్యాకరణాలపై
# సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావం

బేతవోలు రామబ్రహ్మం

నాగార్జున విశ్వవిద్యాలయంనుంచి
పిహెచ్. డి. పట్టం పొందిన గ్రంథం

స్వీయ ప్రచురణ

తొలి ముద్రణ : 500

రుధిరోద్గారి–విజయదశమి

అక్టోబరు, 1983

ప్రతులకు

బేతవోలు రామబ్రహ్మం

తెలుగు విభాగం., నా. యూ.

నాగార్జున నగర్–522 510

నవోదయ పబ్లిషర్స్

ఏలూరురోడ్డు–విజయవాడ;

5/1 అరండల్‌పేట–గుంటూరు

వెల : రూ॥లు 25/-

ప్రింటింగ్

శ్రీలక్ష్మిప్రెస్

14/1 అరండల్‌పేట

గుంటూరు–2

అక్షీణామృత వాహినీ నిభము
సౌహార్దమ్ము రూపించి, ప్ర
త్యక్షంబాయెనొ నా దొఱప్ప గురువై
అవ్యాజ వాత్సల్య వాః
శ్రీ క్షిప్తిం బరిపుష్టిఁ గూర్చిన లతా
వృంతేజమీ గ్రంథమున్
సాక్షీభూత మనస్సుగాఁ గనుఁడ!
నిశ్శంకన్ బుధాగ్రేసరుల్!

# ప్రవేశిక

శాస్త్రజ్ఞానరాశి అనంతం. అది రాగద్వేషాలకు అతీతం. అందునా విశ్వ శ్రేయస్సాధనమైన సత్యారాధనం సకల గురుకుల మతం. అధునా, 'సత్యే సర్వం ప్రతిష్ఠిత'మ్మన్నది మా గోత్రవ్రతం. 'తెలుగు వ్యాకరణాలపై సంస్కృతప్రాకృత వ్యాకరణాల ప్రభావం' అన్న ప్రకృతరచన మా వ్రతానికి అనురూపంగా అవతరించి వెలుగును చూస్తున్నది. ఏతత్కర్త డాక్టరు బేతవోలు రామబ్రహ్మం విశేషదర్శనం, వివేకపరిపాకం గల ఉత్తమ పరిశోధకుడు. శాస్త్రశిక్ష, వృద్ధోపాసనా ఇతనికి వజ్రకవచాలు. నిరంతరసాధనా, ప్రవచనాఖ్యానమూ వీటికి తోడు. వర్ణమాల, పరుష సరళాలు, ప్రత్యాహారపద్ధతి, ద్రుతమూ-ద్రుతప్రకృతికమూ, సంధి, రూపసాధన సరళి, ఉత్వడజ్ఞలు, ప్రకీర్ణ విషయావళి-అన్న ఎనిమిది అధ్యాయాలలో విస్తరించిన ఈ సిద్ధాంతవ్యాసం అధ్యాయ సంఖ్యనుబట్టి లక్షణశిరోభూషణమైన పాణిని అష్టాధ్యాయిని స్మృతిపథానికి తెస్తుంది. ఈ సంఖ్యానియమం ఐచ్ఛికం కావచ్చు యాదృచ్ఛికం కావచ్చు; ఏదైనా అష్టాధ్యాయియెడల ఈతనికిగల సమర్చనాబుద్ధి ఇందువల్ల స్పష్ట మవుతున్నది.

సమీప వర్తిత్వంవల్ల గానీ, మత రాజకీయాది సంబంధాలవల్ల గానీ భాషలకు సంసర్గం ఏర్పడినప్పుడు అన్యోన్యం అటూ యిటూ ఆదాన ప్రదానాలు ప్రవర్తిల్లడం సహజం. కొన్నిపట్ల అది పదవినిమయంతో ఆగదు. ప్రదాతృ భాషలోని కావ్యాలకూ, శాస్త్రాలకూ ప్రతిగ్రహీతృభాషలో అనుకరణలూ, అనుసరణలూ రూపొందడం తప్పని సరి. సంస్కృత ప్రాకృతభాషలతోడి ప్రగాఢ సంసర్గ సంబంధాలవల్ల తెలుగున అలాటి ప్రభావమే కనిపిస్తుంది. తెలుగుపై తత్సమ తద్భవ రూపాన ఈ భాషల ప్రభావం అతివేలంగా పడడమేగాక అక్కడి రచనలూ, రచనా సంప్రదాయాలూ ఇబ్బడిగా ముబ్బడిగా తెలుగున దిగుమతి అయ్యాయి. వీటిలో వ్యాకరణ రచనా ప్రణాళిక ఒకటి.

సంస్కృతం ఆద్యప్రకృతి అనీ, ప్రాకృతం ద్వితీయ ప్రకృతి అనీ, తెలుగు వికృతి అనీ లాక్షణికుల వ్యవహారం. తెలుగున గల తత్సమ తద్భవ రూపవిభాగాన్ని

దృష్టిలో పెట్టుకుని యోచిస్తే తెలుగు వికృతి అన్న వాడుక సమంజసమే అనిపిస్తుంది. ఈ విభాగానికి చెందని దేశ్యభాగాన్ని వికృతి అనడం యుక్తిసహం కాకపోయినా, తెలుగులో ఏకదేశమైన తత్సమతద్భవ భాగానికి వర్తిస్తున్న వికృతి అన్న వ్యవహారం శేషభాగమైన దేశ్యానికిసైతం విస్తరించింది. వ్యుత్పత్తిపరంగా పృథగ్జన్యత్వంవల్ల ఉభయప్రకృతి విలక్షణత్వమూ, ప్రవృత్తిపరంగా ప్రకృతి ద్వయ సంబంధంవల్ల తదుభయానుసారిత్వమూ తెలుగుభాషా విశిష్టత. ఇది ఆర్యభాషాజన్యం కాదనీ, ద్రావిడ భాషా మూలకమనీ ఆధునికులు అనువర్ణించడమే కాదు, ప్రాచీనాంధ్ర శాబ్దికులు కేతనాదులు సైతం ప్రసంగించిన అంశమే. 'తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును-దానివలనఁ గొంత గానఁబడియె- కొంత తాన కలిగె నంతయునేకమై-తెనుఁగుబాస నాఁగ వినుతికెక్కె' అన్న కేతన్న తీర్పులో వ్యుత్పత్తిపరంగా తెలుగునకుగల స్వతంత్ర ప్రతిపత్తి స్పష్టంగా స్థాపించబడింది. 'కేవలతయా అనుసర్పత్యభే చ....' అన్న చింతామణి హృదయం సైతం భూషణకారుడు శిల్పించిన తీరు తెన్నులను భూషించింది.

అయితే, తత్సమ తద్భవాలకు గల సమీప ప్రకృతులను నిర్ధారించే పక్షంలో తెలుగు లాక్షణికులలో ప్రధానంగా మతభేదాలు రెండు కనిపిస్తాయి. ద్వితీయ ప్రకృతిగా పరిభాషించబడుతున్న ప్రాకృతంతో నిమిత్తం లేకుండా ఆద్యప్రకృతియైన సంస్కృతం నుంచే తత్సమ తద్భవాలన్నింటినీ నిష్పన్నంచేయడం మొదటి మతం. అంటే, వీరి చూపులో తచ్ఛబ్దం నిర్దిష్టంగా సంస్కృతానికే పరిమితం. ఆంధ్రభాషాభూషణకర్త మూలఘటిక కేతన్న, కావ్యాలంకారచూడామణికర్త విన్నకోట పెద్దన్న, ఛందోదర్పణ కారుడు అనంతుడు మున్నగువారు ఈ మతానికి చేరినవారు. ఆద్య ప్రకృతితోపాటు ఆవశ్యక స్థలాలలో ప్రాకృతాన్నికూడ సమీప ప్రకృతిగా పరిగణించి ఈ ఉభయ ప్రకృతులనుంచి తత్సమ తద్భవాలను వ్యావర్తకంగా వ్యావర్ణించడం రెండోమతం. ఈమతం మేరకు తచ్ఛబ్దం సంస్కృత ప్రాకృతాల రెండింటికీ విస్తృతం. చింతామణి కర్త, అప్పకవి, చిన్నయసూరి మొదలైనవారు రెండోమతానికి చెందినవారు. ఆధునిక భాషా విజ్ఞాన దృష్టిలో రెండోమతంవారి పద్ధతియే పద్ధతిగా ఉందని నిష్కర్షించవచ్చు. అయితే ఈ రెండోమతంవారి ప్రాకృత భాషాప్రసంగం అచ్చంగా సంజ్ఞా పరిచ్ఛేధానికి మాత్రమే సీమితం. బాలవ్యాకరణ తత్సమ పరిచ్ఛేదంలో సంస్కృత సమాల రూపనిష్పాదనమే కనిపిస్తుందిగాని ప్రాకృతసమాల సిద్ధి నామమాత్రానికైనా కానరాదు.

చేసినదిబట్టి ప్రకృతిద్వయ పక్షంవారైన మన లాక్షణికుల ప్రాకృతభాషాప్రసక్తి వట్టి మొగం తుడుపనీ, మొక్కుబడివతు అనీ చెప్పడంలో తప్పులేదు.

ప్రజల వాడుకలోని ప్రాకృతాదిభాషలకు పట్టం కట్టబెట్టాలని పట్టుపట్టిన గౌతమ బుద్ధుని స్మారక చిహ్నాలు నూరారు వెలసిన ఈ పవిత్రసీమలో, రసిక హృదయవర్తి 'సత్తసఈ' సంకలనకర్త హాలశాతవాహన చక్రవర్తి పుట్టిపోయిన ఈ పుణ్య భూమిలో, భారతదేశంలోని అన్ని రాష్ట్రాలకంటె అధికసంఖ్యలో ప్రాకృతభాషామయ శాసనాలు లభించిన తెలుగుగడ్డలో ప్రాకృతభాషా ప్రభావం ఇట్టింకులింకి పోవడం ఆశ్చర్యం. జైన బౌద్ధ ధర్మవాహకాలుగా, ఉత్తమసాహితీ నిక్షేపాలుగా ప్రాకృతాదులు విస్తుల ప్రచార ప్రశస్తులనందినవి కాని, కారణాలు ఏవైనా కానివ్వండి, తెలుగునాట ప్రాకృతాల ఊసు కలలోనిమాటగా మారిపోయింది. సంస్కృతరూపకాలు చాల పాలు ప్రాకృతభాషామయాలు. కాని అధ్యాపకులు, అధ్యేతలు పఠనపాఠనాలలో ప్రాకృతభాషాభాగాన్ని ఊచముట్టుగా పరిహరించి సంస్కృతచ్ఛాయతో సరిపెట్టు కోవడం జగమెరిగిన సత్యం. నన్నకోట పెద్దన, కాకునూరి అప్పకవి ప్రభృతి తెలుగు లాక్షణికులు, విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాది ప్రాకృతభాషా శాబ్దికులకు దూర దూరంగా నమస్కారాలుపెట్టి తమదారిని తాము తరలిపోయారు. అంతేకాదు, తవణి, తవర, తాణం, తాయం, తావు, తీవి, తేవ—వంటి ప్రాకృతసమాలను అన్యదేశ్యాలుగా నిరూపించి వాస్తవస్థితిని తారుమారు చేశారు మన ఆధునిక లాక్షణికులు. దక్షిణ భారతదేశంలోని విశ్వవిద్యాలయాలు పెక్కింట ప్రాకృతభాషాపీఠాలు లేకపోవడం మాట అటుంచి—సంస్కృతపీఠాల, తెలుగు మొదలైన దేశభాషా శాఖల, పాఠ్యప్రణాళి కలలో ప్రాకృత భాషాధ్యయనం అస్తినాస్తి విచికిత్సాహేతువు. ఇక, తద్భవాల మాటకువస్తే తెలుగున నూటికి తొంభైపాళ్లు ప్రాకృత భవాలూ, తక్కిన పదిపాళ్ళు సంస్కృతభవాలూ ఉన్నట్లు అభిజ్ఞుల అంచనా. కాని, మన విద్యాసంస్థలన్నింటిలోనూ ప్రకృతి వికృతి రూపాలను వివరించే సందర్భాలలో తెలుగు అధ్యాపకులు సమీప మాతృక అయిన ప్రాకృతాన్ని విస్మరించి—ప్రాకృతానికికూడ సంస్కృతమే మాతృక అన్న భావనవల్లనో లేక ప్రక్రియా లాఘవమన్న ఆశవల్లనో—సంస్కృత మూల రూపాలనుమాత్రం ఏకరువుపెట్టడం ఎన్నేళ్ళుగానో మనం చూస్తున్న విషయం. ఈ విషయమిట్లుండగా, తెలుగును చల్లగా ప్రాకృతభేదాలలో చేర్చిన మహానుభావులు

ఈనాడే కాదు, ఆనాడూ ఉన్నారు. 'ఆంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయమ కాన....' (9–8), 'తెలుగుం బ్రాకృతభంగిన బల్కియుటచే....', (పై.ది. 9_72) అని కావ్యాలంకారచూడామణి; '....ఈ యాంధ్రభాషయుఁ గవిమతంబునందుఁ బ్రాకృతభేదంబె యనఁగనొప్పు' (1_75)అని అప్పకవీయమూ; 'తెలుఁగు ప్రాకృతాభిధానముగాన....' (పు1) అని ఆంధ్రకౌముదీ; నిర్ణయించడం యోజించదగ్గది. దీనినిబట్టి ప్రాకృతభాషాధ్యయనాన్ని పట్టుబట్టి తెలుగువారు పరిహరించినట్లు ఊహించ వీలున్నది.

కాని, ప్రాకృతభాషలపరంగా అంతోయింతో కృషి సల్పిన పండిత పరిశోధకులు తెలుగునేలలో ఉద్దాముగ్గురికి మించి లేరు. వీరిలో చెల్లిపోయిన తరానికి చెందిన పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, పరవస్తు వేంకటభట్టనాథస్వామి, మానవల్లి రామకృష్ణకవి, మేదేపల్లి వేంకటరమణాచార్యులు, చిలుకూరి నారాయణరావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, దిగుమర్తి సీతారామస్వామి మున్నగువారు పేర్కొదగ్గవారు. పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర ప్రభృతులు నేటికినీ ప్రాకృత భాషా సాహిత్యాలలో ఉడతాభక్తిగా పరిశ్రమిస్తున్న ఒంటరి వీరులు.

ఎవరెంత కాదన్నా తెలుగుపై సంస్కృతంతోపాటు ప్రాకృతంకూడ తన ప్రభావాన్ని విస్తృతంగా నెరపిందని నిర్ధారించడం దాచేస్తే దాగని సత్యం. ఈ సత్యాన్ని ప్రమాణోపపత్తి సంకలితంగా ప్రకృత సిద్ధాంత వ్యాసంలో డాక్టరు రామబ్రహ్మం సుస్థాపితం చేశారు. సంస్కృత ప్రాకృత లక్షణ ప్రపంచాన్ని ఆమూలచూడం అవలోడనం చేసి ఆంధ్ర లాక్షణిక హృదయాన్ని అనుశీలించి, పూర్వపరిశోధకుల కృషిని తైపారు వేసి, సారమతితో ఉచితానుచితాలు వివేచించి, నిశ్చయ జ్ఞాననిరూపకమైన రీతిలో తవవైన నిర్ణయాలను వ్యాసకర్త ఆవిష్కరించారు. ప్రత్యర్థుల వాదాలను ప్రత్యాఖ్యానం చేసే పట్ల సైతం మా రామబ్రహ్మం ఎంతో సహనం సంస్కారం ప్రకటించారు. ప్రాతిభ సంయమం కల ధృతిమంతులకే అది చెల్లు.

మొదటి అధ్యాయంలో సంస్కృత ప్రాకృత వ్యాకరణాలలోని వర్ణమాలా పరమైన సంప్రదాయాలు, వర్ణ నిర్దేశం, పరిభాషా నిర్వచన నిరూపణలు శాస్త్రీయంగా ప్రదర్శించబడ్డాయి. వక్ర వక్రతమ సంజ్ఞా నిర్దేశ విషయంలో ఈ వ్యాసకర్త చేసిన ఊహలు కేవలం ఊహలే కావు పరిశోధకులలో జిజ్ఞాసనూ జిగీషనూ రేకెత్తించే

మౌలిక ప్రతిపాదనలు. ఎందువల్లనో దంత్య చ–జల ప్రసంగం ఈ వ్యాసంలో విస్తారంగా సాగలేదు. 'ప్రాకృతే తద్భవే చాపి చజౌ దంతభవౌ స్మృతౌ' అన్న వికృతివివేక కారికమూ, 'సంస్కృత సమంబులందు దంత్యచజలు లేవని తాత్పర్యము' అన్న బాలవ్యాకరణ వృత్తినీ పూర్తిగా విస్మరించినట్లుంది. ద్వితీయాధ్యాయంలో పరుష సరళాది సంజ్ఞాపరంగా సాగిన చర్చకూడ మేలురంగా నిర్వహించబడింది.

పుంలింగ మహద్వాచక ప్రాతిపదికల చివరి అత్వానికి ఉత్వం రావడంగూర్చి చేసిన సుదీర్ఘ ప్రసంగం (పు 119–133) సహేతుకంగా ప్రవర్తిల్లింది ఇక్కడి ఉత్వం ప్రాకృతభాషా ప్రభావ సూచకమని నిర్ధారించడం పూర్వ పరిశీలకు లెవరూ చెప్పని నూతనాంశం. అడిదము సూరకవి కవిసంశయవిచ్ఛేదంలో దృశ్యాదృశ్యంగా దీనికి బీజాలున్నప్పటికీ ప్రాకృతంలోని పుంలింగ మహద్వాచకైక వచన ప్రత్యయమైన '–ఓ' ఇక్కడ ఉత్వంగా మారిందని ప్రస్పష్టంగా ప్రతిపాదించబడింది. తెలుగులో ఇచట ఉత్వం రాకపోవడం దేశీ స్వభావం; ఉత్వం రాకడ ప్రాకృత ప్రభావం.

ఉదా : తెలుగు: వాఁడు, తమిళ: అవన్, కన్నడ: అవం, అవను; తెలుగు: వీఁడు, తమిళ: ఇవన్, కన్నడ: ఇవం, ఇవను; తెలుగు: ఎవఁడు, తమిళ:–యావన్, ఎవన్, కన్నడ: యావం, యావను; తెలుగు: మగఁడు, తమిళ:_మగన్, కన్నడ: మగను, మగ. ఇట్లే అడియఁడు, అనుమఁడు, ఒడయఁడు, గంగఁడు, గండఁడు, దమ్మఁడు, బసవఁడు, బోయఁడు. రంగఁడు, లింగఁడు, సింగఁడు మున్నగు తత్సమ తద్భవ దేశ్య రూపాలపై ఉత్వం రాలేదు. రెంటికిచెడ్డ 'రేవఁడు' కూడ ఈపట్ల చెడిపోలేదు చట్టు (ప్రా. ఛట్టో<సం. ఛాత్రః); చందు (< ప్రా. చందో> సం. చంద్రః)గుజ్జు(< ప్రా. కుజ్జో>సం. కుబ్జః);బచ్చు(< ప్రా. వేసో > సం.వైశ్యః); బట్టు (< ప్రా. భట్టో>సం. భట్టః); రావుతు (< ప్రా. రాఉత్తో>సం. రాజపుత్రః). వెజ్జు (< ప్రా. వెజ్జో>సం. వైద్యః) మున్నగు తద్భవ రూపాలు ఉత్వమాత్రాలుగా వాడుక పడ్డవి; 'ము' ప్రత్యయం చేరలేదు గౌరవ (సం. గురు–), ప్రోడ (సం; ప్రౌఢ–), మిత్త (సం. మిత్ర) మున్నగు రూపాలలో ఉత్వం కూడా రాలేదు. నాదు, రూపు, వాదు, నద్దు–మున్నగు అమహద్రూపాలపైకూడ ఉత్వం నిలిచి ఉండడం పరిశీలనార్హం.

కుంతి_గొంతి (పు-132) రూప ప్రదర్శన సందర్భంలో ప్రాకృతీయమైన 'కోంతీ' ని కూడ ఉద్ధరించి ఉంటే ఉచితంగా ఉండేది.

'బొంది_బోఁడి' రూపనిష్పాదన సమీక్ష చూడముచ్చటగా సాగింది. 'నింద లేనిదే బొంది పోదు', 'బొందిలో ప్రాణాలుండగా....' వంటి పలుకుబళ్ళు తెలుగునాట ప్రచురం. 'బోంది' దేహమన్న అర్థంలో పాళీభాషయందలి సుంసుమార జాతక గాథలో 'మహాతేవం తే బోంది న చ పఞ్ఞా....' (నీ శరీరం గొప్పదే కాని ప్రజ్ఞ కాదు.) అని ప్రయుక్తం. హేమచంద్రుని దేశీనామమాలలో దేశీప్రాకృత రూపంగా ఇదే అర్థంలో 'బోంది' ఉల్లేఖించబడింది. బొంది శబ్దమే బోఁడిగా పరిణమించిందని రామబ్రహ్మం భావన. శబ్దార్థాలలో కానవస్తూన్న సామ్యం ఈ భావనకు మూలం కావచ్చు. కాని దీనికి బాధకాలు ఎన్నో ఎదురుపడుతున్నవి. ఈ చర్చా సందర్భంలో 'డకారం దకారంగా మారడం అచ్చికపదాలలో చాలావాటిలో కనబడుతోంది' (పు_168) అన్నారు వ్యాసకర్త. అయితే, ఈ ధ్వనుల మార్పు అసలుదారి వేరు. మూర్ధన్యమైన డకారమే దంత్యమైన దకారంగా మారడం తెలుగున నిసర్గ స్థితి; విపర్యయం విపరీతి రీతి. అంటే, డకారం ప్రాచీనం_దకారం అర్వాచీనం.

డక్కు > దక్కు, డయ్యు > దయ్యు, డాఁగు > దాఁగు డిగు > దిగు, డీలు > దీలు, డుల్లు > దుల్లు, డూయు > దూయు, డెప్పరము > దెప్పరము, డేఁకు > దేఁకు.డొంగ > దొంగ, డోఁకు > దోఁకు వంటి జమిలి పలుకులలో వ్యుత్పత్తి పరంగా ఆలోచించినా, ప్రయోగపరంగా వివేచించినా డకారాదులు ప్రాథమికాలు; దకారాదులు పరిణత రూపాలు. ప్రాథమికరూపాలు గ్రంథస్థం కాలేదుగాని దున్ను. దుప్పి, దువ్వు_ మొదలగునవి కూడ మౌలికంగా డకారాదులే. డెబ్బది వంటి వాటికి దకారఘటిత రూపాలు కన్పట్టవు. మూలద్రావిడభాషలోని అజ్మధ్య 'ఱ' కారం తెలుగున డకారంగా మారి,వర్ణ వ్యత్యయంచే పదాదికి చేరి అనంతరదశలో దకారంగా మారినందున పై రూపాలు సిద్ధించినట్లు శాస్త్రవిదుల నిర్ణయం. అయితే, ఒక్క 'డీలు' తప్ప పైన పేర్కొన్నవన్నీ శుద్ధ దేశీయాలు సంస్కృతంలోని శిథిల శబ్దం 'డీలు'కు

మూలమాతృక. ప్రాకృతంలోని 'ఢిల్ల'–, 'సిఢిల'–, 'సఢిల'–దీనికి సమీపమాతృకలు. కావున బొంది–బోఁడి అన్న ఈ చర్చ ఇంకను సుపరీక్షితం కావలసిఉంది.

క్షోదక్షమంగా సాగిన మా ఈ సహవ్రతుని కృషిని పరీక్షించి వెల ఇంతని విర్ణయించడం సూరిజనుల వంతు; విజయస్వ అని ఆశీర్వచించడం మా వంతు.

'ధ్వని....ప్రీయతాం పరమేశ్వరః' —ఈ సిద్ధాంత వ్యాసంలోని ఆద్యంతాల కలయికచే ఏర్పడ్డ ఈ పలుకుబడిలో సూచితమైన మహార్థం పరిశోధనా పరమేశ్వరులకు ప్రీతిపాత్రం కాగలదని మా ఆశంస.

విజయదశమి
16–10–1983

తూమాటి దొణప్ప
నాగార్జున నగర్

---

మహతా ప్రయత్నేన యావత్ సముపలబ్ధేయం ప్రవేశికా. ముఖరంగే విరాజమానయావయా గ్రంథస్యాస్య మహతీ కాపి ప్రకర్షా సంవృత్తా. అతః ఖల్వయం కృతజ్ఞతాంజలి రాచార్యేభ్యశ్శ్రీమద్భ్యస్తూమాటి దొణప్ప మహోదయేభ్యః.

అస్యాస్స్వముపలబ్ధౌ మదర్థం సహాయకోఽభూదితి మిత్రాయ కొమాండూరు రంగనాథాచార్యాయ శుభం భూయాదిత్యాశీః. —రచయితా.

# ఓ చిన్న మాట

పాఠ ప్రవచనాలతో వ్యాకరణాలపై అభిరుచిని కలిగించి అధికారం ప్రసాదించిన శబ్దశాస్త్రచుంచువులు శ్రీ కట్టి శ్రీరామమూర్తిశాస్త్రిగారికీ, శ్రీ కలగ వేంకట సుబ్బారాయడుగారికీ ముమ్ముందుగా హృదయ మందిరంలో అక్షరార్చన జరిపి-ఓ చిన్నమాట

వారు చెప్పిందీ, వీరు చెప్పిందీ పోగుచేసి పేజీలు నింపాలి అనుకోవద్దు. మీరు చెప్పదలచుకొన్నదేదో మీరు చెప్పండి. మీ ఊహలూ, మీ ప్రతిపాదనలూ, మీ సమన్వయాలూ—ఏవయినా కానీ—మీవి మీవిగానే ఉండాలి. అయితే ఏది చెప్పినా సహేతుకంగా సాధారంగా ఉండాలి. చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పండి. సున్నితంగా చెప్పండి. పొదుపుగా చెప్పండి. రాసి కన్నా వాసి మిన్న.

ఇవి మా పర్యవేక్షక గురువర్యుల తొలిపలుకులు.

ఇవి నాకు "ప్రాఁబల్కులే" అయ్యాయి. తు. చ. తప్పకుండా పాటించడానికి ప్రయత్నం చేశాను.

సిద్ధాంత వ్యాసాలు ప్రారంభకులకోసం కాదు అందుచేత ఏ విషయాన్ని ప్రస్తావించ దలచుకొన్నా, ఉపోద్ఘాతాలతో ప్రమేయం పెట్టుకోలేదు. సూటిగా సూత్ర ప్రాయంగా చెప్పేయడమే జరిగింది. అనేక మాత్రా లాఘవాన్ని ఎంతగానో సంపాదించడమూ జరిగింది. ఈ సంపాదనలో అస్పష్టత చోటుచేసుకోలేదనే నమ్ముతున్నాను.

సంస్కృత ప్రాకృతాలను క్షుణ్ణంగా అభ్యసించి ఆయా లక్షణ గ్రంథాలను ఆమూల మూలం అధ్యయనంచేసి వాటి ఒరవడిలో ఆంధ్ర భాషకు లక్షణ గ్రంథాలను వినిర్మింప బూనుకొన్నారు మన లాక్షణికులు. అందుచేత ప్రభావాలు అనివార్యమయ్యాయి.

ఇలా తెలుగు వ్యాకరణాలలో సర్వాంగీణంగా కానవస్తున్న సంస్కృత వ్యాకరణ ప్రభావాన్ని గురించి ఇంతకు ముందే పెద్దలెందరో ప్రస్తావించారు.

ఇల్లాగే ప్రాకృత వ్యాకరణ ప్రభావాన్ని గురించి కూడా కొందరు చర్చించారు. అయినా నిరూపించవలసిన అంశాలూ విశేషాలూ మరికొన్ని మిగిలే ఉన్నాయి. ప్రత్యేక లక్ష్యంతో సమగ్రమయిన పరిశోధన జరిగినట్టు కనబడదు. ఈ లోటును తీర్చడానికి చేసిన చిన్న ప్రయత్నమే ఈ సిద్ధాంత వ్యాసం.

ఈ దిశలో అనుక్తపూర్వాలయిన విశేషాలను నిరూపించడమూ, ప్రాకృత వ్యాకరణాల ప్రభావాన్ని ప్రధానంగా చర్చించడమూ, ఉక్తచరాలయిన విశేషాలలోని సామంజస్యాన్ని పరామర్శించడమూ, తెలుగు వ్యాకరణాలలోని గ్రంథ గ్రంథులకు కొన్నింటికి సంప్రదాయావిరుద్ధమయిన సమన్వయాన్ని ప్రతిపాదించడమూ ఈ సిద్ధాంత వ్యాసానికి ప్రధాన లక్ష్యాలు.

స్థూలారుంధతీ న్యాయంగా సర్వాంశాలనూ పరిస్పృశించినవి కొన్నీ, శృంగగ్రాహికగా ఆయా విశేషాలను ప్రతిపాదించినవి కొన్నీగా తెలుగు లక్షణ గ్రంథాలలో రెండు ప్రధాన శాఖలు కనబడుతున్నాయి. స్వీకృతాంశపరిధి మేరకు ఈ రెండు శాఖలనూ పరామృశించడం—శాఖా చంక్రమణం—జరిగింది. అయితే కావాలని అన్యవ్యాకరణాలను సర్వథా అనుకరించిన ఆంధ్ర కౌముది వంటి వాటిలో ప్రభావాల పరిశోధన, గొంగళిలో తింటూ వేటినో వెదుక్కోవడం అవుతుందని ఆ ప్రతిపిపాదిషను వదలుకోవడం జరిగింది.

ఎవరో అన్నట్టు నన్ను రాసి రంపానబెట్టి, బద్ధకం వదలగొట్టి, నానుంచి ఈ సిద్ధాంత వ్యాసాన్ని రాబట్టిన పర్యవేక్షక గురువర్యులు శ్రీ తూమాటి దోణప్పగారికి, నేను అక్షరశః కృతజ్ఞతలు తెల్పుకోవాలి. దానికి ఈ నా జీవితం సరిపోవచ్చు. తస్మాత్తథైవ.

స్వానుభవంతో సలహాలను ఇచ్చీ, సముత్సాహ పరచీ, తమ గ్రంథాలను వినియోగానికి అందించీ, బహుధా సహకరించిన సహోపన్యాసకులకూ—గురుదేశ్యులు శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారికీ—

ఆంధ్ర విశ్వవిద్యాలయం—డా॥ వి. ఎస్. కృష్ణ మెమోరియల్ లైబ్రరీ వారికీ, ముఖ్యంగా మాన్య మిత్రులు 'శరత్పూర్ణిమ' శ్రీ ఆర్. శరత్‌బాబుగారికీ—

మా నాగార్జున విశ్వవిద్యాలయం లైబ్రరీ వారికి తదధిపతులు మాన్య శ్రీ ఎస్. కోటేశ్వర రావుగారికీ—

నా పూర్వాశ్రమం—డా॥ కె. వి. కె. సంస్కృత కళాశాల లైబ్రరీ వారికీ—గుంటూరు—రవి కళాశాల వారికీ—

చేదోడు వాదోడుగా నిల్చిన మిత్రులు ఘంటా నాగేశ్వరరావుకూ, కె. రామకృష్ణారెడ్డికీ ఎ. నాగభూషణానికీ, కె. సుబ్బరామయ్యకూ—

షడ్భాషా వివరణమ్—మైక్రోఫిల్మ్‌ను అందించిన అడయారు లైబ్రరీ వారికీ—

రికార్డ్ టైములో ప్రింటింగ్—సాధ్యమైనంత తక్కువ "అప్పుతచ్చులతో"-పూర్తిచేసి ఇచ్చిన శ్రీ లక్ష్మీప్రెస్ వారికీ, కంపోజిటర్ మిత్రుడు సుబ్బారావుకీ 1

హార్దికమయిన కృతజ్ఞతాభివందనాలు తెలుపుకొంటున్నాను.

సిద్ధాంతవ్యాసాన్ని అందంగా అలనాడు రేయింబవళ్ళు టైపు చేసి సిద్ధపరచిన మా సాంబశివరావు గారికి నేను కృతజ్ఞతలు తెలుపుకోవాలనిగానీ, ప్రత్యుపకారం చేయాలని గానీ అనుకోవడంలేదు. 'మయ్యేవ జీర్ణతాం యాతు యత్త్వయోపకృతం సఖే!—"

సిద్ధాంత వ్యాసాల తయారీలో అథస్సూచికలు వగయిరాలకు సంబంధించి వివిధ సాంకేతిక విధానాలు ప్రచారంలో ఉన్నాయి. వాటివల్ల రచనలో ఒక లాఘవమూ పాఠకులకు ఒక సౌలభ్యమూ సమకూరుతున్నాయి. కానీ యావజ్జీవితాన్నీ అంకితంచేసి గ్రంథాలను రచించిన మహామహుల పేర్లకూ గ్రంథనామాలకూ పునఃపునరుక్తి కృతజ్ఞతా ప్రకటనం కాకపోదు- అని అల్లాగే చేశాను.

విద్యాకుటుంబంలో అగ్రజులై వ్యాకరణాల పూదోటకు వసంతాయితులై అస్మదాదులను అధమర్ణులను చేసిన పండిత పరిశోధక మండలికి శత సహస్రాధిక నమస్కృతులతో—

బేతవోలు రామబ్రహ్మం

---

1. నూటపంధొమ్మిదో పుటలో, మూడో పేరాలో, నాలుగో పంక్తిలో "స్త్రీత్వాన్ని అతిదేశించింది" అని చదువుకో ప్రార్థన.

# శీర్షికోపశీర్షికం

మొదటి అధ్యాయం



రెండవ అధ్యాయం

ఐదవ అధ్యాయం



ఆరవ అధ్యాయం



ఏడవ అధ్యాయం

ఎనిమిదవ అధ్యాయం

# వర్ణమాల

ధ్వని_వర్ణము_లిపి_శబ్దము-అర్థము-పదము_వాక్యము_ఈ మొదలయినవాటి స్వరూపాన్ని గురించీ, పరస్పర సంబంధాన్ని గురించీ లాక్షణికులూ పరిశోధకులూ ఏందరో సుదీర్ఘంగా చర్చించారు. ఈ దిశలో పరిశోధన ఇంకా కొనసాగుతూనూ ఉంది. కాగా ఈ ప్రకరణంలో సంస్కృత-ప్రాకృత ఆంధ్ర వ్యాకరణకర్తలూ వ్యాఖ్యాతలూ స్వీకరించిన లేక ప్రతిపాదించిన వర్ణమాలలోని వర్ణాలక్రమం ఎటువంటిది అనే విషయాన్ని సంగ్రహంగా పరామర్శించడం జరిగింది.

కం॥ మాతృకలు వర్ణములు మఱి
భూతలమున వన్నెలును లిపులు వ్రాలుననన్
దైతేయవిభంజన! వి
ఖ్యాతములగు నక్షరాహ్వాయములివియెదున్.

(అప్పకవీయము _ 2—6)

అని అప్పకవి ఈ అయిదు పదాలనూ పర్యాయాలుగా ప్రతిపాదించాడు. కానీ ఒక సమతను పాటించడం సమంజసమని భావించి ఈ వ్యాసమంతటా 'వర్ణము' అనే పదాన్నే అక్షరపర్యాయంగా వినియోగించడం జరిగింది.

## సంస్కృత వ్యాకరణాలలో వర్ణమాల :

వ్యాకరణమనేది శబ్దానుశాసనం కాబట్టి, శబ్దాలు ధ్వన్యాత్మకాలు కాబట్టి ధ్వనులు వర్ణాకృతులు కాబట్టి వ్యాకరణం నిర్మించడానికి పూనుకొన్న ప్రతివ్యక్తికీ ఆభాషకు సంబంధించిన వర్ణమాలను నిరూపించడం అత్యవసరమవుతోంది.

సంస్కృతభాషకు వ్యాకరణాన్ని రూపించిన పాణిని వర్ణమాలనూ అందులోని వర్ణాలక్రమాన్నీ మాహేశ్వర సంప్రదాయంనుంచి స్వీకరించాడు. "అ-ఇ-ఉణ్"

అని ప్రారంభించి 'హల్' అన్నంతవరకూగల పద్నాలుగు సూత్రాలూ ముగియగానే "ఇతి మాహేశ్వరాణి ప్రత్యాహారసూత్రాణి" అని అష్టాధ్యాయి వచనం.

ఇందులోని వర్ణాలక్రమం ఇది–అ–ఇ–ఉ–ఋ–ఌ–ఏ–ఓ–ఐ–ఔ–ఇవి తొమ్మిదీ స్వరాలు. హ–య–వ–ర–ల, ఞ–మ–ఙ–ణ–న, ఝ–భ–ఘ–ఢ–ధ, జ–బ–గ–డ–ద, ఖ–ఫ–ఛ–ఠ–థ, చ–ట–త, క–ప, శ–ష–స, హ–ఇది వ్యంజనాలక్రమం. వీటిలో హకారావృత్తిని పరిహరిస్తే మొత్తం–33 వ్యంజనాలు మిగులుతాయి. అంటే ఈ పద్నాలుగు సూత్రాలలోనూ కలిపి మొత్తం–42 వర్ణాలు మాత్రమే సాక్షాత్తుగా ఉపాత్తమయినట్లు. అయోగవాహాలలో అనుస్వార విసర్గలను కూడా స్వీకరిస్తే ఇవి మొత్తం–44 అవుతాయి. ఈ సంస్కృత వర్ణమాలా విషయంలో సమగ్రమయిన చర్చ 'సంస్కృత వర్ణానాం స్వరూపం సముత్పత్తిశ్చ' అనే గ్రంథంలో డా॥ లడుకేశ్వర శతపతిగారు సప్రమాణంగా చేశారు.

పై అష్టాధ్యాయీవచనంలో "మాహేశ్వరాణి" అనే మాటవెనుక రెండు సంప్రదాయలు ఉన్నాయి. "మహేశ్వరాదాగతాని మాహేశ్వరాణి" అనేది ఒకటి. దీనికి పాణినీయశిక్షలో కనిపించే ఈ క్రింది శ్లోకం ఒక ఆధారం.

యేనాక్షర సమామ్నాయమధిగమ్య మహేశ్వరాత్
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః॥

"మహేశ్వరేణ ప్రోక్తాని మాహేశ్వరాణి" అనేది రెండవ సంప్రదాయం. దీనికి కాశికాకారుని ఈ క్రింది శ్లోకం ఒకానొక ఆధారం.

నృత్తావసానే నటరాజరాజో
ననాద ఢక్కాం నవపంచవారమ్।
ఉద్ధర్తుకామః సనకాది సిద్ధాన్
ఏతద్విమర్శే శివ సూత్రజాతమ్॥

ఈ రెండు శ్లోకాలనూ ఉదాహరిస్తూ రెండవ శ్లోకంలోని 'ననాద' అనేది అంతర్భావిత ప్రేరణార్థకమని చెప్పి బాలమనోరమాకర్త సుదీర్ఘచర్చను సాగించాడు.
(బాలమనోరమ, ప్రథమ, పుట–3, 4)

వీటిలో ఈ రెండవ సంప్రదాయాన్ని చారిత్రికులయిన పరిశోధకులు అంగీకరించడంలేదు. పాణినికి ముందు మహేశ్వరుడు అనే వ్యాకరణ కర్త ఉన్నాడనీ, అతనినుంచి పాణిని ఈ పధ్నాలుగు సూత్రాలనూ స్వీకరించాడనీ వీరు నిర్ధారించారు.

ప్రాతిశాఖ్యాదులలోనే సంస్కృత భాషా వర్ణమాల సునిరూపితమై ఉన్నదనీ, దానినే మహేశ్వరుడు తన ప్రత్యాహార ప్రణాళికకు అనువుగా మలచుకొన్నాడనీ, అదే సంప్రదాయానికి చెందిన పాణిని వాటిని యథాతథంగా స్వీకరించాడనీ వీరి నిరూపణ.

మొత్తం సంస్కృత వ్యాకరణంలోనే రెండు విభిన్న సంప్రదాయాలు ఉన్నాయనీ అందులో ఒకటి మాహేశ్వర సంప్రదాయం కాగా మరొకటి ఐంద్ర సంప్రదాయమనీ ప్రతిపాదిస్తూ ఈ రెండు సంప్రదాయాల స్వరూపస్వభావాలూ, పౌర్వాపర్యాలూ పై పరిశోధకులు నిర్ధారించడంకూడా జరిగింది. ఈ తరగతి పరిశోధకులలో "సంస్కృత వ్యాకరణ్ కా ఇతిహాస్" అనే గ్రంథం రచించిన శ్రీ యుధిష్ఠిర మీమాంసకులూ, "Systems of Sanskrit Grammar" అనే గ్రంథం రచించిన శ్రీ బెల్వాల్కర్ పండితుడూ గణనీయులు.

ఇంతకూ-పాణిని ఈ మాహేశ్వర సూత్రాలను స్వీకరించడం ప్రత్యాహార నిర్మాణంకోసమే అనేది స్పష్టమవుతున్న విషయం. కానీ పాణినీయంలోని లాఘవాలకూ క్లిష్టతలకూ కూడా ఈ ప్రత్యాహారాలే ఒక కారణం అవుతున్నాయి. అందుచేత పాణినీయానికి తరువాత వెలువడిన సంస్కృతవ్యాకరణ కర్తలు కొందరు ఈ క్లిష్టతను తొలగించడానికి ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నంలో వీరు ఐంద్ర సంప్రదాయానికి అనుయాయులు అయ్యారు. ఇది పైని పేర్కొన్న పరిశోధకుల అభిప్రాయంగా కనబడుతోంది.

### కాతంత్రం :

ప్రాతిశాఖ్యాది ప్రతిపాదితమై లోకంలో సుప్రతిష్ఠితమయిన క్రమంలోనే ఐంద్ర సంప్రదాయానుయాయులు సంస్కృత వర్ణమాలను స్వీకరించారు. వర్ణమాలను తామే

ప్రత్యేకంగా పేర్కొనకుండా "సిద్ధో వర్ణ సమామ్నాయః" (సంజ్ఞా-సూ-1) అన్న కాతంత్రవ్యాకరణం ఈ సంప్రదాయానికి చెందినది.

ఈ సూత్రాన్ని భావసేనుడు ఇలా వ్యాఖ్యానించాడు. "సిద్ధఃఖలు వర్ణసమామ్నాయః వేదితవ్యః. తే కే?-అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ; క-ఖ-గ-ఘ-ఙ, చ-ఛ-జ-ఝ-ఞ, ట-ఠ-డ-ఢ-ణ, త-థ-ద-ధ-న, ప-ఫ-బ-భ-మ, య-ర-ల-వ-శ-ష-స-హ-ఇతి."

ఈ మాలికలోని వర్ణాల క్రమం—వ్యంజనాలు—మాహేశ్వరం కాదనడం స్పష్టం. పైగా ఇందులో స్వరాలు హ్రస్వదీర్ఘాలుగా ఉపాత్తాలయ్యాయి. అందుకే "తత్ర చతుర్దశాదౌ స్వరాః" (సంజ్ఞా-సూ-2) అనే సంఖ్యా నిర్దేశంకూడా కాతంత్రంలో సరిపోతోంది. "తేషాం ద్వౌద్వౌ అన్యోన్యస్య సవర్ణౌ" (సంజ్ఞా-4) అనే సూత్రం ఈ హ్రస్వదీర్ఘాలకు సవర్ణతను విధిస్తున్నది. అంతేకాదు వీటి క్రమాన్ని సహితం కాతంత్రం నియమించింది. "పూర్వోహ్రస్వః" (సూ-6) "పరోదీర్ఘః" (సూ-7), "ఏకారాదీని సంధ్యక్షరాణి" (సూ-8), "నిత్యం సంధ్యక్షరాణి దీర్ఘాణి" (సూ-10) "కాదీని వ్యంజనాని" (సూ-11) "తే వర్గాః పంచ పంచ పంచ" (సూ-12) "అంతఃస్థా యరలవాః" (సూ-14) "ఊష్మాణః శషసహాః" (సూ-15)—ఇలా కాతంత్రం స్పష్టంగా వర్ణమాలలోని స్వరాల వ్యంజనాల క్రమాన్ని నిర్దేశించడంతోపాటు కాదులు అయిదేసి ఒక్కొక్క వర్గగా అయిదు వర్గలు ఏర్పడుతున్నాయనికూడా పేర్కొంది. ఈ వర్ణమాలలో కనబడుతున్న వ్యంజనాలక్రమం మాహేశ్వర సంప్రదాయానికి పూర్తిగా భిన్నమయినది.

ఈ కాతంత్ర వర్ణమాలాక్రమంలో స్వరాలు-స్పర్శలు-అంతస్థాలు-ఊష్మాలు ఇదీ వరుస. అంతఃస్థ శబ్దానికి "స్పర్శోష్మణాం అంతః మధ్యే తిష్ఠంతి ఇతి అంతఃస్థాః" అనేది ఉవ్వట విరుక్తిగా తద్‌జ్ఞులు చెబుతున్నారు. (డి.ఎస్.జి-పుట-28) "అంతస్థాః యితి రితి లితి వితి" అనే వాజసనేయ ప్రాతిశాఖ్యా వచనం దీనికి ఉపబలకంగా వారు పేర్కొన్నారు.

భట్టోజి దీక్షితులవారు "పూర్వత్రాసిద్ధమ్" (8-2-1) అనే సూత్రం దగ్గర 'కాదయో మావసానాః స్పర్శాః యరలవా అంతస్థాః. శషసహ ఊష్మాణః. అచః స్వరాః

ఙ్క క- ఙ్క పఇతి కపాభ్యాం ప్రాక్ అర్థ విసర్గ సదృశౌ జిహ్వామూలీయోపధ్మానీయౌ. అం అః ఇత్యచః పరావనుస్వార విసర్గౌ ఇతి స్థాన ప్రయత్న వివేకః" అని మాహేశ్వర భిన్నమయిన వర్ణమాలా క్రమాన్ని పరిగ్రహించారు.

"కః ఆదిః యేషాం కాదయః. మః అవసానే యేషాం తే మావసానాః. ఇదంచ లోక ప్రసిద్ధ పాఠాపేక్షమ్." (పుట—17) అనేది ఈ సందర్భంలో బాలమనోరమా వ్యాఖ్యానం. ఈ వర్ణాలక్రమం మాహేశ్వరం కాదుకాబట్టి దీనిని లోకప్రసిద్ధ క్రమంగా వీరు భావించారనుకోవచ్చు.

కాగా—మాహేశ్వర సంప్రదాయానికి భిన్నమయినది, ప్రాతిశాఖ్యాది ప్రతిపాదిత మయినది, ఐంద్ర సంప్రదాయాంగీకృతమయినది, లోక ప్రసిద్ధమయినది, అయిన సంస్కృత వర్ణమాలాక్రమం ఇది అనడానికి ఈ ఆధారాలు చాలు.

ఇందులో కాదులు ఈ నిర్దిష్టక్రమంలో అయిదేసి ఒక్కొక్క వర్గంగా పరిగణింపబడతాయనే విషయాన్ని పాణినీయంకూడా అంగీకరించింది. "కుచుటుతుపు ఏతే ఉదితః" అనేది "అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః" (1-1-69) అనే సూత్ర వ్యాఖ్యలో భట్టోజి దీక్షితులవారి వాక్యం. "కు" అనేది కవర్గకు నిర్దేశం. 'చు' అనేది చవర్గకు నిర్దేశం. ఇల్లాగే తక్కినవీను. అందుకే "చోః కుః" (8—2—30) అనే సూత్రానికి "చవర్గస్య కవర్గః స్యాత్ ఝలి పదాంతే చ" అని వీరి వృత్తి. "క్విన్ ప్రత్యయస్య చ కుః" (8-2-62) అనే సూత్రం దగ్గరకూడా ఈ తావులోనే "క్విన్ ప్రత్యయో యస్మాత్తస్య కవర్గః అంతాదేశః స్యాత్ పదాంతే" అని వృత్తిని రచించారు.

మహేశ్వర సూత్రాలలో క-ఖ—గ—ఘ—ఙ-ఇత్యాదిగా అయిదేసి వర్ణాలు ఒక్కొక్క వర్గంగా ఏర్పడే క్రమంలేదు. కాబట్టి కు—కవర్గ, చు-చవర్గ ఇత్యాదిక మయిన ఈ పాణినీయ నిర్దేశం మాహేశ్వర సంప్రదాయానికి భిన్నమయినదిగా భావింపవచ్చు. అంటే పాణినీయం వర్ణమాలకు సంబంధించినంతవరకూ యథావసరంగా ఐంద్ర మాహేశ్వర సంప్రదాయాలను రెండింటినీ స్వీకరించిందన్నమాట.

## జైనేంద్రం :

పాణినీయానికి తరువాత ఆ సంప్రదాయంలో వెలువడిన వ్యాకరణాలుకూడా పాణినీయంలాగానే ఈ రెండు రకాల వర్ణమాలలనూ అంగీకరించినట్టు కనబడుతోంది. కానీ ప్రత్యాహారసౌలభ్యాన్ని అపేక్షించి వీరందరూ మహేశ్వర సూత్రోపాత్తమయిన క్రమానికే ప్రాధాన్యం ఇచ్చారు. కాబట్టి వీరి వ్యాకరణాల్లో కనిపించే "సిద్ధిః" అనే పదానికి కాతంత్రంలో లాగా వర్ణమాలాసిద్ధి అభీప్సితంకాదు. వర్ణమాలాతిరిక్తంగా సిద్ధులు అనేకం వ్యాఖ్యానింపబడ్డాయి.

దేవనంది రచించిన జైనేంద్ర వ్యాకరణం "సిద్ధిరనేకాంతాత్" అనే సూత్రంతో ప్రారంభమయ్యింది. ఇందులోని 'సిద్ధిః' అనే పదానికి "ప్రకృత్యాది విభాగేన వ్యవహారరూపా శ్రోత్రగ్రాహ్యతయా పరమార్థతోపేతా ప్రకృత్యాది విభాగేన చ శబ్దానాం సిద్ధిః అనేకాంతాత్ భవతీత్యర్థాధికారః ఆశాస్త్రపరిసమాప్తేః వేదితవ్యః_" అంటూ అభయనంది మహావృత్తిని రచించాడే తప్ప వర్ణమాలాసిద్ధి అని పేర్కోలేదు. (పుటలు —2,3)

అంతేకాదు ఈ జైనేంద్రంలో ఇక్ (ఇకస్తౌ-1-1-17) అచ్ (పరేఽచః పూర్వవిధౌ_1-1-57) హల్ (హలంతాత్-1-1-84) ఇత్యాదిగా పాణినీయ ప్రత్యాహారాల వినియోగం అతిప్రచురంగా కనబడుతోంది. కాబట్టి ఈతనికి వర్ణమాల మహేశ్వర సూత్రోపాత్త క్రమంలో కృతకమయినదే అని భావించడానికి సందేహింపనవసరంలేదు.

## చాంద్రం :

చంద్రగోమి తన వ్యాకరణంలో పాణినిలాగానే ప్రత్యాహారాది సౌలభ్యంకోసం మహేశ్వర సూత్రోపాత్తమయిన వర్ణమాలను స్వీకరించినా లోక ప్రసిద్ధమయిన క్రమాన్ని కూడా అదేవిధంగా అంగీకరించి కచటతపలను ప్రథమాక్షరాలనీ, గజడదబలను తృతీయాక్షరాలనీ_ఇత్యాదిగా వ్యవహరించాడు. (చాంద్ర వర్ణసూత్రాణి-Appendix_I, Systems of Sanskrit Grammar_Belvalkar)

విసర్గానుస్వారాలను అటుంచితే మొత్తం వర్ణమాలలో మౌలికంగా భేదం లేక పోయినా వ్యంజనాల క్రమంలో ఐంద్ర మాహేశ్వర సంప్రదాయాలకు చాలా తేడా ఉన్నదనీ, పాణినీయమూ ఆ తరువాత ఆ సంప్రదాయంలో వెలువడిన మరికొన్ని వ్యాకరణాలూ ప్రత్యాహారాది సౌలభ్యంకోసం మాహేశ్వర సంప్రదాయన్ని అనుస రించినా ఐంద్రసంప్రదాయంలోని క్రమాన్నికూడా అంగీకరించాయనీ అదే లోక ప్రసిద్ధమయిన సంప్రదాయమనీ ఇక్కడికి సారాంశం.

## ప్రాకృతీయ వర్ణమాల :

సంస్కృత వ్యాకరణాల్లో కనిపించే ఐంద్ర మాహేశ్వర సంప్రదాయాలకు రెండింటికీ ప్రాకృత వ్యాకర్తల్లోకూడా అనుకర్తలున్నారు. వరరుచి హేమచంద్రా దులు మాహేశ్వర సంప్రదాయానుయాయులు. వీరి గ్రంథాల్లో మాహేశ్వర సూత్ర సంపాదితాలయిన ప్రత్యాహారాలవాడుక స్వేచ్ఛగా జరిగింది. చండాదులు కొందరు అల్పసంఖ్యాకులు మహేశ్వర సంప్రదాయానికి భిన్నంగా వ్యాకరణ నిర్మాణంచేశారు. కానీ వీరిని పూర్తిగా ఐంద్ర సంప్రదాయానుయాయులు అనడానికి అవకాశం లేదు. అందుచేతనే వీరిలో కొందరిని స్వతంత్రులుగా పరిశోధకులు పరిగణిస్తున్నారు. (Prakrit Grammarians_Nittidolchi)

వర్ణమాలా నిర్దేశానికి సంబంధించినంతవరకూ ఒకవిధంగా ప్రాకృతవ్యాకర్తలు అందరూ స్వతంత్రులే. సంస్కృత వర్ణమాల యథాతథంగా ప్రాకృతానికి సరిపడదు. అందుచేత మౌలికంగా ఏవర్ణమాలను వీరు స్వీకరించినా అందులో ఏవేవి తమభాషకు ఉండవో చెప్పవలసిన అవసరం వీరందరికీ ఏర్పడింది.

ఈ యీ వర్ణాలు ఉండవు అని కొందరు నిర్దేశింపగా మరికొందరు ఏవేవి ఉండవో లోక వ్యవహారాన్నిబట్టి తెలుసుకోండి అని వదిలేశారు.

ప్రాకృత చంద్రికాకర్త శేషకృష్ణుడు మొదటి కోవకు చెందినవాడు. వర్ణ మాలకు సంబంధించి అతని శ్లోకం ఇది.

2)

ఐ_ఔ_ ఙ క_ ఙ వ_ఋ-ౠ_ఌ_ౡ,
ప్లుత శషాః—సర్గః—చతుర్థీ భ్యసి—ప్రాంతే హల్_
ఙ ఞ నాః పృథక్—ద్వివచనం—
నాష్టాదశ ప్రాకృతేః (1_13)

షడ్భాషా చంద్రికాకర్త లక్ష్మీధరుడు తన గ్రంథావతారికలో_

సిద్ధిః సంస్కృత శబ్దానాం భవేత్పంచాశదక్షరైః
ప్రాకృతానాం తు సిద్ధిః స్యాత్త్రైశ్చత్వారింశదక్షరైః॥_39
ఋ ౠ వర్ణా ఐనై కారౌకారాభ్యాం చ దశ స్వరాః
శషాపసంయుక్త ఙ ఞౌ ఏనై వాన్యే హలో మతాః॥_40

అని ఏయే వర్ణాలు ఉండవో నిర్దేశించాడు. సిద్ధిర్లోకాచ్చ (1-1-1) అనే సూత్ర వ్యాఖ్యలో ఈ విషయాన్ని పొందుపరచాడు.

సిద్ధిరిహ ప్రస్తుతా ప్రాకృతశాస్త్రసంబంధినీ గృహ్యతే.
సా చ లోకాద్భవతి. యస్మాత్ ఋ ౠ వర్ణాభ్యాం,
శషాభ్యామ్, ఐకారౌకారాభ్యాం అసంయుక్త ఙ ఞ కారాభ్యాం
ద్వివచనాచ్చ విరహితః శబ్దోచ్చారః లోక వ్యవహారాదేవ
ఉపలభ్యతే. తస్మాత్ సిద్ధిః లోకాదితి వేదితవ్యమ్.
చకారాత్ వక్ష్యమాణ లక్షణాచ్చ.

ఇత్యాదిగా వ్యాఖ్యానాన్ని కొనసాగించాడు.

స్వతంత్ర సూత్ర నిర్మాతలయిన వరరుచి—చండుడు—హేమచంద్రుడు—వాల్మీకి—త్రివిక్రముడు — వీరెవ్వరూ ప్రాకృత వర్ణమాలను సూత్రస్థం చెయ్యలేదు. వ్యాఖ్యాతలే ఆపనికి పూనుకొన్నారు. వీరితో చండుడు మాహేశ్వర వర్ణమాలను స్వీకరింపలేదు అనడానికి ప్రబలమయిన ఆధారం ఉంది. ఇతడు తన ప్రాకృత లక్షణంలో ఎక్కడా ప్రత్యాహారాలను వాడలేదు. అచ్చు—హల్లు అనే వాటినికూడా స్వీకరింప

లేదు. అంతటా స్వరము వ్యంజనము అనే సంజ్ఞలనే ఉపయోగించాడు. దీన్నిబట్టి ఇతనిదృష్టిలో ప్రాకృత వర్ణమాల లోకవ్యవహార విజ్ఞేయ అన్నమాట. అందుకే "నప్లుతజ నఞాః" (2-19) అనే సూత్రం దగ్గర.

ఐ ఔ స్వరౌ, తతః పశ్చాత్ ఋఋూ ఌౡా చతుః స్వరాః
అః జ ఞ న శషాః సంతి ప్రాకృతే నైవ కర్హిచిత్॥

అని ఒక శ్లోకాన్ని పొందుపరచి ప్రాకృతంలో ఉండని వర్ణాలను తెలియజేసి ఊరుకున్నాడంతే.

సిద్ధిర్లోకాచ్చ (1-1-1) అనే సూత్రానికి త్రివిక్రముడూ లక్ష్మీధరుడూ సింహరాజూ చేసిన వ్యాఖ్యల్లో సారూప్యం చాలా ఉంది. వీరు ముగ్గురూ కూడా ప్రాకృత భాషలో ఏయే వర్ణాలు ఉండవో ఈ సూత్రవ్యాఖ్యలో నిర్దేశించారు.

కాగా ప్రాకృత మణిదీప కర్త కొంత విలక్షణంగా వ్యాఖ్య రచించాడు.
ప్రాకృత శబ్దానాం మధ్యే ఏతే ప్రయోజ్యాః ఏతే న ప్రయోజ్యాః
ఇతి వ్యవస్థాయాః సిద్ధిః నిశ్చయః న కేవలం
వక్ష్యమాణ సూత్రేభ్య ఏవ కావ్యజ్ఞ లోక వ్యవహారాదపి స్యాత్.
తేన అత్ర శాస్త్రే సూత్రాననుశిష్టోఽపి కావ్యాభియుక్త
వ్యవహారస్థో హ్రస్వ ఏజ్ సాధురితి సిద్ధ్యతి.
తేన నీడం—ఞెడ్డం................
ప్రాంచస్తు ఋకారఌకారయోః ద్వివచన
చతుర్థ్యాదీనామప్రయోగో లోక వ్యవహారగమ్య ఇత్యాహుః.
తచ్చింత్యమ్, ఋతోఽత్. ఌక్లృప్త ఇలిః—ద్వివచనస్య
బహువచనమ్—ఇత్యాది సూత్రైరేవ అవగమ్యమానత్వాత్.

పదప్రయోగాదికమే లోక వ్యవహారవేద్యంగానీ, వర్ణమాలాదికం కాదనేది ఇతని అభిప్రాయంగా తెలుస్తోంది. అప్పుడు వర్ణమాల అనేది లోకవేద్యం కాక సంస్కృత ప్రాకృతవ్యాకరణ పరిజ్ఞేయమే అవుతుంది.

క—చ—ట—త—ప లను ప్రథమాక్షరాలనీ, గ—జ—డ—ద—బ లను తృతీయాక్షరాలనీ— ఇలా వర్గీయ వర్ణాలను వాటి స్థానాలను బట్టి వ్యవహరించడం ప్రాకృత వ్యాకరణాల్లో సర్వసాధారణంగా కనిపించేవిషయం.

చండుడు తన ప్రాకృత లక్షణంలో "తస్మిన్ ద్వితీయ చతుర్థయోః ప్రథమ తృతీయౌ" (3–29) అని ఒక సూత్రం రచించి "తస్మిన్ ద్విత్వే వర్తమానయోః ద్వితీయ చతుర్థయోః స్థానే ప్రథమ తృతీయౌ భవతః. సౌఖ్యం—సుక్ఖం—"ఇత్యాదిగా వ్యాఖ్యానించాడు. ఇందులో కచటతపలకు ప్రథమ వర్ణ వ్యవహారమూ గజడదబలకు తృతీయ వర్ణ వ్యవహారమూ స్పష్టంగా కనబడుతోంది. "కతృతీయయోః స్వరే" (3-37) కకారస్య వర్గతృతీయస్య చ స్వరే పరే లోపో భవతి. కోకిలః—కో ఇలో ఇత్యాదికం మరొకటి ఇటువంటిదే. వర్గలలోని వర్ణాలకు ఈ నియతమయిన క్రమం ఐంద్రమేకాని, మాహేశ్వరంకాదు.

"పూర్వముపరి వర్గయుజః" (4–5) అనే వాల్మీకి 1 త్రివిక్రమ సూత్రాన్ని ప్రాకృతాను శాసనకర్త పురుషోత్తముడు

> వర్గాణాం ద్వితీయ చతుర్థయోః శేషాదేశయోః
> ఊర్ధ్వం ప్రథమ తృతీయౌ. (3–20 పుట—156)

అని వ్యాఖ్యానించాడు.

ప్రాకృత రూపావతారకర్త సింహరాజు చేసిన వ్యాఖ్యానం ఇలా ఉంది—

> వర్గ సంబంధినో యుగ్వర్ణస్య ఆదేశస్య వా ద్విత్వ ప్రసంగే
> ఉపరి పూర్వమక్షరం భవతి. వర్గాణాం ద్వితీయస్యోపరి
> ప్రథమం, చతుర్థస్యోపరి తృతీయమిత్యర్థః. (పుట—7)

షడ్భాషా వివరణకర్త ఎలకూచి బాలసరస్వతికూడా ఈ సూత్రాన్ని ఇదే విధంగా వ్యాఖ్యానించాడు.

వర్గ ద్వితీయ చతుర్థయోః ద్విత్వ విధౌ ప్రథమ తృతీయ వర్ణౌ
ఉపరి క్రమేణ వా స్తః. (పుట—47)[1]

ఈ సూత్రాన్నిబట్టీ ఈ వ్యాఖ్యలను బట్టీ వీరు స్వీకరించిన కచటతపాది వర్గీయ వర్ణాలక్రమం మాహేశ్వరంకాదనీ ఐంద్రమేననీ స్పష్టపడుతోంది

వర్ణమాలలోని వర్ణాల క్రమం విషయంలో పాణినివలే ఉభయ సంప్రదాయాలనూ కలగలిపినవారు కొందరూ, వర్ణమాల-దాని క్రమమూ అనేవి లోకవ్యవహార సిద్ధాలు అనేవారు కొందరూ గా ప్రాకృత వ్యాకర్తృ వ్యాఖ్యాతలు ఇరువాగుల వారు అవుతున్నారనేది సారాంశం.

## ఆంధ్ర వర్ణమాల :

సంస్కృత ప్రాకృత వ్యాకరణ సంప్రదాయాలను రెండింటినీ ఆకళింపు చేసుకొన్న ఆంధ్రవ్యాకర్తలు వర్ణమాలలోని వర్ణాలక్రమానికి సంబంధించి ఏ సంప్రదాయాన్ని అనుసరించారో కచ్చితంగా తేల్చి చెప్పడం కష్టం.

కంll ఆదులు స్వరములు నచ్చులు
కాదులొగిన్ వ్యంజనములు హల్లులు నన(గా
మేదివి నెల్లెడ(జెల్లును
గాదులు నైదైదు(గూర్చ నగు వర్గంబుల్.
(ఆం. భా. భూ—16)

---

1. ద్విరుక్తిలో వర్గ ద్వితీయాలకు ప్రథమలు, చతుర్థాలకు తృతీయలు రావడం అక్కడము—ఇబ్బంగి— ఇత్యాదుల్లో తెలుగులోకూడా కనబడుతోంది. దీన్ని వజ్ఝలవారు తెలుగు లేఖనం లోని సంప్రదాయంగా భావించారు. (వ్యా. సం. స—విషయం-280) ఆంధ్ర వ్యాకర్తలెవ్వరూ ఈ విషయాన్ని సూత్రస్థం చేసినట్లు కనబడదు.

కం॥ యరలవలును శషసహలును
నరయఁగ నంతస్థలూష్మలనఁగాఁ జెల్లున్
సరవి నివె పేళ్ళు పెట్టుదుఁ
దిరముగఁ దల్లక్షణములు దెలిపెడుచోటన్.

(ఆం. భా. భూ—17)

ఇలా కేతన మొదట స్వరాలు, తరవాత కకారాది వర్గలు అయిదు, అటుపైని అంతస్థోష్మలు చెప్పడం కాతంత్ర సంప్రదాయానికి అనుకూలంగా ఉంది. అచ్చులు హల్లులు అనే పదాలను ఇతడు ఉపయోగించాడు. ఇవి మాహేశ్వర సంప్రదాయంలో ఏర్పడిన ప్రత్యాహారాలు. కానీ ఇవి కేవలం స్వర వ్యంజనాలకు సంజ్ఞలుగా రూఢిని పొందాయి. అందుచేత కేతన అంగీకరించిన వర్ణమాల మాహేశ్వరం కాదనడమే సమంజసం.

చిత్రకవి పెద్దన (లక్షణసార సంగ్రహం—1—11) కాకునూరి అప్పకవి (అప్పకవీయం—2—7; 8; 19) మరింత స్పష్టంగా కాతంత్ర సంప్రదాయాన్ని ఆవిష్కరించారు.

హ్రస్వదీర్ఘ భేదాలతో స్వరాలను రెండేసిగా పరిగణించడం, అనుస్వార విసర్గలను స్వరాలకోవలో చేర్చడం, స్పర్శలను అయిదేసి ఒక్కొక్క వర్గంగా నియత క్రమంలో విభజించడం, అటుపైని అంతస్థోష్మలను నిల్పడం, ళ—శ—క్ష—వీటి వర్ణాంతరతా స్వీకార త్యాగాలతో వెరసి సంస్కృత భాషకు వర్ణాలు ఏబది అని నిర్వచించడం—అనేది తెలుగు వ్యాకరణాల్లో అంతటా సర్వసాధారణంగా కనిపించే విషయం. కాబట్టి తెలుగు వ్యాకరణాల్లోని వర్ణమాల మాహేశ్వరంకాదు అనడానికి సంకోచింప నవసరంలేదు.

కానీ—ఆంధ్ర కౌముదీ కర్త గణపవరపు వేంకటకవి "జశ్త్వరీతులు" అని పలుచోట్ల పేర్కొనడమూ (ఇక జశ్త్వరీతులు తెలిపెద—ఆం.సా.ప. పత్రిక—సంపుటం—23, సంచిక—2 నుండి 4)—చిన్నయసూరి తన సూత్రాంధ్ర వ్యాకర

ణంలో "ఝయి ద్రుతస్య పూర్ణబిందు రన్యతరస్యామ్" (సంధి—35) 'న చయశ్చరి వికృతిః' (సంధి—36) ఇత్యాదిగా ఝయ్—చర్—మొదలయిన ప్రత్యాహారాలను వాడడమూ కనబడుతోంది.

ఆంధ్ర శబ్ద చింతామణిలో "ఏజ్—ఐచ్" అనే ప్రత్యాహారాలు కనబడుతున్నాయి. చిత్రకవి పెద్దన్న తన లక్షణసార సంగ్రహంలో ఏచ్చులు (1—29, 34) అనే ప్రత్యాహారాన్ని ఉపయోగించాడు. ఇవన్నీ మాహేశ్వర సంప్రదాయాన్ని స్ఫురింపజేస్తున్నాయి.

కాబట్టి పాణినిలాగానే ఆంధ్ర వైయాకరణులుకూడా వర్ణమాలలో రెండు రకాల క్రమాలనూ యథావసరంగా ఉపయోగించుకున్నారనడమే ఉచితంగా కనబడుతోంది.

## ఉచ్చారణ సౌకర్యం :

వర్ణమాలలో వ్యంజనాలను నిర్దేశించేటప్పుడు వాటిపైని ఉచ్చారణ సౌకర్యం కోసం అత్త్వాన్ని ఉంచడం మహేశ్వర సూత్రాలలో కనబడుతోంది. అందుకే ఆ సూత్రాలు అయిన వెంటనే "హకారాదిషు అకార ఉచ్చారణార్థః" అని భట్టోజి దీక్షితులవారు స్పష్టంగా పేర్కొన్నారు. (బాలమనోరమ, ప్రథమ. పుట—4)

కాతంత్రంలో కూడా ఈ సంప్రదాయం కనబడుతోంది. "కషయోగే క్షః" (సంధి—259) అనే సూత్రంలో కకార షకారాలమీది అకారం కేవలం ఉచ్చారణ కోసమే. కాకపోతే 'క్ష' అనే సంయుక్తాక్షరసిద్ధి కలగదు.

ఇదే సంప్రదాయం ప్రాకృత వ్యాకరణాలలోనూ కనబడుతోంది. "కగచజ తదపయవాం ప్రాయో లోపః" (2—2) ఉపరిలోపః కగడతదప పసామ్ (3—1) అనే ప్రాకృత ప్రకాశికా సూత్రాలలో కాదుల మీది అత్వం ఉచ్చారణ సౌకర్యం కోసమే. లేకపోతే 'ఐఉలం'—ణిట్ఠురో' ఇత్యాది రూపాలు సిద్ధింపకపోవలసి వస్తుంది. వాల్మీకి/త్రివిక్రమాది వ్యాకర్తలందరూ ఈ మార్గాన్నే అనుసరించారు.

తెలుగు వ్యాకరణాల్లో కూడా ఇదే సంప్రదాయం పాటింపబడింది. "కగ చజయుగ టడణ తదన పబమ యరలవ సహళం తు హల్వర్గః" (సంజ్ఞా—13) అనే ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రంలో కాదులమీది అత్వం ఉచ్చారణ సౌకర్యంకోసమే. అలాగే "కచటతపాః పరుషాఖ్యాః, గజడదబాస్తు సరళాః" (సంజ్ఞా— 31, 32) ఇత్యాది స్థలాల్లోనూ. లేకపోతే అద్భిన్నాచ్చుతో కూడిన కాదులకు పరుషాది సంజ్ఞలు సిద్ధింపకపోవలసి వస్తుంది.

అయితే పాణినీయంలో ఉచ్చారణ సౌకర్యంకోసం అద్భిన్నాచ్చులను కూడా స్వీకరించడం జరిగింది. (చ్లి లుఙి_3_1—43). అల్లాగే అత్వము కొన్ని తావుల్లో సార్థకమూ అయ్యింది. (వృద్ధాచ్ఛః_4_2_114) అందుచేత ఎక్కడ ఏ అచ్చు ఉచ్చారణార్థము అనేది వ్యాఖ్యాన సాపేక్షమూ ప్రయోగైక వేద్యమూ అయ్యింది.

ఆంధ్ర శబ్ద చింతామణిలో "ద్రుతాఖ్యోనః" (సంజ్ఞ—30) అనేచోట నకారం మీది అత్వం ప్రయోగంలో మిగలడంలేదుకాబట్టి ఉచ్చారణార్థమే. 'నః కౌ' (అజంత—24) అనే విధానంలో నకారంమీది అత్వం ప్రయోగంలో మిగులుతుంది కాబట్టి ఉచ్చారణార్థంకాదు.

చిన్నయసూరి తన బాలవ్యాకరణంలో యడాగమాన్ని విధించాడు. (సంధి_3) ఇందులోని అత్వం ఉచ్చారణ సౌకర్యంకోసమే లేకపోతే "మా + అమ్మ" అనే చోట "మా + య + అమ్మ" అని ఏర్పడి అటుపైని అత్వసంధిని బాహుళకంచేత నిత్యంగా చేయవలసిన ప్రక్రియా గౌరవం ఏర్పడుతుంది.

"కొండొకచో సమాసంబులందు నామ్యాది కనుమ్వాదుల మువర్ణంబులు పఞ్వ వర్ణంబులగు" (సమాస—19) 'తజ్వర్ణకంబు చేయ్యాదులకగు' (కృదంత—5) ఇత్యాది సూరి విధానాల్లో వ —తల మీది అత్వం ఉచ్చారణార్థంకాదు.

వుగాగమ టుగాగమాదుల్లో ఉత్వం ఉచ్చారణార్థమే కాగా ముగాగమ పుంప్వాదేశాల్లో అది అటువంటిది కాదు.

ఇలా ఆంధ్ర శబ్ద చింతామణి బాలవ్యాకరణ విధానాల్లో పలుచోట్ల ఎక్కడ ఏ అచ్చు ఉచ్చారణార్థము అనేది వ్యాఖ్యాన సాపేక్షమూ ప్రయోగైక వేద్యమూ అవుతోంది.

అందుచేత ఉచ్చారణ సౌకర్యం కోసం అత్వాన్ని మాత్రమే వ్యాకర్తలు ఉపయోగిస్తారు అని నిర్ణయించడానికి వీలులేదు.

**అం - అః :**

అనుస్వార విసర్గలకు మహేశ్వర సూత్రాలలో సాక్షాత్పాఠం కనబడడంలేదు అనుస్వార పాఠాన్ని కొందరి మతంగా వ్యాఖ్యాతలు చెబుతున్నారు. ఇటువంటివి అయోగవాహాలు అని అయిదవ మహేశ్వర సూత్రం దగ్గర భాష్యకారుడు చర్చించాడు.

ఈ రెండింటినీ అకారపూర్వాలుగా నిర్దేశించే సంప్రదాయం కాతంత్రంలో కానవస్తోంది.

అః ఇతి విసర్జనీయః (సూ—18)
అం ఇత్యనుస్వారః (సూ—21)

చండుడుకూడా తన ప్రాకృతలక్షణంలో ప్రాకృతభాషలో ఉండని వర్ణాలను నిర్దేశించే శ్లోకంలో "........అః ఙ ఞ న శషాః (2–19) అని విసర్గను అత్పూర్వకంగానే పొందుపరచాడు.

ఈ అనుస్వార విసర్గలకు స్వభావతః స్వయంప్రకాశకత లేదుకాబట్టి వీటి నిర్దేశం అన్యవర్ణాపేక్ష సహితమనడంలో విప్రతిపత్తిలేదు. కానీ ఆ అన్యవర్ణం అకారమే అవ్వాలనీ లేదు. కకారాదివ్యంజనాల నిర్దేశానికి అత్వాన్ని ఉపయోగించారు కాబట్టి వీటికీ దానినే ఉపయోగించారు అనేది సమన్వయం కావచ్చు. భాషలో ఈ అనుస్వార విసర్గలకు ముందు ఏస్వరమయినా ఉండవచ్చు. కాగా వీటిని ఇలా అత్పూర్వాలుగా నిర్దేశించడం అశోక వనికా న్యాయమే అవుతుంది.

3)

రూపమాలా వ్యాఖ్యాత భావసేనుడు పై కాతంత్ర సూత్రాల వ్యాఖ్యానంలో "అకార ఇహ ఉచ్చారణార్థః యథా కాదిషు" అని స్పష్టంగా చెప్పాడు.

ఈ సందర్భంలో ఇతడు "యేన వినా యదుచ్చారయితుం న శక్యతే స ఉచ్చారణార్థో భవతి" అని ఒక నిర్వచనం చేశాడు. ప్రత్యేక ప్రయోజనమేదీ కానరానప్పుడేగదా సందేహంవచ్చేది. అందుచేత ఈ నిర్వచనం విస్తృతమయినదిగా అందరికీ అంగీకార్యంకావడంలో విప్రతిపత్తిలేదు.

భట్టోజి దీక్షితులవారు ఈ అనుస్వార విసర్గలను "అం-అః–ఇత్యచః పరావనుస్వారవిసర్గౌ" (బాలమనోరమా–పుట-17) అని నిర్దేశించడం ఈ కాతంత్రప్రభావం వల్లనూకావచ్చు లేదా కాతంత్రంకంటే ముందు ప్రాతిశాఖ్యాది నిర్దేశమేదయినా ఉండి ఉండనూవచ్చు.

తెలుగు లాక్షణికులందరూ ఈ అనుస్వార విసర్గలను అకారపూర్వకాలుగానే నిర్దేశించారు. (ఛందోదర్పణము—4—124 ప) బాలసరస్వతీయం అం అః లతో. కలిపి "ఈ పదునాలుగు వర్ణములు నచ్చులు" అని స్పష్టంగా పేర్కొంది (పుట—153). అప్పకవికూడా "—తత్స్వరూపంబులు—అం—ఇది పూర్ణానుస్వారము, అః—ఇది విసర్జనీయము—ఇవి అచ్చులు" అని తేల్చి చెప్పాడు.

(అప్పకవీయము—పుట—48, వచనము ...22)

చిన్నయసూరి తన బాలవ్యాకరణంలో సంస్కృత ప్రాకృత భాషలకు వర్ణాలను నిర్దేశించిన తొలి రెండు సూత్రాల దగ్గరా—అం—అః—అని అచ్చులలోనే వీటిని పేర్కొన్నాడు. కాతంత్రంనుంచి అందిపుచ్చుకొన్న ఈ అకారపూర్వనిర్దేశాన్ని తెలుగుకు కూడా కొనసాగించి మూడవసూత్రంలో—అఁ—అని అర్ధానుస్వారాన్ని ప్రదర్శించాడు. శబ్ద లక్షణ సంగ్రహంలోనూ దీనిని ఇలాగే నిర్దేశించాడు. (శ. ల. సం. 1—8) అటుపైని ఈతని అనుయాయులందరూ ఈ మార్గాన్నే అనుసరించారు.

వీటిని ఇలా అంతటా అకారపూర్వాలుగా నిర్దేశించినందువల్ల అనుస్వార విసర్గలకు ముందు అత్త్వం తప్ప మరొక స్వరం ఉండదేమో అనే భ్రాంతి కలగ డానికి అవకాశం లేకపోలేదని భావించాడోయేమో వెంకయ్యమాత్రం తన ఆంధ్ర వ్యాకరణంలో వీటిని అం — అః — అని అచ్చులతో నిర్దేశించి అటుపైని వివరణంలో అత్త్వాన్ని పరిహరించాడు. (వెం. వ్యా. సంజ్ఞా—సూ—6) ఖండానుస్వార పూర్ణాను స్వారాలను అత్వపూర్వతా రహితంగానూ చూపించాడు. (వెం.వ్యా.సంజ్ఞా—సూ—8)

అనుస్వార విసర్గలను ఉభయాక్షరాలు గా సంస్కృత వ్యాకరణ వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. చిన్నయసూరి తన సూత్రాంధ్ర వ్యాకరణంలో "ఉభయే ఃక ఃపాః" (సంజ్ఞా-15) అని అందుకే సూత్రించి ఉంటాడు. పద్యాంధ్రవ్యాకరణంలోకూడా—

ఆదులు పదారు స్వరములు, కాదికములు
ముప్పదియునాల్గు వ్యంజనంబులనఁ దనరు;
బిందువు విసర్జనీయంబు వెలయు వ్యంజ
నములునన నాద్యభాషఁ బన్నగ నగేశః

అని "వ్యంజనములును" అనే సముచ్చయంతో వీటి ఉభయాక్షరతను సూచించాడు. కానీ వీటి తరువాత బాలవ్యాకరణంలో మాత్రం ఈ రెండింటినీ కేవలం అచ్చులలోనే పరిగణించి ఊరుకొన్నాడు. (బా.వ్యా. సంజ్ఞా.—1)

అహోబలపండితుడు "ప్రాయస్తుస్యాత్క్రమాదిక స్యేతః" (ఆం.శ.చిం.సంధి.9) అనే సూత్ర వ్యాఖ్యానంలో—ఏకపదంలో అనుస్వారం పరంగా ఉన్నప్పుడు దాని అత్త్వాన్ని పురస్కరించుకొని స్వరసంధిని ఆశంకించి "అనుస్వారే పరేత్వత్ర న సంధిః. ఏకపదే సంధ్యభావాత్., సంధి స్త్వపద ఇతి ప్రాకృత సూత్రాత్. పరరూప లక్షణ సంధేరసంభవాచ్చేతి జ్ఞేయం." అని కారణాంతరాలతో వారించాడు.

వర్ణమాలలో వీటిని అచ్చులకోవలో చేర్చినప్పటికీ అనుస్వార విసర్గల అచ్చ్వాన్ని పురస్కరించుకొని విధింపబడిన కార్యాలు ఏవీకూడా తెలుగు వ్యాకరణాలలో లేవు. అటువంటి కార్యాలేవీ ఈ భాషలోని పదాలకు లేకపోవడమే దీనికి కారణం.

వీటిలో అనుస్వార స్వభావాన్ని గురించి జయంతి రామయ్యపంతులుగారి అభిప్రాయం—"తెలుగులోని అనుస్వారము నిజముగా హల్లుగాని యచ్చు గాదనియు నీవ్యాసము ఫలితము"—గమనింపదగినది. (ఆం. సా. ప. పత్రిక—సంపుటం—18, సంచిక—1, పుట—45—వ్యాసం—'(డు')

వక్రాలూ వక్రతమాలూ :

సంస్కృత భాషా వర్ణమాలను ఆదర్శంగా స్వీకరించి వాటిలో ఇవ్వి ఇవ్వి మాభాషకు లేవు, ఇవ్వి అధికంగా ఉన్నాయి (హ్రస్వఏజ్—ప్రాకృతమణిదీపిక) అని ప్రాకృత వ్యాకర్తలు చెప్పుకున్నట్టే తెలుగు వ్యాకరణ కర్తలుకూడా ముందు సంస్కృతవర్ణమాలనూ, అటుపైని ప్రాకృతవర్ణమాలనూ చెప్పి వాటిలో ఇవ్వి ఇవ్వి తెలుగులో ఉండవు, ఇవ్వి ఇవ్వి అధికంగా ఉన్నాయి అని చెప్పడం ప్రారంభించారు. లేని వర్ణాలు తత్సమాలతోకూడి తెలుగులో ప్రవేశిస్తాయి అని చెప్పారు. ఆంధ్ర శబ్ద చింతామణి—బాలవ్యాకరణము ఈ పద్ధతికి చెందినవి. ఇలా చెప్పడంవల్ల సౌలభ్యంతో పాటు స్పష్టత, తత్సమాది శబ్ద పరిగణన జ్ఞానమూ మొదలయిన ప్రయోజనాలు కూడా కొన్ని నెరవేరాయి. మరికొందరు ఈ మార్గం విడిచి తత్సమాదులతో కూడిన మొత్తం ఆంధ్రభాషకు వర్ణాలు ఇన్ని అని చెప్పనారంభించారు. ఛందోదర్పణ త్రిలింగ లక్షణ శేషాలు ఈ పద్ధతికి చెందినవి.

ఇది ఇలా ఉండగా వర్ణమాలలోని కొన్ని వర్ణాలకు సంస్కృత ప్రాకృత వ్యాకరణాతిరిక్తంగా కొత్త సంజ్ఞలు కొన్ని తెలుగు వ్యాకరణాల్లో కనబడు తున్నాయి. వక్ర—వక్రతమ—పరుష—సరళ—(దుతాది సంజ్ఞలు అట్టివి.

ఆంధ్ర శబ్ద చింతామణిలో "ఏజథో వక్రః—వక్రతమ ఐచ్" (సంజ్ఞా-27,28) అనే సూత్రాలు వక్ర వక్రతమ సంజ్ఞలను విధిస్తున్నాయి.

రావణ కృత ప్రాకృత వ్యాకరణంలో వక్రతమ సంజ్ఞ ఉన్నట్టు అధర్వణ కృత త్రిలింగ శబ్దానుశాసనం సూచిస్తున్నదని డా. అమరేశం రాజేశ్వర శర్మగారు అంటున్నారు. (ఆంధ్ర వ్యాకరణ వికాసము, ప్రథమ, పుట—133, 134)

'ఏ ఓ ఙ్' (సూ—3) అనే మహేశ్వర సూత్రాన్ని ప్రత్యాహారంచేస్తే 'ఏ ఙ్' ఏర్పడుతుంది. ఏ—ఓ లకు వక్ర సంజ్ఞ. అల్లాగే "ఐ ఔ చ్" (సూ—4) అనే మహేశ్వర సూత్రాన్ని ప్రత్యాహారంచేస్తే 'ఐచ్' ఏర్పడుతుంది. ఐ—ఔ లకు వక్రతమ సంజ్ఞ. ఈ పాణినీయ ప్రత్యాహారాల్లో హ్రస్వాలయిన ఎ—ఒ లు ఉండవు కాబట్టి నిజానికి ఈ రెండింటికీ వక్ర సంజ్ఞ సిద్ధింపదు. అందుచేతనే బాలసరస్వతి ఈ సూత్రాల వ్యాఖ్యానంలో "ఏకారౌకారములు, ఐకారౌకారములు" మాత్రమే ఈ సంజ్ఞలకు విషయంగా పేర్కొన్నాడు. (పుట—158)

అహోబల పండితుడుకూడా "ఏఙ్ ప్రత్యాహారగతౌ ఏకార ఓకారశ్చ వక్రావితి విశేష సంజ్ఞకౌ భవతః" అనీ "ఐకార ఔకారశ్చ వక్రతమావితి విశేష సంజ్ఞకౌ భవతః" అనీ మాత్రమే వ్యాఖ్యానించాడు.

ఈ రెండు సూత్రాలకూ పారనంది రామశాస్త్రుల్లుగారు చేసిన ఉద్యోతినీ వ్యాఖ్యానం సమంజసంగా కనబడడంలేదు.

అథో—అనంతరమ్, ఏఙ్—ఎ ఏ, ఒ ఓ, ఏతే వక్రః—వక్రసంజ్ఞకాః.
ఏజితి ప్రత్యాహారః. (పుట—24)

ఐచ్- ఐకారౌకారౌ, వక్రతమః-తత్సంజ్ఞకౌ. ఏజపేక్షయా అతీవ వక్రౌ.
ఏతే సంస్కృత సిద్ధా ఏవ. తదత్రాపి ప్రత్యాహారాః. (పుట—25)

("అథః" అనడానికి బదులు 'అథో' అనడం అచ్చుతప్పు కాదు. 'నమో' అన్నట్టు ఓకారాంతావ్యయంగా 'అథో' ఉంది—వాచస్పత్యం.) 'ఏఙ్ అనే దాన్ని ప్రత్యాహారంగా పేర్కొంటూ హ్రస్వాలయిన ఎ- ఒలను దానిలోకిచేర్చడం సమంజసం కాదు. వీరు ఈ సంస్కృత వ్యాఖ్యానాన్ని తెలుగు లిపిలో వ్రాశారుకాబట్టి ఇలా

జరిగింది అదే నాగరి లిపిలో వ్రాసి ఉంటే హ్రస్వమయిన ఎ-ఒ లకు లిపి చిహ్నం లేదుకాబట్టి బహుశ ఈ అనౌచిత్యం దొర్లి ఉండేదికాదేమో! 'ఏ తే' అనేది బహు వచనం. 'వక్రః' అనేది ఏకవచనం. 'వక్రసంజ్ఞకాః' అని బహువచన రూపం ఇచ్చారు. 'వక్రతమః' 'తత్సంజ్ఞకౌ' అని ద్వివచన రూపం ఇచ్చారు. ఇవి ఇలా ఉండగా 'ఏజపేక్షయా అతీవ వక్రాః' అనే మాటనుబట్టి వీరుకూడా ఈ సంజ్ఞలను లిపిలోని వక్రతనుబట్టి ఏర్పడినవిగానే భావించారని తెలుస్తోంది.

ఈ ఏర్పరచిన రెండు సంజ్ఞలలోనూ వక్రసంజ్ఞకు వినియోగం ఆంధ్ర శబ్ద చింతామణిలో కనబడ్డంలేదు. వక్రతమ సంజ్ఞకూడా 'వాయిరవుర్వక్రతమౌ' (అజంత-65) అనేచోట మాత్రమే వినియోగింపబడింది. కాగా హ్రస్వాలయిన ఎ-ఒ-లకు వక్రసంజ్ఞ అనువర్తిస్తుందా? లేదా? అనే సందేహం మిగిలిపోతుంది.

ఆంధ్ర శబ్ద చింతామణిని ఆంధ్రీకరించడానికి పూనుకొన్న అప్పకవి:-

ఏక మోక మిట్టు లేత్వంబు నోత్వంబు
నమర భాష విడుదలగును గాని
హ్రస్వ లిపులు గావు, హల్లుపై నట్లన
యగును కేకి కోకిలాళి యనఁగ

పెక్కురేల కృష్ణుఁడొక్కఁడోపఁడె పని
నెలవు నేల యరసి పొలము వోవ
ననఁగ విట్టు దెనుఁగులందు వక్రయుగంబు
హ్రస్వములును విడుద వ్రాలు నగును. (అప్పకవీయం-2-73,74)

అని ఎ-ఒ-లను హ్రస్వ వక్రాలుగా ప్రతిపాదించాడు. అప్పటినుంచీ వ్యాకర్త లందరూ వీటితోకలిపి ఎ-ఏ, ఒ-ఓ లను నాలుగింటినీ వక్రాలుగానూ, ఐ-ఔ-లను రెండింటినీ వక్రతమాలుగానూ వ్యవహరిస్తూ వచ్చారు.

చిన్నయసూరి తన సూత్రాంధ్ర వ్యాకరణంలో 'ఏజ్వక్రః' 'ఐజ్వక్రతమః' (సంజ్ఞ_45, 46) అని యథాచింత మణి చెప్పినా, శబ్దలక్షణ సంగ్రహంలోనూ (1_11) బాలవ్యాకరణంలోనూ (సంజ్ఞా-సూ_2) 'ఎ-ఏ_ఒ-ఓ లు వక్రంబులు" అని నాలు గింటినీ కలిపాడు. అలాగే 'హ్రస్వ వక్ర ఖండబిందు దంత్యచజలనాద్యంబులు' (సంజ్ఞా_సూ_9) అనే ఈతని ఆంధ్ర శబ్దాను శాసన వచనమూ

హ్రస్వ వక్రముల్ దంత్య చజాక్షరములు
ఖండ బిందువు సాంస్కృతికములు గావు (సంజ్ఞా_9)

అనే పద్యాంధ్రవ్యాకణోక్తి స్పష్టంగా అప్పకవీయ ప్రభావాన్ని పట్టి ఇస్తున్నాయి

అయితే ఈ అప్పకవీయ వ్యవహారం ఆంధ్ర శబ్ద చింతామణికి సమ్మత మయినదిగా కనబడడంలేదు. ఎందుకంటే_హ్రస్వాలయిన ఎ_ఒ లను విధింప వలసి వచ్చినచోటకూడా ఆంధ్ర శబ్ద చింతామణి సంస్కృత భాషా లిపి సంప్రదా యానుసారం దీర్ఘాలనే విధించి అస్పష్టతనయినా అంగీకరించిందిగానీ హ్రస్వవక్ర సంజ్ఞను ఉపయోగించలేదు. "ఏదంతతా చ నామ్నామన్యతరస్యామియాంతానామ్" (అజంత___82) 'ప్రథమైక స్యైద్భవేచ్చ భూతార్థే' (క్రియా___30) ఈ రెండు విధానాలనుబట్టీ, ముత్తేము_చూచేను అని అపరూపాలు సిద్ధించే ప్రమాదంలేక పోలేదు. హ్రస్వవక్ర సంజ్ఞను ఉపయోగించి ఉంటే ఈ ప్రమాదం ఒకింత తగ్గి ఉండేది. అలా ఉపయోగించలేదు. కాబట్టి హ్రస్వాలయిన ఎ_ఒ-లను వక్రాలుగా స్వీకరించడం చింతామణికి సమ్మతంకాదని మనం భావించవచ్చు.

యథాతథంగా చూసినప్పుడు ఏ_ఓ_ఐ_ఔ అనే దీర్ఘాలను ఆంధ్ర శబ్ద చింతా మణి వక్రాలూ వక్రతమాలూగా పేర్కొంది అనడం ఉచితంగా కనబడుతోంది.

వీటికి వక్ర వక్రతమ సంజ్ఞలు లిపిలోని వక్రతనుబట్టి ఏర్పడి ఉంటాయనే ఊహ కందుకూరి వీరేశలింగం పంతులుగారితో మొదలయ్యిందని డా. ఎ పున్నారావు గారు తమ సిద్ధాంత వ్యాసంలో పేర్కొన్నారు. (సంస్కృతంలో వ్రాసిన ప్రసిద్ధాంధ్ర

వ్యాకరణాలు-ఒకపరిశీలన, యం. యస్, పుట— 121). ఈ ఊహను తరువాత తరువాత చాలామంది వ్యాఖ్యాతలూ విమర్శకులూ అంగీకరించారు.

డా. బొడ్డుపల్లి పురుషోత్తంగారు తమ సిద్ధాంత వ్యాసంలో వీటి వక్రత లిపికి సంబంధించినది కాదనీ, ఉచ్చారణకు సంబంధించినదేననీ, అది యంత్ర సహాయ నిరూప్యమనీ భావించారు. (తెనుగు వ్యాకరణ వికాసము, ప్రథమ, పుట—17నుంచి19) అంతేకాదు ఈ సందర్భంలో వీరు 'ఆకృతిని బట్టి ధ్వనులకిట్లు సంజ్ఞ లేర్పఱచుట, ఒక్క శకట రేఫమునకుఁ దప్ప నితరత్ర కానుపించదు' (పుట—19) అని ఒక తీర్మానం చేశారు. కానీ అటుపైని అనుస్వారాన్ని గురించి ప్రస్తావిస్తూ వీరే తమ ఈ తీర్మానానికి బాధకంగా "తెలుగున అనుస్వారము, బిందువు, బొట్టు, సున్న—అను సంజ్ఞలు ఉపయుక్తములు. అనుస్వారము ఉచ్చారణ ధర్మము. తక్కినవి లేఖన చిహ్నములను బట్టి యేర్పడినవి". (ప్రథమ, పుట-81) అని పేర్కొనడం జరిగింది.

ఇది ఇలా ఉండగా—వక్ర వక్రతమాది సంజ్ఞలకు సార్థకతను కల్పించడానికి పరిశోధకులు కొందరు పాటు పడుతున్నారు అనేది సారాంశం. శాస్త్రంలోని సంజ్ఞలన్నీ సార్థకాలే అవ్వాలని లేదు. రూఢాలుకూడా ఉంటాయి. కానీ సాధ్యమైనంతలో సార్థకతా సంపాదనంకోసం ప్రయత్నించడం తప్పుకాబోదు.

ఛందశ్శాస్త్రంలో గురువు అనేదానికి 'గ్—గ' అనేవీ, లఘువు అనే దానికి 'ల్—ల' అనేవీ సంక్షేప సంకేతాలుగా సుప్రసిద్ధాలు. వీటిలో గురు వర్ణాన్ని గుర్తించడానికి వక్రరేఖ (ᴗ) లఘువును గుర్తించడానికి ఋజురేఖ (।) వృత్తరత్నాకరాదుల్లో వినియుక్తాలు.

అహోబలపండితుడు 'దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ స జ్ఞేయః (ఆం.శ.చిం—సంజ్ఞా-10) అనే సూత్ర వ్యాఖ్యానంలో వృత్తరత్నాకరంలోని రెండు శ్లోకాలను ఉదాహరించాడు. (పుట—198)

> సానుస్వారో విసర్గాంతో దీర్ఘో యుక్త పరశ్చ యః
> వా పాదాంత స్త్వసౌ గ్వక్రో జ్ఞేయో అన్యో మాత్రకో ల్బుజుః॥
> పాదాదావిహ వర్ణస్య సంయోగః క్రమ సంజ్ఞకః
> పరస్థితేన తేన స్యాల్లఘుతాపి గురోః క్వచిత్॥

వీటిలో మొదటి శ్లోకంలో రెండవ పాదానికి 'పాదాంతే యో లఘు స్తిష్ఠతి సోఽప్యపేక్షయాం గురుర్భవతీత్యర్థః' అనేది కనకసభాపతి వృత్త రత్నాకర వ్యాఖ్యలో పేర్కొన్న అర్థంగా చూపించాడు.

"పాదాంతః అసౌ మాత్రృకః వా గ్వక్రః ఇతి జ్ఞేయః, అన్యః మాత్రృకః ల్ఋజుః ఇతి జ్ఞేయః" అనేది అన్వయం.

ఇందులో 'గ్వక్రః" అనేచోట గ్+వక్రః=గ్వక్రః అనేది పదవిభాగం. "గ్" అనేది గురువుకు సంక్షేప సంకేతంకాగా వక్రః (‿) అనేది గురువర్ణానికి గుర్తు అవుతోంది. ఇల్లాగే ల్+ఋజుః=ల్ఋజుః (।) అనేచోట కూడా.

ఈ రీతిగా సంస్కృతచ్ఛందః కర్తలు గురు వర్ణానికి రేఖా సంకేతంగా వాడిన వక్రశబ్దాన్ని ఆంధ్ర శబ్ద చింతామణి ఏ—ఓ లకు సంజ్ఞగా స్వీకరించి ఉండవచ్చు.

ఆంధ్ర శబ్ద చింతామణి మతంలో హ్రస్వాలయిన ఎ—ఒ—లు వక్రసంజ్ఞా పరిధిలోకి వస్తున్న ఆధారాలు లేవు అని ఇంతకు ముందే అనుకొన్నాం. కాగా దీర్ఘాలయిన ఏ–ఓ—లు మాత్రమే వక్రాలుగా నిర్ధారింపబడ్డాయి. అందుచేత పైరీతిలో ఈ వక్ర సంజ్ఞకు ఒక సమన్వయం కుదురుతుంది. ఏ–ఓ లు దీర్ఘాలు కాబట్టి ఎల్ల వేళలా గురువులే.

ఐ–ఔ—లు కూడా అంతే. వీటిని దీర్ఘాలుగానూ గురువులుగానూ ఛందో వ్యాకర్తలందరూ అంగీకరించారు. కాగా ఏ—ఓ లకూ వీటికీ భేదాన్ని సూచించడానికి 'తమప్' ప్రత్యయాన్ని చేర్చి వక్రతమ సంజ్ఞను విధించి ఉండవచ్చు. అంటే ఈ వక్ర—వక్రతమ సంజ్ఞలు ఆ అచ్చుల ఉచ్చారణలోని గురుత్వ ధర్మాన్నిబట్టి ఏర్పడినవి కావచ్చునని. ఇది ఒక ఊహ మాత్రమే. తెలుగులో ద్రుతస్థిరాది సంజ్ఞలు మరికొన్ని ఇలా ధర్మాన్నిబట్టి ఏర్పడినవి ఉండడం గమనింపదగినది.

జ్యౌతిషమూ :

ఛందో వ్యాకరణ జ్యౌతిషాది షడంగాలకూ పర్యవసానంలో ఫలం ఒకటే. అన్నింటి పుట్టుకా వేదార్థ నిరూపణం కోసమే. యజ్ఞయాగాది కర్మానుష్ఠానానికి

సుముహూర్త నిర్ణయంకోసం జ్యోతిషం ఆవిర్భవించింది. వేదాంగం అయ్యింది. ఇల్లాగే తక్కినవీను.

లక్ష్యంలోని ఐక్యాన్ని పురస్కరించుకొని ఈ షడంగాలకూ ఆంతరంగికమయిన సమైక్యం బహుథా నిరూపితమయ్యింది. ఇవి పరస్పర పరిపోషకాలు. వ్యాకరణంలో ఛందఃప్రసక్తి, ఛందస్సులో వ్యాకరణ జ్యోతిషాల ప్రసక్తి తరచు కనబడుతూ ఉంటుంది.

తెలుగులోని ఛందో వ్యాకరణాల్లోకూడా ఈ సంప్రదాయం స్పష్టంగా కనబడు తోంది. అక్షరాలకూ గణాలకూ అధిదేవతలను చెప్పడమూ, శుభాశుభాలను నిర్ణయించడమూ ఈ మొదలయిన జ్యోతిష ప్రసక్తి విస్తృతంగానో సంగ్రహంగానో ఛందోదర్పణాదుల్లో ఉంది. అలాగే వ్యాకరణాంశాలూ ఉన్నాయి. ఆంధ్ర శబ్ద చింతామణి మొదలుకొని వ్యాకరణ గ్రంథాల్లో ఛందః ప్రసక్తి ఉంది. అప్పటికిగానీ తమ శాస్త్ర గ్రంథాలకు పారిపూర్ణ్యం సిద్ధింపదనికూడా వీరు భావించి ఉండవచ్చు.

"ఏకశ్వ శ్రేయః కావ్యమ్" అనే ఆంధ్ర శబ్ద చింతామణిలోని మొదటి సూత్రంలో కనిపించే వర్ణాల క్రమాదులను బట్టి నన్నయ భట్టారకుని జాతక చక్రాన్ని అహోబలుడు చూపించగలిగాడు. వీటి సంబంధం అంతటిది.

అందుచేత వ్యాకరణ శాస్త్రంలోని సంజ్ఞలకు సార్థకతను కల్పించే సన్నివేశంలో ఇతర శాస్త్రాలతో ప్రసక్తి అనేది పెట్టుకోరానిదేమీకాదు.

వక్రాః స్యుః పంచ షష్ఠే ఒర్కేఒతివక్రా నగాష్టమే। (గే)
నవమే దశమే భానౌ జాయతే సహజా గతిః ॥

ద్వాదశైకాదశే సూర్యే లభంతే శీఘ్రతాం పునః।
రవి స్థిత్యంశక త్రింశావధేః సంఖ్యాత్ర కల్ప్యతే॥

న తు రాశ్యంతర స్పర్శాత్ ద్వితీయాది నిరూపణమ్।
రాహూ కేతూ సదా వక్రౌ శీఘ్రగౌ చంద్ర భాస్కరౌ॥

ఈ శ్లోకాలను జ్యోతిస్తంత్రంనుంచి ఆధారాలుగా ఉదాహరిస్తూ శబ్ద కల్ప ద్రుమం 'వక్రః' అనేపదానికి' సతు యస్య గ్రహస్యాశ్రితాత్ రవ్యధిష్ఠిత రాశేయ త్రింశాంశాంతర్గతా దంశాత్ పంచమ షష్ఠాంశే రవి స్థితి" అని అర్థాన్ని ఇచ్చింది. (చతుర్థ, పుట-242)

ఇందులో పంచ షష్ఠ స్థానాల్లోని రవి స్థితికీ గ్రహాంతర వక్రగతికీ సంబంధం ఉంది అన్నంత వరకూ మనకు చాలు.

ఇటువంటి సంబంధాన్ని గౌణంగా స్వీకరించి చింతామణికర్త ఏ. ఓ లకు వక్ర సంజ్ఞను కల్పించి ఉండవచ్చు అనేది మరొక ఊహ.

ఋ ౡ వర్ణయోర్మిథస్సావర్ణ్యం వాచ్యం (వార్తికం-105, బాలమనోరమా-17) అని పాణినీయులే చెబుతున్నారు కాబట్టీ, 'తవల్కారః' అనే ఉదాహరణంవల్ల ౡ వర్ణాదులయిన పదాలు లౌకిక సంస్కృతంలోనే లేవు అనే విషయం సుప్రతిష్ఠితం అవుతోంది కాబట్టీ, అచ్చులలో ౡ కారాన్ని విడిచి 'ఋ' ను మాత్రమే పరిగణించి క్రమంగా లెక్కిస్తే- అ—ఇ—ఉ—ఋ—ఏ—ఓ—ఐ—ఔ

1—2—3—4—5—6—7—8

అయిదు ఆరు స్థానాల్లో ఏ-ఓ-లు ఉంటాయి. అందుచేత వీటికి వక్రాలు అనే సంజ్ఞను లాక్షణికంగా ఏర్పరచి ఉండవచ్చు.

పైని పేర్కొన్న జ్యోతిస్తంత్ర శ్లోకాల్లో 'అతివక్రా నగాష్టమే' అనేమాట కూడా ఉంది. నగము అనేది సప్త కులపర్వతాలు అనే మార్గాన ఏడును బోధిస్తుంది. అందుచేత ఏడు-ఎనిమిది స్థానాల్లో రవి స్థితికీ గ్రహాంతర అతి వక్రగతికీ సంబంధం ఉన్నట్టు తెలుస్తోంది. ఏడు-ఎనిమిది స్థానాల్లో ఐ-ఔ-లు ఉన్నాయి. అందుచేత వీటికి అతి వక్రాలు అనే అర్థం వచ్చేటట్టు వక్రతమ సంజ్ఞను పైరీతిగానే ఏర్పరచి ఉండవచ్చు.

ఆ స్థానాలూ ఆ అచ్చులూ వక్రతాతి వక్రతలు అతికినట్టు సరిపోవడమే ఈ ఊహకు ప్రేరణ.

వర్ణమాలలో తాము ఉన్న స్థానాలనుబట్టి వర్ణాలకు అంతఃస్థాది సంజ్ఞలు ఏర్పడడం కొత్తకాదు. అల్లాగే ఈ సంజ్ఞలూ ఏర్పడి ఉండవచ్చు.

**ఆలంకారికమూ :**

ఒకానొక ఉక్తి వైచిత్రిని వక్రతగా ఆలంకారికులు (కుంతక) భావించారు. వీటిలోని సంధ్యక్షరతా రూపమైన వక్రతను సంభావించి ఆంధ్ర వ్యాకర్తలు ఈ సంజ్ఞలను ఏర్పరచి ఉండవచ్చు. ఇది మరో ఆలోచన.

ఏ సంజ్ఞా కల్పనకయినా ఏదో ఒక హేతువు ఉండి తీరుతుంది. మరింక ఏ ఇతర భాషా వ్యాకరణాల్లోనూ కనిపించకుండా తెలుగు వ్యాకరణాల్లోనే ఈ సంజ్ఞలు కనబడడాన్నిబట్టి వీటి హేతువును పరిపరివిధాల ఊహించడం జరుగుతోంది.

# పరుష సరళాలు

క_ఖ_గ_ఘ_ఙ_ఇత్యాదిగా స్పర్శలను అయిదేసి ఒక క్రమంలో విభాగించి వర్గలుగా పరిగణించడం ఇంచుమించు భారతీయ భాషా వ్యాకరణాలన్నింటా కనబడు తోంది. వీటిలో వర్ణాలను అవి ఉన్న స్థానాలనుబట్టి వ్యవహరించడమూ ఉంది. ప్రథమాక్షరాలు అంటే క_చ_ట_త_ప లు స్వీకరింపబడతాయి. అలాగే గ_జ_డ-ద_బ లను వర్గ తృతీయాలుగానూ, ఙ_ఞ-ణ_న_మ లను పంచమాలుగానూ వాటి వాటి వర్గీయస్థానాలనుబట్టి వ్యవహరించడం సుప్రసిద్ధమయిన విషయం.

ఈ వర్గలలో ద్వితీయ చతుర్థ స్థానాలలో ఉన్న వర్ణాలను యుగ్మములు_యుక్కులు అంటున్నారు. "వర్గయుక్సరళంబులు పరంబగునప్పుడొకానొకచో ద్రుతంబునకు బూర్ణబిందువునుఁగానంబడియెడి" (బా.వ్యా. సంధి. సూ_19) అవి ఈ సంజ్ఞను చిన్నయసూరి ఉపయోగించాడు. 'యుక్కులనఁగా సమసంఖ్య కలవి. వర్గయుక్కులనఁగా వర్గాక్షరములలో సమసంఖ్య కలవి. ఉదా_ఖ_ఘ_ఛ_ఝ మొ॥, అని వజ్ఝలవారి వివరణ. (బాలవ్యాకరణోద్యోతము_పుట_48, వ్యా. సం. స. ప్రథమ, పుట—290)

ఊష్మ వాయువుతో కలిసి ఉచ్చరింపబడతాయి కాబట్టి ఖ_ఘ_ఛ-ఝ_ఠ_ఢ థ_ధ_ఫ-భ లను యుగ్మాలంటారట. (డి.యస్.జి. పుట_317). అప్పకవీయంకూడా వీటిని ఇలా ద్విస్థానోద్భూతాలుగానే పేర్కొంది (2-15). యుగ్మ శబ్దానికి సమసంఖ్య అనే అర్థంకూడా ఉన్నది. అందుచేతనైనా ఈ ద్వితీయ చతుర్థ వర్ణాలకు వర్గయుగ్మ సంజ్ఞ ఏర్పడి ఉండవచ్చు.

సాహిత్యంలో యుగ్మ శబ్దానికి జంట అనే అర్థం సుప్రసిద్ధం. సాహిత్య దర్పణంలో_

ఛందో బద్ధం పదం పద్యం తేనై కేన చ ముక్తకం।
ద్వాభ్యాం తు యుగ్మకం సందానితకం త్రిభిరిష్యతే॥
కలాపకం చతుర్భిశ్చ పంచభిః కులకం స్మృతమ్। (సా.ద. 6_578)

అని రెండు పద్యాల జంటను యుగ్మకం అంటారని పేర్కొన్నాడు.

రెండు_నాలుగు అనే సమసంఖ్యా స్థానాల్లో ఉన్నాయి కాబట్టి వీటిని వర్గ యుగ్మాలు అనడం జరిగింది. ఇలా ఈ అయిదు వర్గలలోవి వర్ణాలకూ అవి ఉండే స్థానాలనుబట్టి సంజ్ఞలను కల్పించివ్యవహరించడం లాక్షణికులలో సర్వసాధారణ మయిన విషయం.

తృతీయే ప్రథమే వర్ణే పర ఏవ హి దృశ్యతే
బిందుర్వైకృత మధ్యేఽత్ర నాన్యవర్ణే పరే తు సః।
(వికృతి వివేకం—సంజ్ఞా—10)

అని వికృతి వివేకం గ-జ-డ_ద-బలను తృతీయాలుగానూ క_చ_ట-త-పలను ప్రథమాలుగానూ పేర్కొంది.

కేతన తన ఆంధ్ర భాషా భూషణంలో వీటిని కచటతపలు-గజడదబలు_అనే పేర్కొన్నాడు. ప్రత్యేక సంజ్ఞ లను కల్పించలేదు.

కం॥ నాంతంబైన పదంబుల
పొంతన్ బైనున్న శబ్దముల కచటతపల్
దొంతి గజడదబలగు న
య్యంత నకారమగు సున్న యభినవ దండీ।

కం॥ పొసఁగన్ బల్కెడునెడ బొ
ల్పెసఁగిన ప్రథమాంతములపయిం గదిసి కడున్
బసనారు—కచటతపలను
గసడదవల్ ద్రోసి వచ్చుఁ గవిజన మిత్రా। (ఆం.భా.భూ-54,62)

పురుషోత్తముని ప్రాకృతానుశాసనంలో 'అయుక్తానాం గజడదబానాం కచటతపా బహులమ్' (19-4) అనీ, లంకేశ్వరుని ప్రాకృత కామధేనువులో 'కచటతపాం ప్రాయేణానాదౌ', 'కచటతపాం ప్రాయేణ లోపః స్యాదనాదౌ వర్తమానానా మిత్యర్థః' (సూ-1, పుట-170) అనీ వీటి నిర్దేశం కనబడుతోంది. కానీ ప్రత్యేక సంజ్ఞలను వీరు వీటికి కల్పించిన జాడలేదు.

అయితే ఆంధ్ర శబ్ద చింతామణి వర్గలలో ప్రథమ వర్ణాలయిన క-చ-ట-త-ప లకు పరుష సంజ్ఞనూ, తృతీయ వర్ణాలయిన గ-జ-డ-ద-బ లకు సరళ సంజ్ఞనూ విధించింది.

కచటతపాః పరుషాఖ్యాః
గజడదబాస్తు సరళాః, స్థిరా ఇతరే. (ఆం శ.చిం-సంజ్ఞా-37)

విధించిన ఈ రెండు సంజ్ఞలనూ వినియోగించడమూ జరిగింది. (సంధి-21, 25,32) అటుపైని అనుయాయులయిన ఆంధ్ర వ్యాకర్తలందరూ ఈ సంజ్ఞలను ఉపయోగించినవారే. కాగా ఇవ్వి ఆ వర్ణాల ఉచ్చారణలోని పారుష్య సారళ్యాలను బట్టి ఏర్పడిన సంజ్ఞలని కొందరూ, ఇవ్వి కేవలం రూఢ సంజ్ఞలేనని మరికొందరూ పరిశోధకులు భావించారు.

'క' ను ఉచ్చరించడంలోకన్నా 'గ' ను ఉచ్చరించడంలో ఒక సారళ్యం ఉన్నదనీ, అందుచేత వర్గ తృతీయాలకు సరళ సంజ్ఞ ఏర్పడి, సాపేక్షంగా ప్రథమాలకు పరుష సంజ్ఞ ఏర్పడి ఉంటుందనీ డా॥ ఎ. పున్నారావుగారు తమ సిద్ధాంత వ్యాసంలో అభిప్రాయపడ్డారు. (సంస్కృతంలో వ్రాసిన ప్రసిద్ధాంధ్ర వ్యాకరణాలు-ఒక పరిశీలన - పుట-122)

అయితే వర్ణోచ్చారణలోని పారుష్య సారళ్యాలు వైయక్తికాలు. దానిని బట్టి సంజ్ఞలను ఏర్పరచి ఉంటారా? అనేది సందేహం. పైగా ఉచ్చారణ అంటే మూలాధార చక్రం నుంచి బయలుదేరిన ప్రాణవాయువు వాగింద్రియంనుంచి వర్ణాభివ్యక్తితో వెలువడడమేనని వాక్యపదీయం చెబుతోంది.

విభజ్య స్వాత్మనో గ్రంధీన్ శ్రుతి రూపైః పృథగ్విధైః
ప్రాణో వర్ణానభివ్యజ్య వర్ణేష్వేవోపలీయతే॥ (వాక్యపదీయం-1-115)

అటువంటప్పుడు—

అనుప్రదానాత్ సంసర్గాత్ స్థానాత్ కరణ విన్యయాత్
జాయతే వర్ణ వై శేష్యం పరిమాణాచ్చ పంచమాత్.
(తైత్తిరీయ ప్రాతిశాఖ్యం—11—2)

ఇత్యాదిగా ప్రాచీన లాక్షణిక నిరూపితాలయిన అల్పప్రాణ మహాప్రాణతాదుల కంటే భిన్నంగా పారుష్య సారళ్యాదులకు అవకాశం ఉన్నదా? అనేది మరొక సందేహం. అయినా ఈ సంజ్ఞలకు సార్థకతా కల్పనంలో వీరి ఈ అభిప్రాయం తనంతతాను గౌరవింపదగినది.

ఆంధ్ర శబ్ద చింతామణి పరుష సరళ స్థిర సంజ్ఞలను ఏర్పరిచడంలోని ఆంతర్యాన్ని డా॥ బొడ్డుపల్లి పురుషోత్తంగారు తమ సిద్ధాంతవ్యాసంలో కొంత ముచ్చటించారు. ఈ సంజ్ఞలను వీరు కేవలం రూఢాలుగానే భావించారు.

(తెలుగు వ్యాకరణ వికాసము—ప్రథమ-21, 22)

*యౌగికార్థ కల్పన :*

ఈ పరుష సరళ శబ్దాలు నిస్సందేహంగా సంస్కృత పదాలు. వ్యుత్పత్తినిబట్టి వీటికి ఒకరకమయిన సార్థకతను ప్రతిపాదించవచ్చు.

పాలించు—పూరించు అనే ప్రసిద్ధార్థాలతో 'పౄ' ధాతువు జుహోత్యాది గణ పఠితంగా ఒకటి ఉంది (పౄపాలన పూరణయోః—జు—పరస్మై—సేట్). దీనికి "పౄ న హి కలిభ్య ఉషచ్" (ఉణాది—4—75) అనే సూత్రం 'ఉషచ్' ప్రత్యయాన్ని విధిస్తోంది. అందువల్ల "పిపర్తి పూరయతి ఇతి పరుషః" అని రూపం ఏర్పడుతుంది. సమస్తావకాశాన్నీ పూరించేది వాయువు కాబట్టి ఈ పరుష శబ్దానికి "వాయువు" అనే అర్థాన్ని యౌగికంగా చెప్పవచ్చు.

కదులు—తిరుగు అనే ప్రసిద్ధార్థాలతో 'సృ' ధాతువు భ్వాదికం ఒకటి ఉన్నది. (సృ గతౌ—భ్వాది—పరస్మై-అనిట్). దీనికి 'వృషాదిభ్యశ్చిత్' (ఉణాది-1-106) అనే సూత్రం 'కల' ప్రత్యయాన్ని విధిస్తోంది. ప్రత్యయంలో కిత్వం ఉంది కాబట్టి

ధాతువుకు గుణం రాకపోవాలి. కానీ_ఉణాదయో బహులమ్ (3—3—1) అనే బాహుళకం వల్ల గుణం వచ్చి 'సరళః' అనే రూపం ఏర్పడుతుంది. సరతి గచ్ఛతి ఇతి సరళః—అని దీని వ్యుత్పత్తి. నిరంతరమూ కదలుతూ ఉండేది, తిరుగుతూ ఉండేది, భూమికాబట్టి ఈ సరళశబ్దానికి భూమి అనే అర్థం యౌగికంగా లభిస్తుంది. నింపేవన్నీ వాయువులే కావడంలేదు, తిరిగేవన్నీ భూములే కావడంలేదు. కాబట్టి ఈ పదాలను ఆ అర్థాలలో యోగ రూఢాలుగానైనా భావించవచ్చు.

సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతః పరే।
కార్యాద్విద్యాదనూబంధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు॥ (3_3_1)

ఈ భాష్య సమ్మతి ఉండనే ఉన్నది కాబట్టి ఉణాది సిద్ధాలయిన రూపాలకు ఈ విధమయిన అర్థ కల్పనం అప్రసిద్ధంకావచ్చునుగానీ, అశాస్త్రీయమనిపించుకోదు. సరిమాది శబ్దాలకు వాయ్వాద్యర్థాలు యౌగికంగానేకదా సరిపోతున్నాయి. యౌగికార్థాలకు ప్రసిద్ధితో ప్రమేయంలేదు. ద్వ్యర్థి కావ్యాల్లో ఇది అందరూ ఎరిగినదే.

## పాంచ భౌతిక వర్ణాలు :

వర్ణాలకు పంచభూతాలను బీజాలుగా నిర్ణయించడమూ, దేవతలనూ కులాలనూ శుభాశుభాది ఫలాలనూ చెప్పడమూ శారదాతిలకాది గ్రంథాల్లోనూ తాంత్రికారాధనా విధానంలోనూ సుప్రసిద్ధంగా కనబడుతోంది.

శారదా తిలకంలో భూతలిపిని ప్రస్తావించిన శ్లోకాలు_

అథ భూతలిపిం వక్ష్యే సుగోప్య మతిదుర్లభమ్
యం ప్రాప్య శంభో ర్మునయః సర్వ కామాన్ ప్రపేదిరే
పంచ హ్రస్వా సంధి వర్ణాః వ్యోమే రాగ్ని ర్జలం ధరా
అంత్య మాద్యం ద్వితీయం చ చతుర్థం మధ్యమం క్రమాత్
పంచ వర్గాక్షరాణి స్యు ర్వాంత శ్వేతేందుభిస్సహ
ఏషా భూత లిపిః ప్రోక్తా ద్వి చత్వారింశదక్షరైః॥ (7_1_3)

శబ్ద కల్పద్రుమం ప్రతివర్ణానికీ బీజ గ్రహ దేవతా ఫలాదికాలను తంత్ర శాస్త్ర ప్రమాణాలతో స్పష్టంగా నిర్దేశిస్తూ వచ్చింది.

ఈ తాంత్రిక విధానాలను తెలుగు ఛందః కర్తలూ ప్రస్తావించారు.

శుభవర్ణాః శుభశబ్దా యే చ శుభగణా స్త ఏవ కావ్యాదౌ గ్రాహ్యాః-అనేదాన్ని ఆంధ్ర శబ్ద చింతామణిలోని సూత్రంగా ఇచ్చి ద్వితీయాశ్వాసంలో రెండు వందల అరవై రెండో పద్యంనుంచి అప్పకవి తాంత్రిక విశేషాలను అనేకం విస్తృతంగా నిరూపించాడు. మాతృకా నిర్ణయాన్నీ, మాతృకార్చనా విధానాన్నీ చూపించాడు. (2–393). ఈ సందర్భంలో వరరుచి సంహితా, కాలజ్ఞకల్ప, లక్షణదీపికా, విధిప్ర దీపికా, శారదా దర్పణాది గ్రంథాలనుంచి మూలాలనుకూడా ఉదాహరించాడు.

ఆనంద రంగరాట్ఛందంలో ప్రథమ ద్వితీయాశ్వాసాలు ఈ విశేషాలతోనే నిండిపోయాయి. తనకు ముందున్న సంస్కృతాంధ్ర లాక్షణికులు వర్ణాల గ్రహ బీజాది నిర్ణయాలకూ వాటి శుభాశుభ ఫలాలకూ చెప్పిన శ్లోకాలనూ పద్యాలనూ ఇతడు తన మాటలకు ప్రమాణాలుగా ఉదాహరించడం విశేషించి గమనింప దగినది. ఈ తంత్రం మన ఆంధ్రదేశంలో ఎంత ప్రాచీన కాలంనుంచీ ఉన్నదో ఎంతగా బహుళ ప్రచారాన్ని పొందిందో మనకు తెలియ జేసినవాడు కస్తూరి రంగకవి.

*కస్తూరి రంగకవి* :

కస్తూరి రంగకవి చేసిన బీజ వర్ణ నిర్ణయాన్ని ఇక్కడ కొంత పరిశీలించడం అవసరం.

క॥ ఆది క్షాంతాక్షరముల
నైదు వరుసలునువ వరుసకవి వదియగుచున్
బ్రోదిఁబవనాగ్ని భూజల
ఖోదిత బీజాక్షరమ్ములొగి రంగ నృపా!

తే.గీ. అనిల బీజాళి శోకదం, బగ్నిబీజ
సమితి మడియించు, భూమి బీజములు శ్రీద
మంబు బీజముల్ముదమిచ్చు, నభ్ర బీజ
రాజి లేములొనంగు శ్రీరంగ భూప!

(ఆనంద రంగరాట్ఛందం 1–16, 17)

| 1. | అసుర | అ | ఊ | ఏ | క | చ | ట | త | ప | య | ష | 10 | వాయు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 2. | అసుర | ఆ | ఋ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | 10 | అగ్ని |
| 3. | సుర | ఇ | ౠ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ | 10 | భూ |
| 4. | సుర | ఈ | ఌ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | 10 | జల |
| 5. | అసుర | ఉ | ౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | క్ష | 10 | ఆకాశ |

"అకారము మొదలు క్షకారము వఱకుఁ గల యేఁబది యక్షరముల నైదు వరుసలుగ వ్రాసిననవి వరుసకుఁబది యక్షరములగును. అందు మొదటి వరుస యందలి అ—ఊ—ఏ—క—చ—ట—త—ప—య—ష లను నీపదియు వాయు బీజాక్షరములు. వీనిని పద్యాదినుంచిన అశుభము. రెండవ వరుసయందలి ఆ—ఋ—ఐ—ఖ—ఛ—ఠ—థ—ఫ—ర—స లను నీపదియు నగ్ని బీజాక్షరములు. వీనిఁబద్యాదినుంచిన నశుభము. మూఁడవ వరుసయందలి ఇ—ౠ—ఓ—గ—జ—డ—ద—బ—ల—హ లను నీపదియు భూబీజాక్షరములు. వీనిఁబద్యాదినునుప శుభము—"

ఈ రీతిగా తక్కిన నాలుగు అయిదు వరుసలలోని వర్ణాలకు బీజనిర్ణయమూ శుభాశుభ నిర్ణయమూచేశాడు. దీనికి కవిసర్పగారుడంనుంచి ప్రమాణంగా పద్యం ఇచ్చాడు.

సీ॥ అ_ఇ_ఉ_ఋ_ఌను మరి యాదీర్ఘ వర్ణంబు
లైదు నేకారాదులైదు నవని
వరుసఁగవర్గాది వర్ణ పంచకమును
యాదు లైదును షాదు లైదుఁగూడ
నొండొంటితోఁ గూర్చి యొనర దొంతిగఁబేర్చి
మానుగాఁ జూచిన వానిలోన
ప్రథమాక్షరంబులు పవన బీజంబులు
నవలివి దహన బీజాక్షరములు

నవనిబీజంబు లాతృతీయాక్షరములు
వారిబీజంబు లాతరువాతి లిపులు
గగనబీజంబులే యవు కడలవెల్ల
వాని కీడును మేలును వలయుఁదెలియ.

ఈ వర్ణాలకు స్త్రీపున్నపుంసక లింగాలను నిరూపించే సందర్భంలో ఇతడు –

గీ॥ సక్షలను రెండు నొత్తని యక్షరములు
పదియు మగ; లచ్ఛషలు నొత్తఁబడిన పదియు
రమణులొ_జ ఞ ణనమ యరవహలళలు
రహిఁబేడులౌ నానంద రంగ శౌరి। (1-10)

వ॥ సకార క్షకారములురెండు, నొత్తని యక్షరములగు
క–గ–చ–జ–ట–డ–త–ద–ప–బ–అను నీపదియును గూడఁ
బంద్రెండక్షరములు పురుష జాతివి—" అని నిర్దేశించాడు.

అప్పకవి :

నిలువు గీటులు పది నిలిపి రేఖా షట్క–
మడ్డంబుగా గీఁచి యాది లిపులు
తొలి దొంతి క్రింద క్రిందుల రెండు రెండిడి
రెండవదాన నొండొండు గూర్చి
కడపలి ప్రాణంబు కడగ మున్న లిఖించి
హెచ్చు కా దాని పైయింట నిలిపి
తరువాతి దొంతుల ధామంబులను గాదు
లొక్కటొక్కటి క్రమమొప్ప వ్రాసి

యడ్డముగఁ జూడ నయ్యె వాతాగ్ని భూమి
జల ఖ బీజంబులివి కావ్యములకు మొదట
నిలుప ఖేదాప్త ధన హర్ష నిర్ధనంబు
లొసఁగుఁగర్తకు భర్తకు నుదధిశయన। (అప్పకవీయం, 2-274)

| 1. | అ | ఆ | ఎ | క | చ | ట | త | ప | య | ష | 10 | వాయువు | ఖేద |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 2. | ఇ | ఈ | ఏ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | 10 | అగ్ని | ఆప్తి |
| 3. | ఉ | ఊ | ఐ | గ | జ | డ | ద | బ | ల | హ | 10 | భూమి | ధన |
| 4. | ఋ | ౠ | ఒ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | 10 | జల | హర్ష |
| 5. | ఌ | ౡ | ఔ | ఙ | ఞ | ణ | న | మ | శ | అః | 10 | గగన | నిర్ధన |

*గిడుగువారి పొరపాటా? :*

గిడుగు రామమూర్తి పంతులుగారూ ఉత్పల వేంకట నరసింహాచార్యులుగారూ కలిసి పరిష్కరించిన అప్పకవీయ ప్రతిలో ఈ బీజాక్షర చక్రోద్ధారణం కొంతమార్పుతో కనబడుతోంది. (అప్పకవీయం–పుట–102) "ఆదిలిపులు తొలిదొంతి క్రింద క్రిందుల రెండు రెండిడి" అనే అప్పకవీయం మాటను వీరు మరోలా అర్థంచేసుకున్నారు. "రెండురెండు" అంటే అ ఆ–ఇ ఈ ఇలా జంటలను జంటలుగానే మొదటి గడిలో ఉంచారు. "తొలిదొంతి ఆదిలిపులు రెండురెండు క్రిందు క్రిందులనిడి" అని అన్వయించుకుంటే పైని నిరూపించిన పట్టిక ఏర్పడుతుంది. అప్పుడు ఈ కాకునూరి అప్పకవితో కస్తూరి రంగకవికి సయోధ్య కుదురుతుంది. అన్ని గడులలోనూ ఒక్కటొక్కటి ఉంచి మొదటి గడులలో మాత్రం రెండేసి ఉంచడమూ, ఒకే గడిలో ఉన్న ఆ రెండింటినీ ఒక్కటిగా కాకుండా వేరువేరుగా లెక్కించి పదికి జమ చేయవలసి రావడమూ, మొదలయిన అసంగతులుకూడా తొలగుతాయి. స్వరాల బీజనిర్ణయంలో అనవసరమయిన అభిప్రాయ భేదాలు తలఎత్తవుకూడా.

అప్పకవి 'క్ష' ను సంయుక్తాక్షరంగా భావించాడుకాబట్టి వర్ణాంతరంగా చివరి గడిలో విశేషించకుండా, "కడపలి ప్రాణంబు కడగ మున్న లిఖించి" అని చెప్పాడు.

విసర్గను అచ్చులలోనే ఇతడు పరిగణించాడు. అందుచేత "కడపలి ప్రాణంబు" అంటే విసర్గ అవుతుంది. దానిని కడగ=చిట్టచివరి గడిలో, మున్న లిఖించి=ముందు గానే గుర్తించేసి, అక్కడికి స్వరాల నిక్షేపణం అయ్యిందికాబట్టి ఇక వ్యంజనాల నిక్షేపణం ప్రారంభించాలని అప్పకవి అభిప్రాయపడ్డాడు. ఆనంద రంగకవి 'అః' ను విడిచిపుచ్చి 'క్ష' ను ఆస్థానంలో నిక్షేపించాడు. ఇంతమాత్రమే వీరిద్దరికీగల తేడా.

## చిత్రకవి పెద్దన :

రంగకవికన్నా అప్పకవికన్నాముందు వాడయిన చిత్రకవి పెద్దన తన లక్షణ సార సంగ్రహంలో ఈ విధమంతా సుమారు ఒక పాతిక పద్యాల్లో సంక్షేపంగా నిక్షేపించాడు.

సీ॥ అక్షరంబుల్ పంక్తిగా నైదిడి యా క్రింద
నాదీర్ఘ వర్ణంబు లైదు వ్రాసి
యట్ల నేకారాదులా క్రింద నైదిడి
కాది వర్గములేను నట్ల వ్రాసి
విడువాలు లైదింట విల్చు పదేసియు
కాగ్ని భూదక ఖ బీజాక్షరములు
ఖేదంబు మృతియు శ్రీ మోదంబు దారిద్ర్య
మును జేయు గ్రమమున నను దెలిసి

భూత బీజాక్షర ఫల మీరీతిఁదెలిసి
యిందులో హర్ష సంపదలిచ్చు నెద్ది
యట్టి వర్ణంబె కృత్యాదిఁబెట్టు సుకవి
సమర హృత దైత్యవీర! కేసరి కుమార! (1–25)

ఇందులో నిర్దేశించిన ప్రకారం పట్టిక ఇలా ఉంటుంది :

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| అ | ఇ | ఉ | ఋ | ఌ |
| ఆ | ఈ | ఊ | ౠ | ౡ |
| ఏ | ఓ | ఐ | ఔ | అం |
| క | ఖ | గ | ఘ | ఙ |
| చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ |
| త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ |
| య | ర | ల | వ | శ |
| ష | స | హ | ళ | అః/క్ష |
| 10 | 10 | 10 | 10 | 10 |
| క | అగ్ని | భూ | ఉదక | ఖ |

ఇది అప్పకవి ఆనందరంగకవుల నిర్దేశాలతో పోల్చి చూస్తే స్వరాల విషయంలో కొంచెం భిన్నంగా ఉంది. వ్యంజనాల విషయంలో భేదమేమీలేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికా పాఠంకూడా ఇలాగే ఉంది. (సంపుటి_25, సంచిక_1, పుట_5). కాగా ఇక్కడ క+అగ్ని; భూ+ఉదక, ఖ _ బీజాక్షరములు అని పద విభాగం ఏర్పడుతోంది.

6)

*లింగమగుంట తిమ్మకవి :*

లింగమగుంట తిమ్మకవి తన సులక్షణ సారంలో సరిగ్గా ఇదే వరసలో పంచ భూత నిర్ణయం చేశాడు. అయితే ఇతడు అయిదు దొంతులనూ అయిదు కందాల్లో విడివిడిగా స్పష్టంగా పేర్కొన్నాడు.

కం॥ పరగఁగ అ ఆ ఏ లును
వరుసగఁగచటతప యషలు ధ్రువంబుగఁబదియున్
ధరఁబవన బీజములు గో
వర వాహన! సకలలోక వందిత చరణా! (ప_209)

కం॥ మున్నుగ ఉ—ఊ—ఓలును
నెన్నఁగ గజడదబ లహలు నీధరఁబదియుం
బన్నుగ భూ బీజంబులు
పన్నగవరశయన బాణ! పన్నగ భరణా! (ప_211)

ఈతడు కస్తూరి రంగకవిలాగా, ఆకాశ బీజాల్లో "అః" నుగాక 'క్ష' ను పరిగణించడం జరిగింది.

వీటన్నింటినిబట్టి వర్ణాలకు పంచభూతాలను నిర్దేశించే సంప్రదాయం తెలుగునాట అతిప్రాచీన కాలంనుంచీ సుప్రసిద్ధమై ఉన్నదని మనం భావించవచ్చు. ఒకవేళ ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయభట్టారక కృతమే అని భావించినా ఈ మాతృకార్చనా విధానాదికం ఆ గ్రంథంనాటికి లేదని చెప్పడానికి వీలులేనంత ప్రాచీనమయినదిగా ఇది కనబడుతోంది.

*వాయు భూ బీజాలు :*

రేచన/వేములవాడ భీమకవి—కవిజనాశ్రయము (పుట—161), వెల్లంకి తాతంభట్టు—సులక్షణసారము (పుట—123, 124), భైరవకవి—కవిగజాంకుశము (పుట—25, పద్యం – 70) ఇలా అందరూ కచటతపలను వాయుబీజాలుగానూ,

గజడదబలను భూబీజాలుగానూ పేర్కొన్నారు. తక్కిన విషయాలలో ఒకటి రెండింట వీరిలో వీరికి కొన్నికొన్ని భేదాలు కనబడుతున్నా వీటివిషయంలో మాత్రం అందరికీ అభిప్రాయైక్యం స్పష్టంగా కనబడుతోంది. బహుశ వీరి ఈ నిర్దేశాలకు ఆధార మయిన శాస్త్రగ్రంథం ఒకటే అయి ఉండవచ్చు. లేదా మూల గ్రంథాల్లోకూడా ఈ విషయంలో ఏకాభిప్రాయం ఉండి ఉండవచ్చు.

ఇంతగా సుప్రసిద్ధమయిన ఈ అర్థావిధానాన్ని పురస్కరించుకొని వాయు బీజాలయిన వర్గప్రథమాలకు పరుష సంజ్ఞనూ, భూబీజాలయిన వర్గతృతీయాలకు సరళ సంజ్ఞనూ ఆంధ్ర శబ్ద చింతామణి కల్పించి ఉండవచ్చు. ఈ పరుష సరళ శబ్దాలకు వాయుభూరూపార్థాలు యౌగికంగా సరిపోవడం ఈ ఊహకు ప్రధాన హేతువు.

## పుంలింగ నిర్దేశం :

సషలు రెండూ, ఒత్తని అక్షరాలు పదీ పుంలింగ వర్ణాలుగా కస్తూరి రంగకవి పేర్కొన్నాడు. (1-10). అంటే ఇదొక సంప్రదాయం ఉన్నదన్నమాట. ఈ మేరకు క-చ-ట-త-ప-గ-జ-డ-ద-బలు పుంలింగ వర్ణాలు అవుతాయి. భూ బీజాలకు సంజ్ఞగానూ, తదర్థాభిధాయకంగా నూ ఏర్పరచిన సరళ శబ్దాన్ని విశేష్యావస్థలోకూడా ఎక్కడా స్త్రీలింగరూపంతో వ్యవహరించక, వాయ్వర్థకమయిన పరుష శబ్దంలాగానే అంతటా పుంలింగరూపంతోనే ఆంధ్ర శబ్ద చింతామణి వ్యవహరించడం బహుశ ఈ సంజ్ఞల పుంలింగతను బట్టి కావచ్చు.

## ప్రత్యేక సంజ్ఞా కల్పనావసరం :

స్పర్శలలో వర్గ పంచమవర్ణాలకు మాత్రమే గ్రాహకంగా అనునాసిక సంజ్ఞ, ద్వితీయ చతుర్థవర్ణాలకు మాత్రమే బోధకంగా వర్గయుగ్మ (వర్గయుక్) సంజ్ఞ, సంస్కృత వ్యాకరణాలలో సుప్రసిద్ధంగా కనబడుతున్నాయి. కానీ వర్గలలోని ప్రథమ వర్ణాలకు అయిదింటికీ ఒకటీ, తృతీయాలకు అయిదింటికీ ఒకటీ-ప్రత్యేక సంజ్ఞలు లేవు. ఇలా విధించుకోవలసిన అవసరం కలగకపోవడమే దీనికి కారణం. వీటికి మాత్రమే పరిమితంగా చెప్పవలసిన వ్యాకరణకార్యాలు ఆ భాషలలో లేక పోవడమో ఉన్నా ప్రత్యాహారాది కల్పనా సౌకర్యం ఉండడమో దీనికి కారణం కావచ్చు.

తెలుగులో వర్గ ప్రథమ వర్ణాల కయిదింటికీ, తృతీయవర్ణాల కయిదింటికీ విడివిడిగా చెప్పవలసిన సంశాదేశ ద్రుతలోపాది కార్యాలు చాలా ఉన్నాయి కాబట్టి ఈ అయిదేసి వర్ణాలకు మాత్రమే పరిమితంగా ప్రత్యేక సంజ్ఞలను విధించుకోవలసిన అవసరం ఆంధ్ర వ్యాకర్తలకు ఏర్పడింది. అల్లాగే వర్గప్రథమ తృతీయ వర్ణాలకంటే భిన్నమయిన వ్యంజనాలనన్నింటినీ ఒకటిగా స్వీకరించి చెప్పవలసిన ద్రుతలోపాది కార్యాలూ ఉన్నాయి. కాబట్టి వాటికి అన్నింటికీ బోధకంగా ఒక సంజ్ఞను కల్పించవలసిన అవసరమూ ఏర్పడింది. ఇలా అవసరాన్నిబట్టి పరుషసరళ స్థిర సంజ్ఞలు క్రమంగా ఏర్పరచడం జరిగి ఉంటుంది.

వీటిలో స్థిర సంజ్ఞ మార్పుచెందనివి అనే అర్థంలో కొంతవరకూ సార్థకం అయ్యింది. కాబట్టి పరుష సరళ సంజ్ఞలుకూడా సార్థకాలే అయిఉండవచ్చునని భావించడమూ, ఆ సంజ్ఞా కల్పనంలోని అంతర్యాలను ఊహించడమూ జరిగింది.

*గణిత శాస్త్రీయమా? :*

ఆధునికాంధ్ర గణిత శాస్త్ర గ్రంథాల్లో ఉపయోగింపబడుతున్న శూన్య (సున్న) కర్ణ–కోణ-లంబకోణ–సమకోణ-త్రిభుజ–చతుర్భుజ-షడ్భుజ-చతురస్ర–వృత్త–వ్యాస వ్యాసార్థ–సమాంక–విషమాంక–సరళరేఖా–సమరేఖా–ఋజురేఖా – సమాంతరరేఖాది సాంకేతిక పదాలు అనూచానంగా అతిప్రాచీనకాలంనుంచీ వస్తున్నవేగానీ ఆధునికులు కల్పించినవికావు భాస్కరాచార్యుని (12–క్రీ.శ) సిద్ధాంత శిరోమణిలో ఇవ్వి యథా తథంగా ఉన్నాయి. ఈ సిద్ధాంత శిరోమణికి వచ్చిన వ్యాఖ్యల్లో భాస్కరాచార్యునికి ముందున్న గణిత శాస్త్ర గ్రంథాలలోని సూత్ర శ్లోకాలు ఉదాహరింపబడ్డాయి వాటిలో కూడా ఈ సాంకేతిక పదావళి ఇలాగే కానవస్తోంది.

ఈ విశేషాలను కోల్‌బ్రూక్ పండితుని 'లీలావతి' అనే ఆంగ్లానువాద గ్రంథంలో శ్రీ హెచ్. సి. బెనర్జీగారు అథస్సూచికలుగా విస్తరించి నిరూపించారు.

ఈ సాంకేతిక పదబంధాలలో పర్యాయపదాల వినిమయం ఈ శాస్త్రంలో తరచు కానవస్తోంది, కర్ణ–శ్రుతి–శ్రవణశబ్దాలకూ, భుజ–బాహు – దోశ్శబ్దాలకూ,

సమ_ఋజు_సరళ శబ్దాలకూ, వినిమయం కనబడుతోంది. ఈ సాంకేతిక పదజాలం అన్వర్థంకాబట్టి తుల్యార్థక పదాంతర వినిమయం ఛందోఽనురోధంతో జరిగి ఉంటుంది. శకటరేఫాన్ని "శతాంగ నామక రకారము" అని అప్పకవీయం (3-85) వ్యవహరించడం ఇటువంటిదే.

ఈ సంస్కృత లీలావతీ గణితం_భాస్కరగణితం ఏదో ఒకరూపంలో నిన్న మొన్నటిదాకా ఆంధ్ర దేశంలో పాఠ్యగ్రంథంగా ఉంటూ వచ్చింది కాబట్టి మన ప్రాంతంలో దీని ప్రచారాన్ని శంకించవలసిన అవసరంకూడా లేదు.

కాగా ఈ శాస్త్రంలోని సాంకేతిక పదావళిలో సమరేఖా—ఋజురేఖా— సరళరేఖా పదాలు పర్యాయాలుగా ఉపయోగింపబడడం గమనింపదగిన విశేషం.

## సమాంకం = సరళాంకం

సమ_సరళ శబ్దాలకు వంకరలేని, ఋజువయిన, సమానమయిన అనే అర్థాలు ప్రసిద్ధాంధ్ర నిఘంటువులన్నింటా కూడా కనబడుతున్నాయి. ఇటువంటి అర్థ తౌల్యాన్ని బట్టి వీటి వినిమయం జరిగి ఉంటుంది.

ఈ ప్రకారం సమాంక—సరళాంక శబ్దాలు సమానార్థకాలు. నిశ్శేషంగా భాగింపబడే సంఖ్య అనే అర్థంతో ఇవి సార్థకాలు. అలా విభాగింపబడనివి అంటే 1_3-5 వంటివి విషమాంకాలు. 'సమ' శబ్దానికి వ్యతిరేకార్థ ద్యోతకంగా 'వి' అనే ఉపసర్గను చేర్చడంవల్ల విషమాంక సంజ్ఞ ఏర్పడింది. "అసమాంకము" అనేదికూడా దీనికే పర్యాయపదంగా కనబడుతోంది.

2_4_6_8—ఇత్యాదులను సమాంకాలూ సరళాంకాలూ అనడం కుదురుతోంది కాబట్టి వర్గలలో సరళాంకస్థానంలో ఉన్న వర్ణాలను సరళాలుగా ఆంధ్ర శబ్ద చింతామణి వ్యవహరించి ఉండవచ్చు. అయితే ఇవి తెలుగుకు మాత్రమే పరిమితమయిన సంజ్ఞలు. కాబట్టి దేశీయ వర్ణమాలలోని (అచ్చిక) వర్ణాలనే (షట్త్రింశదత్ర తే-ఆం. చిం_36) స్వీకరించాలి. అప్పుడు_

| 1 | 2 | 3 |
|---|---|---|
| క | గ | — |
| చ (చ్) | జ (జ్) | — |
| ట | డ | ణ |
| త | ద | న |
| ప | బ | మ |
| 5 | 5 | 3 |

వీటిలో సమాంకస్థానంలో అంటే రెండవ స్థానంలో ఉన్న గ-జ-డ-ద-బలకు సరళ సంజ్ఞ సార్థకమవుతుంది.

అయితే సమసంజ్ఞనే స్వీకరింపక పర్యాయమయిన సరళ సంజ్ఞను విధించడం ఎందుకు? అనే సందేహం కలుగుతుంది. నిజమే. "గజడదబాస్తు సమాః" అని విధించి ఉంటే ఇవి పరస్పర సమాలు లేక సవర్ణాలు ఇత్యాదిగా ఒకింత అనిష్టార్థ స్ఫూర్తి దుర్నివారమవుతుంది గదా। అని భావించి ఉండవచ్చు.

సరళ × పరుష :

విషమాంక స్థానంలో అంటే ఒకటవ స్థానంలో ఉన్న క-చ-ట-త-పలను విషమ వర్ణాలు అనిగానీ, అసమాలు అనిగానీ వ్యవహరించి ఉంటే పై రీతిగానే అనిష్టార్థస్ఫూర్తి అనివార్యమవుతుంది. పైగా కృతికర్తకూ భర్తకూ కీడును కలిగించేవి అంటూ విషమవర్ణాలూ విషమస్థానాలూ కొన్నింటిని మన లాక్షణికులు నిరూపించారాయె। అందుచేత ఈ యీ అనిష్టార్థస్ఫూర్తులను వారించడంకోసం విషమ-అసమ శబ్దాలను పరిహరించి, సరళశబ్దానికి వ్యతిరేకంగా పరుష శబ్దాన్ని స్వీకరించి సంజ్ఞగా ఏర్పరచి ఉండవచ్చు సమశబ్దానికి వ్యతిరేకంగా విషమ-అసమ శబ్దాలను వారు స్వీకరించినట్టే, సమశబ్ద పర్యాయతనుబట్టి సరళ శబ్దానికి వ్యతిరేకంగా పరుష శబ్దాన్ని ఆంధ్ర శబ్ద చింతామణి స్వీకరించడంలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు.

రెట్టిస్తూపోతే విషమసంఖ్య సమసంఖ్య అవుతుంది. (3+3=6, 5+5=10) సమసంఖ్య ఇలా విషమ సంఖ్య అవ్వదు. (2+2=4, 4+4=8) అంటే–పరుషాలు సరళాలు అవుతాయేగానీ సరళాలుమాత్రం పరుషాలు కానేరవు—అని ఈ పరుష సరళ సంజ్ఞలకు ఎవరయినా ఒక స్వారస్యాన్ని చెబితే అప్పుడు ఆశ్చర్యపడకతప్పదు!

**ణ-న-మలు :**

ఇంక ఈ దేశీయ వర్ణమాలావర్గలలో ణ–న–మలు మిగిలిపోయాయి. ఇవి విషమాంకస్థానంలోనే (మూడవస్థానం) ఉన్నా వీటికి ప్రత్యేక సంజ్ఞను కల్పించవలసిన అవసరంగానీ, పరుష సంజ్ఞలోకి పరిగ్రహింపవలసిన అక్కరకానీ ఆంధ్ర వ్యాకర్తలకు కలగలేదు. వీటిలో నకారానికి ఒక అవస్థలో ప్రత్యేక సంజ్ఞ అవసరం అయ్యింది కాబట్టి 'ద్రుతము' అని ఏర్పాటుచేశారు. తక్కిన అవస్థలో అది అన్నింటితోపాటే స్థిరము. ప్రత్యేక కార్యాలేమీ విధింపవలసినవి లేవు. కాబట్టి ప్రత్యేక సంజ్ఞ అవసర పడలేదు. "అడఁగు>అణఁగు" ఇత్యాదుల్లో డకారం ణకారమవుతోంది. (బా. వ్యా. ప్రకీర్ణ—13) "లతాంతములకుమ్మొనసి" ఇత్యాదుల్లో నకారం మకారమవుతోంది. (ప్రౌఢ, సంధి–22) "మూన్నాళ్లు" (మూఁడు+నాళ్లు) ఇత్యాదుల్లో డకారం నకార మవుతోంది. (ప్రౌఢ–సంధి–15). ఇలా ణ—న—మలకు దేనికదిగా ఆయాకార్యాలు విధించుకోవడంతో సరిపోతోందేకానీ మూడింటికీ కలిపి చెప్పవలసిన కార్యాలేవీ భాషలో లేకపోవడంతో ఈ మూడింటికీ గ్రాహకంగా ఒక ప్రత్యేక సంజ్ఞను కల్పించుకోవలసిన అవసరం లేక పోయింది మన ఆంధ్ర వైయాకరణులకు. అందుచేతనే సంస్కృత వ్యాకరణ సిద్ధమయిన అనునాసిక సంజ్ఞను అంగీకరించి ఊరుకున్నారు.

ఇలా వర్ణమాలలో అవి ఉన్నస్థానాలనుబట్టి వర్ణాలకు సంజ్ఞలను కల్పించడం క్రొత్త ఏమీకాదు. పైగా చిన్నయసూరి తన అక్షర గుచ్ఛంలో "వర్గ సమంబులకు సగు" "వికృతిని ఋగ్విసర్గ వర్గసమ జ ఞ శషలు లేవు" అని ద్వితీయ చతుర్థ వర్ణాలకు బోధకంగా సమశబ్దాన్ని ఉపయోగించడం ఈ సందర్భంలో గమనించదగిన విశేషం. (ఆం. సా. ప. పత్రిక—గుణితసూత్రములు—సంచిక—3, సంపుట–19, పుట—92)

కాగా–గ-జ–డ-ద—బలను తృతీయ వర్ణాలుగానూ, ఙ—న—మలను పంచమాలుగానూ ఆంధ్ర లాక్షణికులు వ్యవహరించడం సంస్కృత వర్ణమాలా దృష్టి

తోనేగానీ ఈ దేశీయ వర్ణమాలా దృష్టితో కాదనేది సమన్వయం. ప్రతి వర్గకూ అయి దేసి వర్ణాలూ ఉండేది సంస్కృత వర్ణమాలలోనే గదా!

ఇలా ఈ దేశీయ వర్ణమాలలో అవి ఉన్న స్థానాలను బట్టి కచటతప-గజడ దబలకు సిద్ధించిన ఈ పరుషసరళ సంజ్ఞలను సాంస్కృతిక కచటతపలకూ గజడ దబలకూ కూడా ఆంధ్ర లాక్షణికులు విస్తరింపజేయడం ప్రక్రియా లాఘవం కోసమని భావింపవచ్చు. కో. వేం. కృష్ణమాచార్యులుగారు "కచటతపలు" అనే వ్యాసంలో ఈ వ్యాప్తిని ప్రస్తావించారు. (ఆం. సా ప. పత్రిక—సంచిక–2, సంపుటం—17, పుట—81)

పరుష సరళ సంజ్ఞలను ఏర్పరచుకోవలసిన అవసరం తెలుగు వ్యాకర్తలకే కలిగిందనీ, వీటి సార్థకతా సంపాదన విషయంలో దేశీయ వర్ణమాలను మాత్రమే స్వీకరించడం సమంజసమనీ, గణితశాస్త్ర మర్యాదననుసరించి సరళశబ్దం సమశబ్ద పర్యాయమవుతోంది కాబట్టి దానివి దేశీయ వర్ణమాలలో ద్వితీయ స్థానంలో (సమాంక స్థానం) ఉన్న గ-జ-డ-ద-బ–లకు సంజ్ఞగా అంగీకరించడం జరిగి ఉండవచ్చుననీ, సరళ శబ్దానికి వ్యతిరేకంగా బేసి సంఖ్యకు బోధకంగా పరుష శబ్దాన్ని వినియోగించి ప్రథమాలయిన కచటతపలకు సంజ్ఞగా వినియోగించడం జరిగి ఉండవచ్చుననీ, సమ విషమ శబ్దాలనే సంజ్ఞలుగా వీటికి వాడకపోవడం సహేతుకమే అనీ ఇక దేశీయ స్పర్శల్లో మిగిలిపోయిన న–ణ-మ లకు ప్రత్యేక సంజ్ఞను కల్పించుకోవలసిన అవసరం తెలుగు వారికి ఏర్పడలేదనీ–ఇక్కడికి సారాంశం. ఇదీ ఒక ఊహామాత్రమే.

# ప్రత్యాహార పద్ధతి

ప్రతి_ఆ_అనే ఉపసర్గలు పూర్వమందుగలిగిన హృ ధాతు కృదంత రూపం ప్రత్యాహారం. కొన్ని వర్ణాలను గానీ ప్రత్యయాదులను గానీ సంగ్రహించుట_సమీకరించుట అవి దీనికి యౌగికమయిన అర్థం. బోపదేవుడు సమాహార శబ్దాన్ని దీనికి పర్యాయంగా ఉపయోగించాడట. (డి.యస్.జి. పుట_267). పాణిని ఎక్కడా ప్రత్యాహార శబ్దాన్ని ఉపయోగించలేదు. కానీ ప్రత్యాహారం ఏర్పడేవిధానాన్ని ఆదిరంత్యేన సహేతా (1_1_71) అని నిర్వచించాడు "అంత్యేన ఇతా సహితః ఆదిః మధ్యగానాం స్వస్య చ సంజ్ఞాస్యాత్" అనేది ఈ సూత్రానికి భట్టోజి దీక్షితులవారి వృత్తి. (బాలమనోరమ, ప్రథమ, పుట_5) ప్రత్యాహారాలను కల్పించాలి అంటే ఇత్సంజ్ఞాకం ఉండితీరాలి అనేది పాణినీయ సంప్రదాయంగా దీనివల్ల తెలుస్తోంది.

అయితే_సారస్వత వ్యాకరణంలో ఇత్సంజ్ఞకాలు కాని వర్ణాలతోకూడా ప్రత్యాహారాలు చేసే పద్ధతి ఉన్నదని పరిశోధకులు కొందరు చెబుతున్నారు. (Belvalkar_Systems of Sanskrit Grammar_P. 78)

**ఇత్సంజ్ఞ :**

ఉపదేశేఽజనునాసిక ఇత్ (1_3_2) హలన్త్యమ్ (1_3_3) న విభక్తౌ తుస్మాః (1_3_4) ఆదిర్ఞిటుడవః (1_3_5) షః ప్రత్యయస్య (1_3_6) చుటూ (1_3_7) లశక్వతద్ధితే (1_3_8) ఇవి అష్టాధ్యాయీక్రమంలో ఇత్సంజ్ఞా విధాయక సూత్రాలు. కానీ ఈ సంజ్ఞను పాణిని ఎక్కడా వివరించలేదు. దీని స్వభావమేమిటి? అనేదికూడా అతడు వాచ్యం చేయలేదు. ఎక్కడ ఏది ఇద్వర్ణము అనే విషయాన్ని ఈ ప్రత్యేక విధానాలతోనూ వ్యాఖ్యలతోనూ మాత్రమే తెలుసుకోవలసిన క్లేశం పాణినీయంలో తప్పనిసరి అవుతోంది. కాగా "అనునాసిక" ఇత్యాది నిర్దేశాలను బట్టి ప్రత్యాహారాల్లోకి ఇద్వర్ణాలు స్వీకరింపబడవు అని పాణినీయులు నిర్వచిస్తున్నారు. (బాలమనోరమ, ప్రథమ, పుట, 7)

ఈ ఇద్వర్ణాలు ప్రయోగంలో కనిపించవు. తస్యలోపః (1_3_9) అనే సూత్రం వీటికి లోపాన్ని విధిస్తోంది. కాబట్టి "యోఽప్రయోగీత్" (శాకటాయన 1_1_5) అనే నిర్వచనాన్ని వ్యాఖ్యాతలు చేశారు. దీనిని బట్టే 'ఏతి గచ్ఛతి ఇతి ఇత్, న తిష్ఠతి, లుప్యతే ఇత్యర్థః" అనే వ్యుత్పత్తినికూడా చెబుతున్నారు. (డి.యస్. జి. పుట—69)

వివిధ ప్రయోజనాలకు నిర్దేశకాలుగా వర్ణమాలలోని అన్నివర్ణాలనూ_ఇంచుమించు—పాణిని ఇద్వర్ణాలుగా ఉపయోగించడం జరిగింది. మహేశ్వర సూత్రాలలోని ఇద్వర్ణాలకు ప్రత్యాహార సిద్ధి మాత్రమే ప్రయోజనమని "-య ఏతేషు ప్రత్యాహారార్థాః అనుబంధాః క్రియంతే—" ఇత్యాది భాష్యోక్తులవల్ల తెలుస్తోంది (1_1–2, పుట_94) కాగా తక్కిన పాణినీయోపదేశాల్లోని ఇద్వర్ణాల కన్నింటికీ ఆయా ప్రత్యేక ప్రయోజనాలు పాణినీయంలోనే సుస్పష్టంగా కనబడుతున్నాయి. నిష్ప్రయోజనమయిన ఇద్వర్ణం పాణినీయంలో మృగ్యం. ఉచ్చారణ సౌకర్యంకూడా ఒక ప్రయోజనమే.

ఉపదేశేఽజనునాసిక ఇత్ (1_3-2) అనే సూత్రంలోని ఉపదేశపదానికి విస్తృతమయిన అర్థం ఉంది

> ధాతు సూత్ర గణోణాది వాక్య లింగానుశాసనమ్
> ఆగమ ప్రత్యయాదేశా ఉపదేశాః ప్రకీర్తితాః॥
>
> (బాలమనోరమ, ప్రథమ_6)

పాణినీయంలోని ఇద్వర్ణాల స్వరూపస్వభావాలను ఇలా నిర్వచించుకోవచ్చు.

1. ఏదో ఒక ప్రయోజనం ఉండాలి.
2. ఉపదేశంలో ఆదిమధ్యాంతాల్లో ఎక్కడయినా ఉండవచ్చు.
3. ఒకటయినా ఉండవచ్చు_అనేకమయినా ఉండవచ్చు (డుపచష్పాకే).
4. ప్రయోగంలోమాత్రం కనిపించకూడదు.

## జైనేంద్రం :

పాణినీయంలో ఇలా గూఢంగా ఉన్న ఇత్సంజ్ఞా స్వరూపాన్ని ఆ సంప్రదాయానుయాయి అయిన దేవనందిసూరి తన జైనేంద్ర వ్యాకరణంలో స్పష్టంగా సూత్రీకరించాడు.

కార్యార్థోఽప్రయోగీత్ (జైనేంద్రం-1-2-3) అనేది అతని సూత్రం. దీనికి అభయనంది రచించిన మహావృత్తి ఇలాసాగింది–

"శాస్త్రే అన్యస్య కార్యార్థమాశ్రీయతే ప్రయోగే చ న శ్రూయతే యః స ఇత్సంజ్ఞో భవతి. అ–ఇ–ఉణ్–ణకారః. ఞిమిదా స్నేహనే. టు న ది సమృద్ధౌ. డుకృఞ్ కరణే. ఇత్యాదిషు ఞిటుడవాః. జే జస్యాదిషు జకారః—ఉభయ విశేషణోపాదానాత్ అన్యస్య కార్యార్థో భూత్వా యోఽప్రయోగీత్యదోషః. అన్వర్థా చేయమిత్సంజ్ఞా. ఏతి గచ్ఛతి నశ్యతీత్. తేన తస్య లోప ఇతి న వక్తవ్యమ్. ప్రయోగానుసారేణ అప్రయోగిత్వ—అవగతేః – (జైనేంద్రం, పుట—57)

దీనినిబట్టి కార్యార్థమయినంత మాత్రాన గానీ, అప్రయోగి అయినంతమాత్రాన గానీ ఒక వర్ణానికి ఇత్సంజ్ఞ లభించదనీ, కార్యార్థమై అప్రయోగికూడా అయినప్పుడు మాత్రమే ఇత్సంజ్ఞ లభిస్తుందనీ, తెలుస్తోంది. ఇలా నిర్వచించాడు కాబట్టే ఎక్కడ ఏది ఇద్వర్ణమో ప్రత్యేక విధానాలతో ప్రమేయం లేకుండానే తెలిసే సౌలభ్యాన్ని ఇతడు సాధించగలిగాడు.

పోవునది అనే అర్థంలో 'ఇత్' సంజ్ఞ సార్థకంకాబట్టి 'తస్యలోపః' అనే పాణిని విధానం వ్యర్థమనీ ఇతడు భావించాడు.

## షడ్భాషాచంద్రిక :

పాణినీయంలోని ఫలితార్థాన్ని జైనేంద్రం సూత్రబద్ధంచేయగా, ప్రాకృత వ్యాకరణ వ్యాఖ్యాతలూ ఆంధ్ర వైయాకరణులూ ఆ నిర్వచనాన్నీ ఆ సౌలభ్యాన్నీ అందిపుచ్చుకొని తమగ్రంథాల్లో నిక్షేపించుకొన్నారు.

"ప్రాయో లితి న వికల్పః" (1-1-14) అనే వాల్మీకి/త్రివిక్రమ సూత్ర వ్యాఖ్యానంలో షడ్భాషా చంద్రికా కర్త లక్ష్మీధరుడు–

"యః కార్యార్థం సూత్రేఽనుషజ్యతే న తు ప్రయోగే
దృశ్యతే స ఇత్. వ్యాకరణాంతరేఽనుబంధ ఇత్యుచ్యతే."

అని నిర్వచించాడు.

### కాతంత్రం :

లక్ష్మీధరుడు పేర్కొన్నట్టు ఇద్వర్ణానికి పర్యాయపదంగా "అనుబంధ" పదాన్ని ఉపయోగించిన అన్య వ్యాకరణాలు శ్లోక వార్తిక—కాశకృత్స్న—కాతంత్రాలు కావచ్చు.

"ప్రత్యాహారేఽనుబంధానాం కథమజ్గ్రహణేషు న?"
(భాష్యం—1-1-2, పుట—94)

"ఇదనుబంధాన్నః". (కాశకృత్స్న—సూ—9)
"ఆగమ ఉదనుబంధః స్వరాంత్యాత్ పరః." (కాతంత్రం 2-1-6)

ఇలా పర్యాయపదంగా ప్రయోగించిన అనుబంధ పదానికి కాతంత్రంలో (1-క్రీ. శ.) "యోఽనుబంధోఽప్రయోగీ" (3-8-31) అనే నిర్వచనంకూడా ఉంది. జైనేంద్రుని నిర్వచనానికి (4-క్రీ. శ.) బహుశః ఇదే మార్గదర్శకం అయ్యుండాలి.

వీరంతా 'అప్రయోగి' అని నిర్వచించేసుకున్నారు కాబట్టే ఇద్వర్ణానికి లోపాన్ని ప్రత్యేకంగా విధింపవలసిన అవసరం కలగలేదు. వీరి మార్గాన్నే పరోక్షంగా అనుసరించిన ప్రాకృత వ్యాకర్తలకుకూడా ఇద్వర్ణలోపాన్ని విధింపవలసిన అవసరం కలగలేదని మనం భావించవచ్చు. అందుకే లక్ష్మీధరుడు పైవిధంగా వ్యాఖ్యానించాడు.

### బాల వ్యాకరణం :

లక్ష్మీధరుని వాక్యాన్ని చిన్నయసూరి మరింత మెలకువతో అనువదించి తన బాల వ్యాకరణంలో పొందు పరచాడు. 'సూత్రే' అన్న పదాన్ని తొలగించి 'ప్రత్యయాదులందు' అని చేర్చడం మినహా మరి మార్పులేదు.

"కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి
ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తునాఁబడు".
(బా.వ్యా. తత్సమ. సూ—19)

ఇద్వర్ణాలు 'అ—ఇ - ఉణ్' ఇత్యాది సూత్రాల్లోనే కాదు ష్వాది ప్రత్యయాల లోనూ, శీఙాది ధాతువులలోనూ కూడా ఉండడం పాణినీయంలో ప్రసిద్ధమయిన విషయం. అందుకే సూరి ఈ మార్పు చేశాడు. బహుళ లక్ష్మీధరుడు 'ఉపదేశే' అనేదానికి పర్యాయంగా 'సూత్రే' అన్న పదాన్ని ఉపయోగించి ఉండవచ్చు. ఆ అస్పష్టతను బాలవ్యాకరణ కర్త వారించాడు. ఈ నిర్వచనంమేరకు ఈయా స్థలాల్లో ఇవ్వి ఇవ్వి ఇద్వర్ణాలు అని చెప్పవలసిన అవసరంగానీ వాటికి తాన్నై లోపం విధించ వలసిన అక్కరగానీ బాల వ్యాకరణానికి కలగలేదు.

తానుపయోగించిన జ కారాది ఇద్వర్ణాలకు లోపమూ ప్రయోజనమూకూడా అన్యశబ్దానుశాసనవత్తుగా ఆంధ్ర శబ్ద చింతామణి భావించినదని పలువురు పండితులు నిరూపించడం జరిగింది కాబట్టి దానిని ఇక్కడ ప్రస్తావించడంలేదు.

అయితే ఇత్సంజ్ఞకు పర్యాయంగా అనుబంధ పదాన్ని బాలవ్యాకరణం ఉపయోగింపలేదు. దానిని మరింత ప్రత్యేకతతో కలజ్యనుబంధము (క్రియా-19) పడుజ్య నుబంధము (క్రియా—49) ఇత్యాదిగా ఉపయోగించి ఉండడమే దీనికి కారణం. అంతే కాదు ఇతను అనుబంధానికీ అప్రయుక్తానికీ కూడా స్పష్టమయిన భేదాన్ని పాటించడం మరొక విశేషం.

**అచ్చు-హల్లు :**

మహేశ్వర సూత్రాలలో మొదటిదయిన "అ—ఇ-ఉణ్" లోని తొలి అకారాన్ని 'ఐఔచ్' (4) లోని ఇద్వర్ణమైన చకారంతో కలిపితే 'అచ్' అనే ప్రత్యాహారం ఏర్పడుతోంది. 'ఆదిరంత్యేన సహేతా' (1—1—71) అనే నియమం ప్రకారం "అ—ఇ ఉ—ఋ-ఌ—ఏ-ఓ—ఐ-ఔ" లన్నీ ఈ ప్రత్యాహారంలోకి స్వీకరింపబడతాయి. అలాగే "హయవరట్" (5) లోని హకారాన్ని 'హల్' (14) లోని లకారంతో కలిపితే 'హల్' అనే ప్రత్యాహారం ఎర్పడుతుంది. మహేశ్వర సూత్రో

పాత్తాలయిన వ్యంజనాలన్నీ దీనిలోకి స్వీకరింపబడతాయి. ఇవి ఇలా పాణినీయంలో సాంకేతికంగా ఏర్పడిన ప్రత్యాహారాలు.

సంస్కృతంలోకంటే ప్రాకృతంలో పదివర్ణాలు తక్కువగా ఉన్నాయి. అంటే అచ్—హల్ అనే ప్రత్యాహారాలలో చేరే వర్ణాలు కొన్ని ప్రాకృత భాషలో లేవన్న మాట. అందుచేత ఈ ప్రత్యాహారాలను ప్రాకృత వ్యాకర్తలు నిజానికి ఉపయోగింప కూడదు. ఋ—ౠ—ఐ—ఔ లు వారికి లేవు అందుచేత సంస్కృత స్వర సర్వస్వ బోధకంగా ఏర్పడిన 'అచ్' అనే ప్రత్యాహారం ప్రాకృత భాషకు సరిపడదు. అల్లాగే 'హల్' అనేదీను.

ఈ భాషా స్వభావం ఇటువంటిదని గుర్తించిన చండుడు (ప్రాకృతలక్షణమ్), రామశర్మ (ప్రాకృత కల్పతరుః) ప్రభృతులు మహేశ్వర సూత్ర సిద్ధమయిన ప్రత్యాహారాలను అనుకరణంలో తప్ప ఉపయోగింపలేదు.

వరరుచి ప్రముఖులు యథేచ్ఛగా ఈ ప్రత్యాహారాలను ఉపయోగించినా అసంభవత్వాది హేతువులతో ఆ ప్రత్యాహారాలలోకి ప్రాకృతీయ వర్ణాలు మాత్రమే గ్రహింపబడుతూవచ్చాయి.

> నయణ్- (వాల్మీకి/త్రివిక్రమ—1-1-20)
> —యణితి యవరలానాం పరిగ్రహేఽపి ప్రాకృతే ఋ ౠ వర్ణయోః
> ప్రయోగాభావాత్ యత్వ వత్వయోరేవాయం నిషేధః।

ఈ త్రివిక్రమవృత్తి అటువంటిదే. షడ్భాషా చంద్రికలోకూడా ఇల్లాగే ఉంది. ఇటువంటి ఇబ్బందులను పరిహరింపుకోవడంకోసమేనేమో 'సంజ్ఞా ప్రత్యాహార మయీ వా' (వాల్మీకి / త్రివిక్రమ 1—1—3) అని ఒక అధికార సూత్రం నిబద్ధించడం జరిగింది.

> "ఇహ ప్రాకృత వ్యాకరణే। సంజ్ఞా ప్రత్యాహార స్వరూపా
> వ్యవహ్రియతే। వా గ్రహణాత్ వక్ష్యమాణాచ్చ।
> పునః ప్రత్యాహార గ్రహణం భూయో వ్యవహార
> దర్శనార్థమ్।—" అని దీనికి త్రివిక్రమ వృత్తి.

అచ్-హల్ మొదలయిన వాటిలోకి అప్రాకృతీయమయిన వర్ణాలుకూడా స్వీకరింపబడుతున్నాయి కాబట్టి, ప్రాకృత వ్యాకరణాల్లో ప్రత్యాహారాలను యథా సందర్భంగా ప్రాకృతీయ వర్ణమాత్ర బోధకాలయిన సంజ్ఞలుగా వ్యవహరించడం జరిగిందని భావింపవచ్చు. ప్రాకృత భాషకు సంబంధించి 'అచ్' అనేది "అ ఇ ఉ ఏ ఓ" లను మాత్రమే బోధిస్తుంది. అల్లాగే 'హల్' అనేది ఆ భాషలో ఉన్న వ్యంజనాలను మాత్రమే బోధిస్తుంది. ఈ సౌలభ్యంకోసం వీరు ప్రత్యాహారాలను సంజ్ఞలుగా మలచుకోవడం అవసరమయ్యింది.

*ఇవి రూఢ సంజ్ఞ లే :*

ఆంధ్ర వ్యాకర్తలుకూడా ఇదే మార్గంలో అచ్చు హల్లు అనే వాటిని తెలుగులోని స్వరాలకూ తెలుగులోని వ్యంజనాలకూ వాచకాలయిన సంజ్ఞలుగానే ప్రతిపాదించారు. అందుచేతనే సంజ్ఞి గత బహుత్వాన్ని పురస్కరించుకొని "ప్రాణాః సమాసతోఽచః"। (సంజ్ఞా-11) "హలస్స్యుః సమాసతః ప్రాణినః"। (సంజ్ఞా-13) అని ఆంధ్ర శబ్ద చింతామణి అచః—హలః అంటూ బహువచనాంత నిర్దేశం చేసింది. ఈ విధానాన్ని అనుసరించి 'అ' ఒక అచ్చు. 'ఇ' ఒక అచ్చు. 'ఏ' ఒక అచ్చు. 'ఉ' ఒక అచ్చు. 'ఋ' ఒక అచ్చు. కకారమొక హల్లు. చకారమొక హల్లు షకారమొక హల్లు—ఇలా ప్రతిస్వరానికీ ప్రతివ్యంజనానికీ ఈ అచ్చు—హల్లు అనే సంజ్ఞలు ప్రత్యేకంగా అన్వయిస్తున్నాయి.

*ఏజ్ - ఐచ్ :*

'ఏజథో వక్రః"—"వక్రతమ ఐచ్" అనే సూత్రాలలో ఏజ్—ఐచ్-అనేవి కేవలం ప్రత్యాహారాలు. కాబట్టి ఏక వచనాంత నిర్దేశం చెల్లింది. ఈ ప్రత్యాహారాలకే వక్రః-వక్రతమః అనే సంజ్ఞలు ఉద్దిష్టాలు. కాగా 'ఏజ్' లో ఏ-ఓ అనే రెండు స్వరాలు ఉన్నాయి కాబట్టి ఆ రెండింటికీ కలిపి వక్రసంజ్ఞ అన్వయిస్తుంది వక్రము అంటే ఏ—ఓ లు రెండూ గ్రహింపబడతాయేకానీ ఏదో ఒకటి మాత్రమే గ్రహింపబడటం ఉండదు. అల్లాగే వక్రతమము అంటే ఐ—ఔలు రెండూ గ్రహింపబడతాయే కానీ ఏదో ఒకటి మాత్రమే గ్రహింపబడదు.

నారాయణీయాంధ్రానువాదం ఈ మార్గంలోనే సాగింది.

గీ॥ ..........................................
వక్రమని యేజునకు బేరు పద్మ గంధి।
వక్రతమములు గా నైచ్చు పరమ సాధ్వి।
.............................. ......... (పుట_47)

వక్రః = ఏజ్ = ఏ__ఓ
వక్రతమః = ఐచ్ = ఐ__ఔ

ఇది పరంపరాన్వయం. వక్రః వక్రతమః అనే ఏకవచనాంత నిర్దేశాలవల్ల ఏజ్, ఐచ్ అనే ప్రత్యాహారాలు స్వీకరింపబడి అనంతరం ఆ ప్రత్యాహారాలలోని ఏ-ఓ, ఐ_ఔ లు యథాక్రమంగా స్వీకరింపబడతాయి.

"వక్రౌ"—"వక్రతమౌ" అని ద్వివచనాంతంగా నిర్దేశించడం జరిగితే సాక్షాత్తుగా ఆ ప్రత్యాహార ఘటితవర్ణాలు రెండేసీ స్వీకరింపబడతాయి.

"ద్వివిధాదిదుదేదోతోఽచో వక్రతమౌ చాప్యనుస్వారౌ" (సంజ్ఞ—14) అనే సూత్రంలో 'వక్రతమౌ' అనే ద్వివచనాంత నిర్దేశానికి ఈ రీతిలోనే సమన్వయం కుదురుతుంది. తెలుగులో వక్రము—వక్రములు, వక్రతమము—వక్రతమములు_అనే ఏకవచనాంత బహువచనాంత వ్యవహారాలనుకూడా ఇలాగే సమన్వయించుకోవలసి ఉంటుంది.

అప్పకవీయంలో "దంతజంబులెల్ల———(2_118) అనే పద్యంలోఉన్న "హ్రస్వాది వక్రయుతములు" అనే సమాసానికి "వక్రము=ఏజ్, ఆది'వక్రము=ఏ, హ్రస్వాది వక్రము="ఎ" అనే అర్థాన్ని దర్భా సర్వేశ్వర శాస్త్రిగారు నిర్వచించడం ఈ సందర్భంలో గమనింపదగినది. (ఆం.సా.ప. పత్రిక_సంచిక—4, సంపుట_26, పుట_169_"చజలు" వ్యాసం)

ఏ-ఓలకు గ్రాహకంగా వక్రసంజ్ఞను ఏర్పరచుకొన్నందువల్లనే. "అద్దంత్యాః తాలవ్యశ్చుర్వక్రః" (సంజ్ఞా—26) అనే ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రందగ్గర చో-జో లుకూడా తాలవ్యాలేమో అనే సందేహం తల ఎత్తడమూ ప్రయోగ ప్రసిద్ధిని బట్టీ, అనంతర లాక్షణికోక్తినిబట్టీ అవి దంత్యాలే అని నిర్ధారించడమూ జరుగుతోంది.

**అతఁడెక్కడ ? :**

ఇలా ఆంధ్ర శబ్ద చింతామణి ప్రతిస్వరానికీ 'అచ్చు' అనే సంజ్ఞను ఏర్పర చిందికాబట్టే "సంధిర్నాచోఽచ్యనతః" (సంధి-1) అనే సూత్రం చేత "అతఁడెక్కడ" వంటి రూపాలు సాధింపబడుతున్నాయి. లేకపోతే_

'అచ్' అనే పాణినీయ ప్రత్యాహారంలో హ్రస్వమయిన 'ఎ' ఉండదుకాబట్టి అదిపరంగా ఉన్నప్పుడు (అచిపరే) ఉత్వసంధి జరగకపోవలసి వస్తుంది.

అందుచేత ఇక్కడ 'అచి' అనే పదానికి "అచ్ ప్రత్యాహార ఘటిత వర్ణము పరమగునప్పుడు" అని అర్థం చెప్పడానికి వీలులేదు. ప్రాణానికి (స్వరానికి) సంజ్ఞా వాచకంగా స్వీకరించి "స్వరము పరమగునప్పుడు "అనే అర్థాన్నే వివక్షించాలి. అప్పుడే "అతఁడెక్కడ" వంటి రూపాల్లో ఉత్వసంధి సాధ్యమవుతుంది.

'హల్' అనే పదాన్ని పాణినీయ హల్ప్రత్యాహార ఘటిత వ్యంజనాలకూ ఆ ప్రత్యాహారంలో చేరకుండా తెలుగులో మాత్రమే ఉన్న వ్యంజనాలకూ కూడా సంజ్ఞగా ఆంధ్ర శబ్ద చింతామణి భావించింది. అందుచేతనే "చ—జ—ఱ" లకు హల్లులు అనే వ్యవహారం చెల్లుతోంది.

అచ్_హల్_అనేవి పాణినీయంలో ప్రత్యాహారాలే అయినా, ఆంధ్ర వ్యాక రణాల్లో అవ్వి స్వర—వ్యంజనమాత్ర బోధకాలుగా రూఢమయిన సంజ్ఞలు మాత్ర మేననీ, ప్రతిస్వరమూ ఒక అచ్చు, ప్రతి వ్యంజనమూ ఒక హల్లు అనీ, అందుకే అచ్చులు_హల్లులు అనే బహువచనాంత వ్యవహారం ఏర్పడిందనీ ఇక్కడికి సారాంశం.

**కేతనాదుల మతం :**

ఆదులు స్వరములు నచ్చులు<br>
కాదులొగిన్ వ్యంజనములు హల్లులు ననఁగా<br>
మేదినీ నెల్లెడఁ జెల్లును<br>
కాదుల నైదైదుకూర్పు నగు వర్గంబుల్ (ఆం.భా.భూ —16)

అని చెప్పిన కేతన అభిప్రాయంకూడా ఇట్టిదే. 'ఆదులు' అనేది గణపరంగా ఏర్పడిన సంజ్ఞ. 'స్వరములు' అనేది అన్వర్థ సంజ్ఞ. కాగా 'అచ్చులు' అనేది రూఢ సంజ్ఞ. అల్లాగే 'కాదులు' అనేది గణపరంగానూ, వ్యంజనములు అనేది అన్వర్థంగానూ, హల్లులు అనేది రూఢంగానూ సంజ్ఞలు అవుతున్నాయి. కానిపక్షంలో అచ్చులు-హల్లులు అనే బహువచనాంత నిర్దేశాలు చేయవలసినట్టి అవసరం అంతగా లేదు.

"మేదిని నెల్లెడఁజెల్లును" అనడాన్నిబట్టి అచ్చులు—హల్లులు అనే పదాలు సంజ్ఞలుగా ఆంధ్ర-అనాంధ్ర స్వర వ్యంజనాలకన్నింటికీ యథాక్రమంగా అన్వయిస్తాయి సుమా! అనేది కేతన ఉద్దేశించిన హెచ్చరిక కావచ్చు. అటుపైని ఆంధ్ర వ్యాకర్తలకు అందరికీ ఈ మార్గమే అనుసరణీయమయ్యింది.

## *బాల వ్యాకరణ మతం :*

చిన్నయసూరికూడా ఈ మార్గాన్నే అనుసరించాడు. "ఉత్తునకచ్చు పరంబగు నప్పుడు సంధి యగు" (సంధి-1) అనే ఈతని బాలవ్యాకరణ సూత్రానికి లక్ష్యాలుగా "అతఁడెక్కడ"-"ఇతఁడొకఁడు" అనే రెండింటినీ ఇచ్చి హ్రస్వ వక్రాలకు (ఎ-ఒ) 'అచ్చులు' అనే సంజ్ఞ వర్తిస్తుందనే విషయాన్ని సూచించాడు. 'అచ్చు' అనేది పాణినీయప్రత్యాహారమే అయినపక్షంలో ఈ ఉత్వ సంధులు సాధింపబడవనడం ఉక్తపూర్వమే. "పూర్వపరస్వరంబులకుఁ బరస్వరంబేకాదేశంబగుట సంధి యనంబడు" ఈతని ఈ వివరణవాక్యం పై సూత్రంలోని 'అచ్చు' అనే పదం స్వర సర్వస్వ పర్యాయమని నిర్ధారిస్తోంది.

ఇతడు తన సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణంలో "అచో యడచః పరాదచి" (సంధి—1) అని సూత్రించి, బాలవ్యాకరణంలో "సంధి లేనిచోట స్వరంబు కంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (సంధి—3) అని వ్యవహరించడంలోకూడా 'అచ్చు' అనేది కేవల పాణినీయ ప్రత్యాహారం కాదనీ, స్వర పర్యాయమయిన సంజ్ఞ అనీ స్పష్టపడుతోంది.

## *ర ల తుల్యతావశ్యకత :*

పాణినీయ ప్రత్యాహారగత వర్ణాలకుకూడా ఇవి సంజ్ఞలుగా వర్తిస్తాయి అనేది కూడా ఇతనికి సమ్మతమే. అందుచేతనే 'అతఁడు ఋషి' ఇత్యాదుల్లో 'ఋ' అనే

'అచ్చు' పరంగా ఉందికాబట్టి రావలసిన ఉత్త్వ సంధిని వారిస్తూ "పదాద్యంబులు ఋ ౠ వర్ణంబులు రలతుల్యంబులు" (బా వ్యా ప్రకీర్ణ–1) అని సూత్రించడం జరిగింది.

## సూరి లౌక్యం:

"సంస్కృతంబునకు వర్ణంబులేఁబది" (బా.వ్యా. సంజ్ఞా-1) అనే సూత్రం దగ్గర "ఇందకారాదులచ్చులు–కకారాదులు హల్లులు. ఆ జ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది" అని చిన్నయసూరి ఒక మాట పలికాడు. ప్రాకృత వర్ణాంలోనూ, కేవలాచ్ఛిక వర్ణాలలోనూ ఈ విభాగం చెయ్యడానికి అతడు కొంత సందేహించినట్లు కనబడుతోంది. అందుకే "అజ్ఝల్విభాగమీలాగుననే మీఁద నెఱుంగునది" అని గంభీరంగా తప్పుకున్నాడు. 'అచ్' అనే పాణినీయ ప్రత్యాహారంలోకి వచ్చే స్వరాలలో కొన్ని ప్రాకృతాంధ్ర వర్ణమాలల్లో లేవు. అలాగే 'హల్' అనే పాణినీయ ప్రత్యాహారంలోకి వచ్చే వ్యంజనాలలో కొన్ని ప్రాకృతాంధ్రాలలో లేవు. తెలుగులో కొన్ని అధికంగానూ ఉన్నాయి. కాబట్టి ఈ రెండు భాషల వర్ణమాలలనూ తెలియజేస్తున్న రెండు–మూడు సూత్రాలదగ్గర 'అచ్చు' 'హల్లు' అనే విభాగం చేయడానికి అతడు సందేహించి లౌక్యంగా సంస్కృత వర్ణమాలదగ్గరే పలికేశాడా అనే ఆలోచన రావడం కద్దు. వీటిని వీరు రూఢంగా సంజ్ఞలు అని వాచ్యం చెయ్యక పోవడానికి కూడా కారణం కనబడడంలేదు.

## తెలుగు వ్యాకరణ కోశం :

వీటి తత్వం ఇలా ఉండగా అచ్చులు-హల్లులు అనేవి తెలుగు వ్యాకరణాల్లో కూడా ప్రత్యాహారాలేననీ, వాటిని నిరూపించవలసిన అవసరం తెలుగు వ్యాకర్తలకు లేక పోయిందనీ తెలుగు వ్యాకరణకోశం చేసిన వివరణం యథా ప్రసిద్ధి వచనం అనుకోవాలి.

## ప్రత్యాహారాలు సంజ్ఞలా? :

పాణినీయంలో సాంకేతికంగా ఏర్పడిన ఈ ప్రత్యాహారాలను ప్రాకృతాంధ్ర వ్యాకర్తలు యథావసరంగా ఇలా సంజ్ఞలుగా స్వీకరించడం సమంజసమా? అనే సందేహం కలుగుతుంది.

ఈ ప్రత్యాహార పద్ధతికి పాణిని సృష్టికర్త కాదు. దీనికి మహేశ్వర సూత్రాలే సాక్షులు. కాగా ప్రత్యాహారాలకు వాచ్యంగా సంజ్ఞాత్వాన్ని విధించే అష్టాధ్యాయీ సూత్రమేదీ లేకపోయినా ప్రత్యాహార విధాయక సూత్రాన్నే (ఆదిరంత్యేన సహేతా-1-1-71) సంజ్ఞా విధాయకంగాకూడా కైయటాది వ్యాఖ్యాతలు భావించారనడానికి అవకాశం లేకపోలేదు.

పరత్వాన్నిత్యత్వాద్వా ఆదిరంత్యేన సహేతా ఇత్యనేన
అచ్ సంజ్ఞా విధాన కాలేఽనుబంధానాం లోపాత్ అసన్నిధానాత్
అచ్ సంజ్ఞా న ప్రవర్తతే। (భాష్యం-ప్రదీపం-పుట-95)
—ఏవం చ పూర్వమనుబంధలోపాత్ ఆదిరంత్యేన-
ఇతి సంజ్ఞా విధానకాలేఽసన్నిధానాదిత్యన్వయః।

(భాష్యం—ఉద్యోతం—పుట—95)

వీరి ఈ వ్యాఖ్యానాలననుసరించి భట్టోజి దీక్షితులవారు ఈ సూత్రాన్ని సంజ్ఞా పరిచ్ఛేదంలో చేర్చడంతోపాటు

"—మధ్యగానాం స్వస్య చ సంజ్ఞా స్యాత్" అని తేల్చి చెప్పడం జరిగిందనుకోవచ్చు.

"అంత్యేనేతాదిః" (1-1-73) అనే జైనేంద్ర వ్యాకరణ సూత్రానికి అభయనంది తన మహావృత్తిలో "అంత్యేన ఇత్సంజ్ఞకేన గృహ్యమాణః ఆదిః తన్మధ్యపతితానాం గ్రాహకో భవత్యాత్మనా సహ।" అన్నాడే తప్ప సంజ్ఞాపదాన్ని ఉపయోగించకపోవడం గమనింపదగిన అంశం.

అయితే—'అచ్' అనే ప్రత్యాహారంవల్ల మహేశ్వర సూత్రోపాత్తాలయిన అచులన్నీ ప్రతీయమానమవుతున్నాయి. దీనినే తిరగవేస్తే—అచులకన్నింటికీ 'అచ్' అనేది ప్రత్యాయ్యకమూ అవుతోంది. అందుచేత—

యయా ప్రత్యాయ్యంతే సా సంజ్ఞా,
యే ప్రతీయంతే తే సంజ్ఞిన ఇతి। (భాష్యం-1-1-3, పుట-106)

అనే వ్యాకరణ మహాభాష్యోక్తి మేరకు అజాది ప్రత్యాహారాలకు సంజ్ఞాత్వమూ, ఆదులకు సంజ్ఞిత్వమూ సిద్ధించడంలో విప్రతిపత్తి లేదు.

**అపాణినీయ ప్రత్యాహారాలు :**

అర్వాచీన ప్రాకృత వ్యాకరణాలలో కొన్నింట ఇత్సంజ్ఞాకం కాని వర్ణంతో ప్రత్యాహారం చెయ్యడం ఆభాసిస్తోంది. అదీ సుప్పులకు మాత్రమే పరిమితంగా కనబడుతోంది.

సుప్స్వాదిరంత్యహలా (వాల్మీకి త్రివిక్రమ, 1–1–4) అనే సూత్రం–'సుప్స' అని స్పష్టంగా నిర్ధారిస్తోంది.

"విభక్తీనామాదివర్ణో వచనం వాంత్యేన వ్యంజనేన సహ
ఉచ్చార్యమాణః ప్రత్యాహారః స్యాత్।"

(షడ్భాషావివరణం–పుట – 11)

దీని వ్యాఖ్యాతలందరూ ఇలా ఈ ప్రత్యాహారనిర్మాణాన్ని సుప్పులకే పరిమితం చేశారు.

సంస్కృత వ్యాకరణ ప్రోక్తాలయిన సుప్పులు యథాతథంగా ప్రాకృతాంధ్రాలలో నిలవడంలేదు. కాబట్టి ఆ సుప్పులలోని అంత్యాలకు కార్యార్థత్వమూ అప్రయోగిత్వమూ అనే వీరి ఇద్వర్ణ లక్షణాలు సరిపడుతున్నాయి. అందుచేతనే ఈసుప్పులలో పాణినీయం ప్రకారం (న విభక్తౌ తుస్మాః – 1—3–4) ఇత్సంజ్ఞను పొందని వర్ణాలతోకూడా వీరు ప్రత్యాహారాలను చేయడం జరిగింది. కాగా ప్రత్యాహారం చెయ్యాలి అంటే పాణినీయమో అపాణినీయమో ఇత్సంజ్ఞాకమయిన వర్ణమే ఉండితీరాలి అనేది వీరి మతంగా మనం భావించవచ్చు. వీటి నిర్మాణ పద్ధతి పాణినీయమే అయినా ఇత్సంజ్ఞ మాత్రం పాణినీయంకాదు. ఈ భేదాన్ని పురస్కరించుకొని వీటిని అపాణినీయ ప్రత్యాహారాలు లేదా ప్రాకృతీయ ప్రత్యాహారాలు అనడం సమంజసం. అందుకే ఆంధ్ర శబ్ద చింతామణిలో కనిపించే టాసాది ప్రత్యాహారాలను అహోబల పండితుడు "ప్రాకృతీయః ప్రత్యాహారః" అంటూ వివరించడం జరిగింది (కవి శిరోభూషణ వివృతి, పుట—309)

"సుప్స్వాదిరంత్యహలా" అనే సూత్రానికి ప్రాకృత మణిదీపం చేసిన వ్యాఖ్యానంలో ఒక వైలక్షణ్యం ఉంది. "స్వాదివిభక్తిషు ఆదిః వర్ణో వచనం వానితాపి అంత్యవర్ణేన సహ గృహ్యమాణో మధ్యగానాం స్వస్య చ సంజ్ఞా స్యాత్। తేన 'సుప్' ఇతి ప్రథమా—।" ఇత్యాదిగా సాగిన ఈ పంక్తులలో భట్టోజి దీక్షితులవారి వృత్తి ప్రభావం కొట్టవచ్చినట్టు కనబడుతోంది. ఇందులోని "అనితాఽపి" అనేచోట "పాణినీయ ప్రోక్తమయిన ఇత్సంజ్ఞ లేని అంత్య వర్ణంతో సహ" అనే అర్థం అభిప్రేతంగా భాసిస్తోంది

బాల వ్యాకరణకర్త "లకారంబునకు డుజ్ఞావురు నుముఞ్ఞగు" (క్రియా—8) అనే సూత్రం దగ్గర "ఇందు ఞ కారంబు ప్రత్యాహారార్థంబు" అని వివరించి డుఞ్—రుఞ్ ఇత్యాదిగా ప్రత్యాహారాలను చేశాడు. ఇత్సంజ్ఞాకమే అయినా ప్రత్యాహారార్థంకాని వర్ణంతో ప్రత్యాహారం చెయ్యడం ఇతనికి సమ్మతంగా కనబడడంలేదు. అందుకే "లూణ్మధ్యమ వురులకు ముడుఙ్జులగు" (క్రియా—29) అనే సూత్రంతో విధింపబడిన 'మధ్యమ ముడుజులు ముజ్జునాబడు'. అని (క్రియా-31) ప్రత్యేక విధానం చేశాడు. ఇక్కడ 'డుఙ్'లో ఙ కారం ఇద్వర్ణమే. కానీ ఇది ప్రత్యాహారార్థంకాదు. ప్రయోజనాంతరం ఉంది. అందుచేత దీనితో ప్రత్యాహారంచేయడానికి ఇష్టపడక ఈ ప్రత్యేక విధానం చేయడం జరిగి ఉండవచ్చు. స్పష్టప్రతిపత్తి ఆనుషంగికమే. 'జీత్' లోని తకారం (జీ—ఇత్) ఇద్వర్ణంకాదు. అందుచేత ముజ్జులను జీత్తులతో కలిపి "ముఙ్ జీత్తులు ముత్తునాబడు" (క్రియా—86) అని మరొక ప్రత్యేక విధానంచేశాడు. ఇట్టివి సంక్షిప్త వచనాలు—సమాహారాలు అవుతాయే కానీ ప్రత్యాహారాలు కానేరవు. 'ముఙ్' ను ప్రత్యాహారంగా భావించినా 'ముత్' ను ప్రత్యాహారమనడానికి అవకాశం లేదు.

ప్రాకృతాంధ్ర లాక్షణికులు ఇచ్చిన ఇత్సంజ్ఞా నిర్వచనాలకు మార్గదర్శకుడయిన జైనేంద్రుడు (దేవనంది) సుడసిః (1—1—32, పుట—18) అనే సూత్రంలో 'సుట్' అని ప్రత్యాహారం కల్పించాడు. సు—ఔ-జస్, అమ్-ఔట్—ఇవి ఇందులోకి వచ్చే ప్రత్యయాలు. ఇక్కడ 'ఔట్' లోని టకారం పాణినీయం ప్రకారంకూడా ఇత్సంజ్ఞకమవుతుంది (న విభక్తౌ తుస్మాః. 1—3—4) "కార్యార్థోఽప్రయోగీత్" (1-2-3) అనే తన నిర్వచనం ప్రకారంకూడా ఇత్సంజ్ఞ సిద్ధిస్తోంది. అందుకే అభయనంది తన మహావృత్తిలో "సుడితి ప్రత్యాహారేణ స్వౌజసమౌటాం గ్రహణమ్" అని ఊరుకున్నాడే తప్ప ఇక్కడ టకారం ఇత్సంజ్ఞకమా? కాదా? ఇత్యాదికమయిన చర్చలను

లేవనె త్తలేదు. జైనేంద్రంలో కూడా ఉంత్యేనేతాదిః (1-1-73) అనే సూత్రం ప్రత్యాహార నిర్మాణానికి ఇత్సంజ్ఞాకమయిన వర్ణం ఉండి తీరాలి అని నిర్ధారిస్తూనే ఉంది. అయితే ఆ ఇత్సంజ్ఞ స్వీయ వ్యాకరణ సిద్ధమయినా కావచ్చు లేదా పాణినీయ విహితమయినా కావచ్చు.

అనంతర కాలంలోని సారస్వత వ్యాకరణంలో (12-14 క్రీ.శ.) ప్రత్యాహారాల వంటివి ఉన్నా ఇత్సంజ్ఞాప్రమేయం పరిత్యజింపబడింది. ఇది స్పష్టతకోసమూ, లాఘవం కోసమూ చేసిన మార్పుగా పరిశోధకులు భావిస్తున్నారు. ఈ వ్యాకరణంలోనిది ఇత్సంజ్ఞా వర్ణాలతో సూత్రమే ప్రత్యాహారాలను ఏర్పరిచే పాణినీయ ప్రణాళిక కాదని స్పష్టమవుతోంది. కాగా 'చ-ట త-క-ప' లకు బోధకంగా ప్రయోగింపబడిన "చప" వంటివాటిని (ఆద్యంతాభ్యామ్-సారస్వత-17) సమాహారాలు-సంక్షిప్తవచనాలు-సంగ్రహోక్తులు-ఇత్యాదిగా ఏవో నామాంతరాలతో వ్యవహరించాలే తప్ప పాణినీయం లోని ఒకానొక సాంకేతికతకు పాణినీయులు ఏర్పరచుకొన్న ప్రత్యాహారపదాన్ని ఉపయోగించడం సమంజసం కానేరదు. కానిపక్షంలో సారస్వత వ్యాకర్త లాఘవ దృష్టితో దేనిని పరిహరిద్దామనుకున్నాడో దానినే అతని నెత్తిన రుద్దడమవుతుంది. అంతేకాదు అతడు ఉద్దేశించిన స్పష్ట ప్రతిపత్తికికూడా భంగంవాటిల్లే ప్రమాదం ఉంది.

ఇది ఇలా ఉండగా సారస్వత వ్యాకరణంలోకూడా ఇత్సంజ్ఞా విధాయకమూ, తల్లోప విధాయకమూ (కార్యాయేత్-యస్యేత్సంజ్ఞా తస్యలోపః) ఉన్నాయని కొందరు అంగీకరించడం జరిగింది. అప్పుడయినా ఇత్సంజ్ఞాకమయిన వర్ణంతో చేసిన వాటిని మాత్రమే ప్రత్యాహారాలనడమూ, తద్భిన్నమయిన 'చప' వంటి వాటిని ప్రత్యాహారాలు అనకపోవడమూ న్యాయం. 'చప' లోకి స్వీకరింపబడుతున్న వ్యంజనాల క్రమం మాహేశ్వరమే అయినా ఇత్సంజ్ఞాకం కాని వర్ణంతో తొలి వర్ణాన్ని కలపడమనేది మాత్రం ఇక్కడగల భేదం. దీనినికూడా ప్రత్యాహారమే అన్నట్టయితే సారస్వతం ఉద్దేశించిన ఈ భేదానికి ప్రత్యేక ప్రతిపత్తి నశిస్తుంది. ఇటువంటివాటిని ప్రత్యాహారాలుగా సారస్వతం పేర్కొన్నదనడానికి ప్రమాణాలుకూడా మృగ్యం.

## "కపాః" ప్రత్యాహారమా? :

ఆంధ్ర వ్యాకర్తలు తమ గ్రంథాల్లో ఉపయోగించిన మిత్త్వ-టిత్త్వ-కిత్త్వాలకు (నుమ్-యట్-ముక్. మొ. వి) పాణినీయానుసారం ఆయా ప్రయోజనాలను వ్యాఖ్యాతలు

నిష్పదించారు. బాల వ్యాకరణంలోని జి_త్వాదిత్వాదులకు ప్రయోజనం చిన్నయసూరి స్వయంగా ఆవిష్కరించాడు. ఇద్వర్ణానికి ఈతడు ఇచ్చిన నిర్వచనం మేరకు డఞాది ప్రత్యాహారాలను క్రియాపరిచ్ఛేదంలో వినియోగించాడు. కాగా ఈతడు ప్రయోగించిన ప్రత్యాహారాలు స్వతంత్రాలే అయినా కల్పించిన పద్ధతిమాత్రం సంస్కృత ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధమే కానీ స్వకపోల కల్పితం కాదు.

> ద్రుతస్య హలి బిందుస్స్యాత్ శ్లిష్టత్వం చ క్వచిత్ స్వతా।
> లోపశ్చాద్యతృతీయౌ తు న యుక్తౌ శబ్దవిన్మతే॥
> ఆద్యే తృతీయే చ కపాః తృతీయాః స్యుః కపేతరే।
> ఆద్యే ద్వితీయే తుర్యే చ ప్రాప్నువంతి నిమిత్తతామ్॥
>
> (అథర్వణ కారికావళి_సంధి_18, 19)

ఈ వికృతి వివేక కారికలో "కపాః" అనేది 'కచటతపాః' అనేదానికి సంక్షిప్త రూపంగా ప్రయోగింపబడింది. అందుకే వ్యాఖ్యాతలందరూ కపాః=క_చ_ట-త-పలు అని అర్థం చెప్పారు.

చిన్నయసూరికూడా తన సూత్రాంధ్ర వ్యాకరణంలో కృతోల్లోప స్తనాదిభ్యః కపానాం తు గబా మతాః। (తద్ధిత_105) కన్వాదిభ్యోఽన్త్యలోపిభ్యః పరుషాణాం గబా మతాః। (సంధి_27) అని పై కారికావళి మార్గాన్ని అనుసరించాడు.

ఇవి ప్రత్యాహారాలు మాత్రం కానేరవు. వీటి చివర ఉన్న 'ప_బ' అనేవి ఏ నిర్వచనంమేరకూ ఇత్సంజ్ఞకాలు కావడంలేదు ఇత్సంజ్ఞాకం లేనప్పుడు "ప్రత్యాహారము" అనడానికి వీలులేదు. ఒకవేళ దానికి (ప_బ) ఇత్సంజ్ఞనే అంగీకరిస్తే అది అప్రయోగి అవ్వాలి కాబట్టి 'కపాః' అనే దానిలోకి క-చ-ట-త, 'గబాః' అనే దానిలోకి గ_జ-డ-దలు మాత్రమే స్వీకరింపబడే ప్రమాదం ఏర్పడుతుంది. అందుచేత సారస్వత వ్యాకరణ మార్గాన ఏర్పడిన ఇటువంటి వాటిని సమాహారాలూ సంక్షిప్త వచనాలూ ఇత్యాదిగా వ్యవహరించాలి. ప్రత్యాహారాలు అనడానికిమాత్రం సాంకేతికంగా అవకాశంలేదు కానీ "తెలుగు వ్యాకరణకోశం" ఈ అధర్వణకారికా ప్రయోగాన్ని (కపాః) ప్రత్యాహారంగానే ప్రతిపాదించింది.

# ద్రుతమూ-ద్రుత ప్రకృతికమూ

తెలుగు వ్యాకరణాల్లో కానవస్తున్న తత్సమతద్భవ విభాగం ప్రాకృత వ్యాకరణ ప్రభావంతో ఏర్పడినదే అని కోరాడ రామకృష్ణయ్యగారి నుంచి (భాషా చారిత్రక వ్యాసములు—"ఆంధ్రము—అన్యదేశ్యము") వఱకు నిర్ధారించడం జరిగింది. లోపము-లుక్కు మొదలయిన పారిభాషిక పదాలుకూడా ప్రాకృత వ్యాకరణ మర్యాద ననుసరించినవేనని వంతరాం రామకృష్ణారావుగారు తమ ఘంటాపథ వ్యాఖ్యానాలలో— బాల ప్రౌఢవ్యాకరణాలకు— ప్రతిపాదించారు.

కాగా సంస్కృత ప్రాకృత వ్యాకరణాలతో సంబంధం లేకుండా తెలుగుకు మాత్రమే పరిమితంగా ఉన్న ద్రుతమూ—ద్రుతప్రకృతికమూ-వీటినిగురించి అటు లాక్షణికులూ ఇటు భాషా చారిత్రికులూ సుదీర్ఘంగా చర్చించారు. ఇంకా వాదోపవాదాలు సాగుతూనూ ఉన్నాయి.

ఏది "ద్రుతము" :

ద్రుత స్వరూపమేది? అనే విషయం స్వర పరత్వంలో కచ్చితంగా తెలిసే అవకాశం లేదు. "వచ్చెనతడు" ఇత్యాది స్థలాల్లో వచ్చెన్+అతడు-వచ్చెను+అతడు అని రెండు విధాల పదవిభాగానికీ అవకాశం ఉంది. కాబట్టి ద్రుతము పొల్లునకారమా? స్వరసహిత నకారమా? అనే సందేహం తీరదు. ద్రుత ద్విత్వ సంధిని అంగీకరించిన చోట్ల గూడా సంధి విధానంచేతనే స్వరలోపం గమ్యమానమవుతోందనే సమన్వయం మేరకు ద్రుత స్వరూపం ఏమిటి? అనేది సందేహంగానే మిగిలిపోతుంది.

కాగా వ్యంజన పరత్వంలోనే ద్రుత స్వరూపం కచ్చితంగా తెలిసే అవకాశం ఉంది.

'ద్రుతము' అని వ్యవహరింపబడుతున్నదానికి వ్యంజన పరత్వంలో అయిదు వికారాలు కనబడుతున్నాయి. ఇవి ప్రాచీనార్వాచీన వ్యాకర్తలకందరకూ సమ్మత మయినవే.

"ద్రుతస్య హలి బిందుః స్యాత్ శ్లిష్టత్వంచ క్వచిత్ స్వతా లోపశ్చ—" (సంధి_15). ఈ వికృతి వివేక కారిక ఆ అయిదింటినీ పొందుపరచింది. (బిందువు=2). ఏది సంశ్లేషము? ఏది స్వత్వము? అనే విషయంలో ప్రాచీనార్వాచీన వ్యాకరణాలకు అభిప్రాయభేదం ఉన్నదన్నా వ్యంజనపరత్వంలో పూర్ణబిందు, ఖండబిందు, సంశ్లేష, స్వత్వ. లోపాలకు మించి మరొక వికారాన్ని అర్వాచీన వ్యాకరణాలుకూడా ఈ ద్రుతానికి చెప్పలేదు. ఈ అయిదు వికారాలకూ అయిదు సంజ్ఞలు ఉపాత్తాలయ్యాయి.

1. పూచెఁగలువలు — అనే రూపంలో ఖండబిందు సంజ్ఞ,
2. పూచెంగలువలు — అనే రూపంలో పూర్ణబిందు సంజ్ఞ,
3 పూచెగ్గలువలు — అనే రూపంలో సంశ్లేష సంజ్ఞ,
4. పూచెనుగలువలు — అనే రూపంలో స్వత్వ సంజ్ఞ,
5. పూచె గోరింట — అనే రూపంలో లోప సంజ్ఞ,

సార్థకాలు అవుతున్నాయి. స్వత్వము అంటే సూరి నిర్వచనం ద్రుతానికి ప్రకృతి భావమే కాబట్టి "కలువలు పూచెను" ఇత్యాదిగా అవసానంలోని స్వర సహిత రూపం కూడా స్వత్వసంజ్ఞకం అవుతుంది అలాగే 'గోరింట పూచె' అనే చోట అవసానంలో ద్రుతలోప స్థితికి లోప సంజ్ఞ వర్తిస్తుంది.

కాగా కలువలుపూచెన్,_గోరింటపూచెన్ ఇత్యాదిగా స్వరలోపంతో మిగిలిన పొల్లునకారానికి సంజ్ఞ ఏమిటి? అనేది సందేహం. పరిశేష న్యాయాన్ని అనుసరించి 'ద్రుతము' అనే సంజ్ఞ దీనికి మాత్రమే అన్వయిస్తుంది. అయిదు వికారాలలోనూ ప్రతి వికారానికీ ఒక ప్రత్యేకసంజ్ఞ ఉండగా, పొల్లు నకారంగా మిగిలిన స్థితిలో ప్రత్యేక సంజ్ఞ ఏదీ లేదుకాబట్టి ద్రుతము అంటే పొల్లునకారమే అవ్వాలి. ఇదియుక్తి. స్వరసహితమయ్యింది అంటే అది స్వత్వసంజ్ఞకు అర్హమవుతుందే గాని కేవల ద్రుత శబ్దవాచ్యం కానేరాదు. కానీ ఈ రెండింటికీ కలగలుపు అర్వాచీన వ్యాకర్తలలో

కనబడుతోంది. వీరి మతంలో స్వరసహిత నకారానికి ద్రుత సంజ్ఞ వర్తించడం ఔపచారికమే అనుకోవాలి. అందుచేతనే నుగాగమాదుల్లోని స్వరం ప్రత్యేక విధానంతో ప్రమేయం లేకుండా సంధి కార్య విధాన సామర్థ్యంచేతనే లోపించడం జరుగుతోంది.

## ద్రుత శబ్దార్థం :

ద్రుతమనఁగా నొల్లనియెడ మఱిగి పోవునది" అనేది ప్రౌఢ వ్యాకరణ నిరుక్తి. (ప్రౌఢ–సంజ్ఞ–1) దీనిని అనుసరించి ద్రవించి పోవునది కావున ద్రుతము– మీది స్వరం ద్రవిస్తుందనీ, తానే ద్రవిస్తుందనీ–ఇత్యాదిగా వ్యాఖ్యాతలు చెబుతూవచ్చారు.

(చింతామణి విషయ పరిశోధనము–పుట–194, 195)

"ద్రుతము" అనే సంజ్ఞ ఉచ్చారణ స్వభావాన్నిబట్టి ఏర్పడినదిగా కనబడుతోంది. వర్ణోచ్చారణలో మూడు వృత్తులు ఉన్నాయి. "అభ్యస్థితా వర్ణా ద్రుత మధ్యమ విలంబితాసు—" ఇత్యాదిగా భాష్యకారుడు వివరించాడు. (భాష్యం. 1–1–70)

సంగీత శాస్త్రంలోకూడా ఘాతకూ ఘాతకూ నడుమ ఇచ్చే జాగాను సంకోచపరచడంవలన ద్రుత–అనుద్రుతాది తాళగతిభేదాలు ఏర్పడుతున్నాయి. ఉపేత్తు ఉంటే ద్రుతమనీ లేకపోతే అనుద్రుతమనీ వారి వ్యవహారం. లయ ప్రాణ లక్షణానికి సంబంధించి "మృదంగ తత్త్వంలో" ఈ శ్లోకం ఉదాహృతమయ్యింది.

క్రియానంతర విశ్రాంతిర్లయః స్యాత్ త్రివిధో మతః।
ద్రుతో మధ్య విలంబౌ చ ద్రుతః శీఘ్రతమో మతః।
ద్విగుణ త్రిగుణ జ్ఞేయౌ తస్మాన్మధ్య విలంబితౌ।

"తాళములో క్రియవేసిన అనంతర విశ్రాంతికి లయ అని పేరు. ఈ లయ మూఁడు విధములుగనున్నది. వానికి ద్రుత మధ్య విలంబములని వ్యవహారము. ఇందు ద్రుతముయొక్క నడక శీఘ్రతమమైనది –" ఇది మార్దంగిక సమ్రాట్

శ్రీ దర్భాల రామమూర్తిగారి వివరణం. (మృదంగతత్త్వము—పుట–27) అల్ప కాలస్వరప్రాసం ఉండే లక్షణంగా కనబడుతోంది. ఈ లక్షణాన్ని బట్టే వ్యాకరణంలో కూడా ద్రుత సంజ్ఞ ఏర్పడి ఉండవచ్చు.

స్వరసహితమయిన వ్యంజనాన్ని ఉచ్చరించడానికి పట్టే కాలంకన్నా స్వరరహిత మయిన వ్యంజనాన్ని ఉచ్చరించడానికి పట్టేకాలం తక్కువ. దీనిని ద్రుతోచ్చారణ లేక ఉచ్చారణలోని ద్రుతప్రవృత్తి అనవచ్చు. స్వర రహితమయిన స్థితిలోనే నకారానికి ద్రుత సంజ్ఞ అనువర్తిస్తున్నది కాబట్టి దాని ఉచ్చారణలోని అల్పకాలికతకు సూచకంగా ఈ సంజ్ఞ ఏర్పడినదని భావించవచ్చు. అయితే తక్కిన పొల్లు హల్లులకు ఇది వర్తించడంలేదు కాబట్టి దీనిని యోగరూఢ సంజ్ఞగా భావించాలి

అంతేకాదు—స్వర రహితమయిన ఇతర హల్లును ఉచ్చరించడానికి పట్టేకాలం కన్నా ద్రుత సంజ్ఞాకమయిన పొల్లు నకారాన్ని ఉచ్చరించడానికి పట్టేకాలం తక్కువగా భాసిస్తోంది. ఇది అనుభవైకవేద్యమే అయినా ఈ ప్రతిపాదనకు హేతువు లేకపోలేదు. ద్రుత సంజ్ఞాకమయిన హల్లు లోపించడంవల్ల పదోద్దిష్టార్థావగతికి ఏ విధమయిన అసౌకర్యమూ కలగదు. ఉచ్చారణలో దీనిని పలకకపోయినా పదార్థావగతికి అవరోధం లేదు కాబట్టి ఇతర వర్ణాల ఉచ్చారణలో ఉన్నంత జాగరూకత, విలంబమూ, దీని ఉచ్చారణలో ఉండకపోవడం సహజం. ఇలా దీని ఉచ్చారణకాలంలోని అల్పత్వానికి సంసూచకంగా ద్రుతసంజ్ఞను రూఢపరచడం జరిగి ఉండవచ్చు. సంధికార్యాది విధానాలలో లాఘవాన్ని అపేక్షించి పదావయవమయిన నకారానికీ, సముచ్చయాద్యర్థ విశేష ద్యోతకమయిన నకారానికీకూడా ఈ సంజ్ఞను లాక్షణికులు విస్తరింపజేయడం జరిగి ఉండవచ్చు.

కేశిరాజు వెంకట నృసింహ అప్పారావుగారు—ద్రుత చరిత్రము—అనే తమ వ్యాసంలో భావించినట్టుగా సముచ్చయాద్యర్థవిశేష ద్యోతకం ఉశబ్దమేనని అంగీకరించి నట్టయితే రాముఁడున్–తండ్రియున్ ఇత్యాదుల నకారం సార్థకంకాదు కాబట్టి దాని ఉచ్చారణలోని ద్రుత ప్రవృత్తిని ఆశంకించవలసిన అవసరమే ఉండదు. వలెన్–పోలెన్ ఇత్యాదులలోని వంటిదే అవుతుంది ఇదీను. (వ్యాసపీఠము–పుట–5)

ఏది "ద్రుత ప్రకృతికము":

ద్రుత ప్రకృతి—ద్రుత ప్రకృతిక శబ్దాలు రెండూ ఆంధ్ర శబ్ద చింతామణిలో ఉపయుక్తాలయ్యాయి. (సంజ్ఞా—12, సంధి—21). 'కప్' ప్రత్యయ వైకల్పికత (శేషాద్విభాషా. 5_4_154) వీటి బహువ్రీహి సమాసతకు ఒక సూచకం. వ్యాఖ్యాతలు చాలమంది వీటిని బహువ్రీహులుగానే సమన్వయించారుకూడా. ఇవి సమస్త పదాలు అనడంలో ఎవరికీ అభిప్రాయభేదంలేదు. కానీ వీటిలోని 'ప్రకృతి' పదానికి అర్థం ఏమిటి? అనే విషయంలో అభిప్రాయ భేదాలు తలచూపుతున్నాయి.

"ద్రుతః ప్రకృతౌ యస్య సః ద్రుత ప్రకృతికః—ప్రకృతావేవ ద్రుతాంతః న తు ప్రత్యయేన — ప్రత్యయముచేతఁగాక ప్రకృతియందే నాంత శబ్దము ద్రుతప్రకృతికము." ఇది పారనంది రామశాస్త్రిలుగారి నిర్వచనం. (ఆంధ్ర శబ్ద చింతామణి-ఉద్యోతినీవ్యాఖ్య—పుట—44). దీనిలో వీరు ప్రకృతి శబ్దాన్ని ప్రాతిపదికార్థకంగానే భావించారనేది స్పష్టం.

వీరిమార్గాన, వలెన్ — పోలెన్ — ఎల్లన్ — ఇత్యాదులు మాత్రమే ద్రుతప్రకృతిక సంజ్ఞకు అర్హాలయి తక్కినవి కాకపోవడమూ, ప్రాతిపదికావస్థలో నాంతాలయినవన్నీ ద్రుతప్రకృతికాలే కావలసిన అవసరం ఏర్పడడమూ—ఇత్యాదిగా అవ్యాప్త్యతివ్యాప్తులు సంభవిస్తున్నాయి.

"ద్రుతమునకుఁ బ్రకృతియైనది ద్రుతప్రకృతికమనఁబడును" అనేది చర్ల గణపతి శాస్త్రిగారి నిర్వచనం. (నేను ద్రుత ప్రకృతికమా? కళయా?—ఆం.సా.ప.పత్రిక, సంచిక—3, సంపుటి—20, పుట—129)

"ప్రథమాచార్యుడు అవయవికముకాని యట్టి నకారమును ద్రుతమనియు, ఈ నకారమునకుఁ బ్రకృతులైన పదములను ద్రుత ప్రకృతికములనియు సంజ్ఞలను

కల్పించెను". ఇది డా॥ బొడ్డుపల్లి పురుషోత్తంగారి నిర్వచనం. (తెలుగు వ్యాకరణ వికాసము ప్రథమ, పుట—357).

ఈ రెండు నిర్వచనాలలోనూ ప్రకృతి శబ్దం ప్రాతిపదికార్థకంగానే స్వీకరింప బడడం గమనింపదగినది. చిన్నయసూరి తన బాలవ్యాకరణంలో "డు వర్ణకంబునకుం బ్రకృతి యైనది డుమంతంబు నాఁబడు" (తత్సమ—20) అనేచోట ప్రకృతి శబ్దాన్ని ప్రాతిపదికార్థకంగా ఉపయోగించాడు. ఈ నిర్వచనం మేరకు డువర్ణకం చేరడానికి అర్హమయిన రామాది ప్రాతిపదికలే డుమంత సంజ్ఞకు అర్హాలు అవుతున్నాయి.

"ద్రుతమునకుఁ బ్రకృతియైనది ద్రుతప్రకృతికము" అనే నిర్వచనం సమంజసంగా కనబడదు. ద్రుతప్రకృతిక సంజ్ఞచేత స్వీకరింపబడుతున్నవి ద్రుతాంతా లయిన పదాలే కానీ ప్రాతిపదికలు కావు. ద్రుతప్రకృతికం ప్రయోగార్హమయిన పదం. అందుచేత 'పరుషాః ద్రుతప్రకృతికాత్ సరళాః స్యుః, లుగ్వా ద్రుతప్రకృతి కాత్—' ఇత్యాది విధానాలు కుదురుతున్నాయి.

"ఈ నకారమునకుఁ బ్రకృతులైన పదములను ద్రుతప్రకృతికములనియు—" ఈ వాక్యానికి అసలు సమన్వయమే కుదరదు. వ్యాకరణ శాస్త్ర మర్యాదలో ప్రకృతి వేరూ పదం వేరూ గదా! సుబంతతగానీ తిఙంతతగానీ వస్తేనేతప్ప ప్రకృతులు, పదాలు కానేరవు. అందుచేత "ప్రకృతులైన పదములను" అనే మాటలకు ఉద్దిష్ట మయిన అన్వయం ఏమిటో తెలియకుండా ఉంది. నకారమునకు ప్రకృతులైనవే ద్రుత ప్రకృతికములు—అనేది ఉద్దిష్టమయిన పక్షంలో పై చర్లవారి నిర్వచనంలోని అసామం జస్యమే ఇక్కడా దుర్నివారమవుతుంది. నకారాంతములైన పదములే ద్రుతప్రకృతిక ములు—అనేది సమభిప్సితార్థమయితే వాక్యంలోని 'ప్రకృతులైన" అనేమాట దేనితో అన్వయించాలి? అనే సందేహం మిగిలిపోతుంది.

వీరి ఈ వాక్యంలోని ప్రకృతి శబ్దాన్ని స్వభావార్థకంగా భావించినా అన్వయం కుదరడంలేదు.

ఇది ఇలా ఉండగా—చిన్నయసూరి తన బాలవ్యాకరణంలో "స్వత్వం బనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతి భావము" (సంధి—17) అనే నిర్వచనంలో ప్రకృతి శబ్దాన్ని స్వభావార్థకంగా ఉపయోగించాడు ప్రకృతి భావము=స్వభావస్థితి. బింద్వాది వికారాలను పొందకుండా ద్రుతం యథాతథంగా ఉండడమనేది దీని తాత్పర్యంగా వ్యాఖ్యాతలు భావించారు. స్వర సహితమయిన నకారమూ సూరిమతంలో ద్రుతమే కాబట్టీ, "పూచెనుగలువలు" అనే దానిని స్వత్వస్థితిగా ఉదాహరించాడు కాబట్టీ పై తాత్పర్యం సమంజసమే.

ద్రుతానికి మాత్రమే ప్రకృతి భావాన్ని విధించాడు కాబట్టీ, ప్రకృతి భావస్థితిలో కూడా మీది పరుషాలు సరళాలుగా మారినట్టు ఉదాహరణల్లో చూపించాడు కాబట్టీ, ఇక్కడ ప్రకృతిభావ పదంచేత సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధమయిన ప్రకృతి భావ సంధిని సూరి ఉద్దేశించ లేదని స్పష్టపడుతోంది.

కాగా ఈ స్వత్వ నిర్వచనంలో సూరి వాడిన ప్రకృతి శబ్దం లోక ప్రసిద్ధ మయిన స్వభావార్థకమేకానీ శాస్త్ర ప్రసిద్ధమైన ప్రాతిపదికార్థకం కాదనేది సారాంశం.

"ద్రుతప్రకృతికము" అనే సంజ్ఞను ఏ సమాసంగా సమన్వయించినా ప్రకృతి శబ్దాన్ని ప్రాతిపదికార్థకంగా స్వీకరిస్తే అనిష్టార్థాపత్తి అనివార్యమే అవుతుంది. అందుచేత ఈ సంజ్ఞలోని ప్రకృతి శబ్దాన్ని స్వభావార్థకంగా మాత్రమే స్వీకరించాలి. అప్పుడు ద్రుతము ప్రకృతిగా కలిగినది ద్రుతప్రకృతికము. ద్రుతః ప్రకృతిః= స్వభావః యస్య సః ద్రుతప్రకృతికః. స్వభావసిద్ధముగా ద్రుతము అంతమందు గలిగినవి ద్రుతప్రకృతులు. అనే అర్థం లభిస్తుంది. కేతనాదులు "నాంతములు" (ఆం. భా. భూ—54) అనే మాటతో అభిలషించిన పదాలకు ఆంధ్ర శబ్ద చింతామణి ఏర్పరచిన సంజ్ఞ ఇది. ఆంధ్ర శబ్ద చింతామణి ముందుగా కళలను పేర్కొని వాటి కంటె భిన్నమయినవి ద్రుతప్రకృతికములు అనే వరుసలో ఈ సంజ్ఞను ఏర్పరచడం గమనింపదగిన విశేషం.

"తిజ్మధ్య-" సమన్వయం :

ఆంధ్ర శబ్ద చింతామణి "తిజ్మధ్యశేషషష్ఠీ–" అని ప్రారంభించి (సంజ్ఞా-14) ద్రుతో న యేషాం స్యాత్—అని కళలను నిరూపించి, అటుపైని "అన్యే ద్రుత ప్రకృతయో యే స్యుర్హ్యనుజీవిత ద్రుతా నిత్యమ్" అనిచెప్పడం జరిగింది. కాబట్టి ఈ రెండింటి సమన్వయమూ పరస్పరాపేక్షా సహితం

"అనుజీవితః (స్వాభావికః) ద్రుతః యేషాం తే నిత్యం ద్రుత ప్రకృతయః స్యుః, అనుజీవితః ద్రుతః యేషాం న స్యాత్ కళాః తే స్యుః తిజ్మధ్యాదయః" అని రెండింటికీ కలిపి అన్వయం చెప్పవచ్చు. ఈ ద్రుతప్రకృతిక సంజ్ఞలోని ప్రకృతి దశానికి అనుజీవితపదం వ్యాఖ్యాప్రాయం. స్వాభావిక ద్రుతాంతాలు నిత్యంగా ద్రుతప్రకృతికాలు, స్వాభావిక ద్రుతాంతాలు కానివన్నీ కళలు — అనే అర్థంలభిస్తుంది. అప్పుడు స్వాభావిక ద్రుతాంతత ద్రుతప్రకృతికత్వ సాధకం కాగా, స్వాభావిక ద్రుతాంతతా రాహిత్యం కళాత్వసాధకం అవుతోంది. ఇలా స్వాభావిక ద్రుతాంతత (అనుజీవిత ద్రుతత్వం) అనే కొలబద్దతో అన్వయముఖంగా ద్రుతప్రకృతికత్వమూ, వ్యతిరేకముఖంగా కళాత్వమూ నిర్వచించి ద్రుతప్రకృతిక నిర్వచనానంతరం సూత్రాంతంలో "నిత్యమ్" అనే మాటను దాని ప్రాధాన్యాన్ని సూచిస్తూ పతాకగా నిలిపాడు చింతామణి కర్త.

ద్రుతప్రకృతికాల స్వాభావిక ద్రుతాంతత కారణాంతరాలవల్ల పోయినా (ద్రుతములోపించినా) అవి ద్రుత ప్రకృతికాలే అనే అర్థ విశేషాన్ని సూచిస్తూ–నిత్యమ్—అనేమాట దాని స్థానంలో చరితార్థమై క్షీణశక్తికమవుతోంది. ఇది కళా నిర్వచనంలోకి ఇక అన్వయించదు.

సముచ్చయాద్యర్థ విశేషాలలో అస్వాభావిక ద్రుతాంతతను పొందిన—అంటే— స్వాభావిక ద్రుతాంతతా రాహిత్యాన్ని కోల్పోయిన కళలు ఏమవుతాయి? అనే సందేహం మిగులుతుంది. క్షీణ శక్తికమయిన "నిత్యమ్" అనే మాట ఇక్కడకు

అన్వయించదు కాబట్టి, ఇటువంటివాటికికూడా కళాత్వాన్ని కల్పించే అవకాశం లేదుకాబట్టి, ఇవి ద్రుతప్రకృతికాలే అవుతాయి. భాషలోని పదాలన్నీ ఈ రెండు విభాగాలలోనూ దేనిలోనో ఒకదానిలో చేరితీరాలి. అందుచేతనే కళలను చెప్పి తక్కినవన్నీ ద్రుతప్రకృతికాలనడమూ, ద్రుతప్రకృతికాలను చెప్పి తక్కినవన్నీ కళలనడమూ వ్యాకర్తలకు చెల్లింది.

ఈ సమన్వయక్రమంలో "నిత్యమ్" అనే మాటను "అనుజీవితద్రుతాః" అనే దానితో అన్వయించలేదు కాబట్టి సముచ్చయాద్యర్థ విశేషాలలో కాదాచిత్కంగా ద్రుతాంతతను పొందిన కళలుకూడా ద్రుతప్రకృతికాలే అవ్వడానికి అభ్యంతరంలేదు. అనుజీవితద్రుతాలు నిత్యంగా ద్రుతప్రకృతికాలు. వాటి చివరి ద్రుతం కనిపించినా లోపించినాకూడా అవ్వి ద్రుతప్రకృతిక సంజ్ఞకు అర్హాలే. ఇది నిత్యతలోని సార్థక్యం. అర్థ విశేషాలలో ద్రుతాంతతను పొందిన కళలు నిత్యద్రుతప్రకృతికాలుకావు. వీటి చివరి ద్రుతం కనిపించుతున్నంతవరకూ ఇవి ద్రుతప్రకృతికాలు. కనిపించనప్పుడు కళలుమాత్రమే. "అనుజీవితః ద్రుతః యేషాం న స్యాత్ తే కళాః" అని అన్వయాన్ని చెప్పినందువల్ల అనుజీవితద్రుతాలు కానివన్నీ కళలనీ, ద్రుతప్రకృతికాలకూ వీటికీ ఉన్న భేదం ఇదేననీ (సాదృశ్య నిషేధంగా నఞ్), వీటి కళాత్వానికి నిత్యత లేదుకాబట్టి అస్వాభావికంగా ద్రుతాంతతను పొందినప్పుడు కళాత్వాన్ని కోల్పోయి ద్రుతప్రకృతికాలతో సాదృశ్యాన్ని పొందుతాయనీ, తాత్పర్యార్థం లభిస్తుంది. అననుజీవితః (అస్వాభావికః) ద్రుతః యేషాం తే న కళాః స్యుః, కింతు ద్రుత ప్రకృతికా ఏవ—అనేది ఫలితార్థం.

ఈ అన్వయంతో కళలకు కళాత్వభంజకమైన ద్రుతాంతత అస్వాభావికం కాగా (అననుజీవితత్వము) తద్భిన్నమయినదంతా నిత్య ద్రుతప్రకృతికతా సాధకమయిన "అనుజీవిత ద్రుతత్వము" (స్వాభావికము) అవుతోంది. ప్రత్యయాగమావయవాత్మక మయిన ద్రుతాంతత కలవన్నీ అనుజీవితద్రుతాః, తే, నిత్యం ద్రుత ప్రకృతయః

అనేభావం లభిస్తుంది. ఈ మేరకు—ద్రుతప్రకృతికము—ద్రుతాంతము ఇత్యాదిగా చేసిన వఙ్ఞలవారి విభాగాల అవసరం ఇక ఉండదు. (బా.వ్యా. ఉద్యోతం, పుట–18).

కానీ అనుజీవిత ద్రుతాలకు (స్వాభావిక ద్రుతాంతాలకు) అన్వర్థమయిన ద్రుత ప్రకృతిక సంజ్ఞ అననుజీవిత ద్రుతాలయిన (అస్వాభావిక ద్రుతాంతాలయిన) కళలకు ఆ అవస్థలోని ద్రుతాంతతను పురస్కరించుకొని రూఢంగా వర్తిస్తోంది. నిత్యానిత్యతలు మాత్రమే వీటి మధ్యగల భేదం. బింద్వాదేశాది ద్రుతకార్యాలన్నీ నిత్య ద్రుతప్రకృతి కాలకూ అనిత్య ద్రుతప్రకృతికాలకూ (ద్రుతప్రకృతికతను పొందిన కళలకు) సమానంగా జరుగుతూనే ఉన్నాయి. కాబట్టి లాఘవైక దృష్టి కలిగిన చిన్నయసూరి "ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికములు" (బా. వా. సంజ్ఞా–12) అని అన్నింటినీ స్పష్టంగా గుచ్చెత్తడం జరిగింది అనుకోవాలి.

**అప్పకవీయాదుల సమ్మతి :**

ఈ తిఙ్మధ్యేత్యాది సూత్రానికి అప్పకవికూడా ఇదేవిధమయిన సమన్వయాన్ని భావించినట్లు కనబడుతోంది—

కం॥ వలసినచోఁ దుది ద్రుతములు
తలచూపెడు శబ్దములు ద్రుత ప్రకృతులనన్
వెలయు, నవి పొదమకుండెడు
తెలుఁగు పదంబులు కళా ప్రదేశములయ్యెన్.

(అప్పకవీయం, 5–22)

అని ద్రుతప్రకృతిక సాపేక్షంగా కళలకు కళాత్వసాధకం ద్రుతాంతతా రాహిత్యం అనేది ఇక్కడ స్పష్టంగా తెలుస్తోంది. ద్రుతప్రకృతికాల తుది ద్రుతములు వలసినచో తలచూపవచ్చును, తలచూపక పోవచ్చునుగాక అవి ద్రుతప్రకృతికాలే.

అటుపైని కళాప్రదేశాలను ఉదాహరిస్తూ మరొక మాట అన్నాడు.

సీ ఎ.గీ.... ....కీతి సముచ్చయములఁ దక్క ద్రుతము గానఁ

బడదు గావున నవి పల్కఁబడుఁ గళలని.

(అప్పకవీయం, 5—28)

సముచ్చయాద్యర్థ విశేషాలలో తప్ప వీటికి ద్రుతాంతత కనబడదంలేదుకాబట్టి ఇవి కళలు—అనడంవల్ల ఆయా అర్థ విశేషాలలో ద్రుతాంతత కనబడినట్లయితే ఇవి కళలు కానేరవు, ద్రుతప్రకృతికాలే అవుతాయి—అనేది అప్పకవి ఉద్దేశించిన అభిప్రాయంగా స్పష్టపడుతోంది. స్వాభావిక ద్రుతాంతత, అస్వాభావిక ద్రుతాంతత అనే రూపభేదంతప్ప ప్రక్రియాదిపై జాత్యం లేదుకాబట్టి రెండింటినీ ద్రుతప్రకృతికాలు గానే అప్పకవి వ్యవహరించి లాఘవాన్ని సమకూర్చుకున్నాడు. చిన్నయసూరికి మార్గ దర్శకుడయ్యాడు.

చిన్నయసూరి పద్యాంధ్రవ్యాకరణంలోకూడా ఈ సమన్వయానికి ఆమోదం కనబడుతోంది.

కం॥ వలసినచోఁ గద ద్రుతములు
దలసూపవి పదము లెల్లఁ దగుఁ గళలన, లా
తులు, దనరు ద్రుతప్రకృతిక
ములునా, మంగా మనోజ్ఞ భూష సువేషా!

(పద్యం—47)

## వ్యస్త పదాన్వయం :

"అనుజీవిత ద్రుతాః" అనే సమస్త పదంలోని పూర్వావయవానికి "ద్రుతో న యేషాం స్యాత్" అనేచోట వ్యస్తంగా ఉన్న "ద్రుతః" అనే పదంతో అన్వయాన్ని కల్పించడం సమంజసమా? అనే సందేహం కలగవచ్చు. ఇది తెలుగువారి సంస్కృతం. సమాసగత పూర్వపదాన్ని వ్యవహితోత్తర పదంబొంటితోడనూ, వాని పెక్కింటితోడనూ అన్వయింప జేయడమూ, సిద్ధసమాస మధ్యగత పదాలను

తద్భిన్న పదాలతో అన్వయింప జేయడమూ, నన్నయనాటినుంచీ కనబడుతున్నవే. (ప్రౌఢ సమాస_34, 35)

ప్రయోగావిరుద్ధంగా ఒక సూత్రాన్ని సమన్వయించడానికి సుదూరం ప్రయాణించడమూ, ఆ ప్రయత్నంలో ఇష్టరూప సిద్ధికి యోగ విభాగ తంత్రోచ్చా రణాదులనుకూడా కల్పించడమూ సంస్కృతాది వ్యాకరణాలన్నింటా కనబడుతున్న విషయమే.

"క్వచి దేకదేశోఽప్యనువర్తతే" (18. పరిభాషేందుశేఖరం — పుట, 34) అనే పరిభాషను పాణినీయులే అంగీకరించారు "తావన్మాత్రాంశే స్వరితత్వ ప్రతిజ్ఞా బలాల్లభ్యమిదమ్" అని దీనికి నాగోజి భట్టు వ్యాఖ్య. "అనుజీవిత" అనే అంశకు మాత్రమే స్వరితత్వాన్ని ప్రతిపాదించి, ఏక శ్లోకగతమయిన ఈ అపకర్ష, ఈ అన్వయమూ అపరాధంకాబోదు.

ఆంధ్ర శబ్ద చింతామణిలోకూడా స్వర పాఠాన్ని అహోబలుడు ప్రతిపాదిం చాడు. (కవిశిరోభూషణం—హైదరాబాద్—పుట_233) "వ్యాఖ్యానతో విశేష ప్రతి పత్తిః" (పరిభాష_1) అనేమాటకు చారితార్థ్యం కల్పించాడు

ద్రుతము అనేది ఉచ్చారణ స్వభావాన్ని బట్టి ఏర్పడిన సంజ్ఞ అనీ, పదావయవం కాని పొల్లు నకారానికి మాత్రమే అది అన్వర్థమనీ, ఉకారాది స్వరసహితమయిన దానినీ, పదావయవమైన దానినీకూడా కొందరు లాక్షణికులు ద్రుతమనడం ఔపచారిక మనీ, ద్రుతప్రకృతిక సంజ్ఞలోని ప్రకృతి శబ్దం స్వభావార్థకమనీ, కళాద్రుతప్రకృతిక నిర్ణయం పరస్పరాపేక్ష సహితమనీ, సముచ్చయాద్యర్థ విశేషాలలో ద్రుతాంతాలయిన కళలను ద్రుతప్రకృతికాలనడం లాక్షణికమనీ, తిఙ్మధ్యేత్యాది సూత్రాన్ని ఈ మేరకు సమన్వయింపవచ్చుననీ, దానికి అప్పకవీయాదుల సమ్మతి కనబడుతున్నదనీ— సారాంశం.

**ఆవయవిక నకారం ద్రుతమా? :**

వినా ద్వితీయం స్యాత్ అస్మదాత్మనోః స్వంతయోరపి।
నోరన్యస్యాఽపి సర్వం స్యాత్ బహుళం సత్ప్రయోగతః॥
(అథర్వణ కారికావళీ—సంధి—32)

దీనిని బట్టి పదావయవమయిన అంత్య నకారంకూడా ద్రుతమేననీ దానికి ద్రుతకార్యాలు ప్రయోగానుసారం బహుళంగా జరుగుతాయనీ—ప్రాచీన వ్యాకర్తల మతంగా తెలుస్తోంది.

కాగా-ఆవయవిక నకారం ద్రుతం కాదు అనే అభిప్రాయానికి మార్గ దర్శకుడయిన అప్పకవి (అప్పకవీయం, 5—24) పదానంత్య నకారాన్నికూడా ద్రుతమని వ్యవహరించడం మరీ విడ్డూరంగా కనబడుతుంది. ఈతడు సరసవళిలో-

కం॥ హయలత్వమునకు, శషసలు
నయవర్తన! చ-ఛ-జ-ఝ లకు, నలి మధ్యమ వ
ర్గ యుతానునాసికము ని
శ్చయముగ ద్రుతమునకుఁ జెల్లు సరస వళులనన్.
(అప్పకవీయం, 3—106)

న-ఙ లకు మైత్రిని చెప్పి "నరక దైత్య విరోధి! ఘృణా పయోధి" అనే పాదాన్ని ఉదాహరించాడు. దీనిని బట్టి పదాంతంలోనేకాదు ఆదిమధ్యాలలో ఎక్కడ ఉన్నా తవర్గ పంచమాక్షరమయితేచాలు ద్రుతమే అని ఇతడు భావించాడా? అనే సందేహం కలుగుతుంది.

ప్రాచీనమయిన రాజమార్గాన్ని విడిచిపెట్టి చిన్నయసూరి శబ్దావయవమయిన నకారాన్ని ద్రుతంగా అంగీకరించాలా? మానాలా? అనే సందేహంలో పడ్డాడు.

"కన్వాదిభ్యోఽన్త్య లోపిభ్యః పరుషాణాం గదా మతాః"
కన్నెదరె ఇతి వా కన్నెదరె ఇతి వేతి సందేహః।
(సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం—సంధి-27)
"కృతోల్లోప స్తనాదిభ్యః కపానాం తు గబా మతాః"
చన్గవ, కన్గవ, చన్గొండలు—అస్య ద్రుతత్వాభావాన్నానుస్వారః।
(సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం-తద్ధిత-104)

ఈ సందేహాన్ని బాలవ్యాకరణంలోకూడా ఇతడు తేల్చలేదు. కందోయి (సంధి-19) మ్రాన్పడె (ప్రకీర్ణ—16) అని రెండు ఉదాహరణలూ ఇచ్చి ఊరుకున్నాడు. ప్రౌఢ వ్యాకర్త అవయవిక నకారాన్ని ద్రుతంగా అంగీకరింపక ఆయా ద్రుత కార్యాలను ప్రత్యేక విధానాలతో సాధించుకొన్నాడు. చిన్నయ సూరికికూడా ఇల్లాగే అవయవికనకారాన్ని ద్రుతంగా అంగీకరించడం సమ్మతం కాదని భావించిన వ్యాఖ్యాతలు "కందోయి" రూపాన్ని సాధించడానికి తొక్కని పుంత అంటూ లేకపోయింది.

"*కందోయి*" :

అవయవిక నకారంకూడా ద్రుతమేననీ అయితే దానికి ద్రుతకార్యాలు జరగడం మాత్రం బహుళమనీ భావించిన ప్రాచీనుల మార్గంలో కందోయి–చక్కంగా ఇత్యాదుల్లో ద్రుతకార్యాలు జరగడమూ, మ్రాన్పడె–తొవవింటివాఁడు చన్ ద్రోవఁబోక ఇత్యాదుల్లో ద్రుతకార్యాలు జరక్కపోవడమూ బహుళపదవిరూఢాలు అవుతున్నాయి.కాగా-కందోయి, మ్రాన్పడె అని ఉదాహరించి మిన్నకుండడాన్నిబట్టి ఈ ప్రాచీనుల మార్గం సూరికి కూడా సమ్మతమేనని భావించే పక్షంలో "ఓమితి బ్రూమః" అంటూ కొందరు వ్యాఖ్యాతలు "రమణీయంగా" తెరిపినబడ్డారు. మరికొందరు కందోయిని సాధించడానికి బాలవ్యాకరణం సరిపోదన్నట్టు ప్రౌఢవ్యాకరణ సూత్రాలనుకూడా గుచ్చెత్తారు.

కన్నుయొక్కదోయి అని జాత్యేకవచనంగా విగ్రహం చెప్పుకొని సమాసం చేస్తే విభక్తిలోపించి కన్ను+దోయి అని మిగులుతుంది. కన్నుశబ్దం ఉదంత స్త్రీసమం. సమాసాల్లో ఉదంత స్త్రీసమాలకు సరళాక్షర పరత్వంలోకూడా నుగాగమం వస్తుంది. (బా.వ్యా. సంధి_25) కన్ను+న్+దోయి=కన్నుందోయి కన్నుదోయి అనే రూపాలు సిద్ధిస్తాయి. ఇక్కడితో ఆగకుండా అటుపైని కన్ను శబ్దాన్ని ప్రాతాద్యాకృతి గణంలో చేర్చుకొని తొలియచ్చు మీది వర్ణాలను లోపింపజేస్తే క+న్+దోయి= కందోయి అనేరూపం సిద్ధిస్తుంది. నుడి తొలిహ్రస్వంబు మీదిది కాబట్టి ఈద్రుతానికి లోపం లేదు. వేరొక సూత్రంచేత నుగాగమాన్ని ముందుగా చేసుకొని అటుపైని ప్రాతాది కార్యాన్ని చెయ్యడం ఈ మార్గంలోని విశేషం. నుగాగమ ప్రాప్తికి నిమిత్తమయిన ఉదంతత ప్రాతాదికార్యంవల్ల పోయినా నుగాగమం మిగిలి ఉండడం మరొక విశేషం. ఇటువంటిది నల్గడాదుల్లోనూ కనబడుతోంది.

కను–హల్లు పరమగుచో ఉకారంబునకు పైకల్పికంబుగా లోపంబగు___
ఉదా : కన్గలిగి మొ॥_అని ప్రౌఢ వ్యాకర్త తన శబ్దరత్నాకరంలో పేర్కొన్నాడు. ఈ చూపిన రూపంలోని ద్రుతకార్యం ప్రాచీనమార్గానికి సామీచీన్య నిరూపకం.

# సంధి

సంస్కృత ప్రాకృతాంధ్రాలలోని సంధి స్వరూపానికి మౌలికమయిన భేదం చాలా ఉంది. కానీ ప్రాకృతాంధ్ర వ్యాకర్తలకు సంస్కృత వ్యాకరణాలూ అందునా పాణినీయమూ ఆదర్శాలుకాబట్టి వీరి గ్రంథాలలో సంధి నిర్వచన విధానాలపట్ల కొంత అనురూప్యం స్పష్టంగా కనబడుతోంది.

స్వర సంధి_వ్యంజన సంధి అని రెండు విస్తృతమయిన విభాగాలను చేసుకున్నప్పుడు వ్యంజన సంధి స్వరూప స్వభావాలలో ఆంధ్ర భాషకు సంస్కృత ప్రాకృతాలతో ఏవిధమయిన సంబంధమూ ఉన్నట్టు గోచరింపదు. కాగా స్వర సంధిలోనే సహజమో అసహజమో కొంత అనురూప్యం కనబడుతోంది.

## ప్రాకృతీయం :

ప్రాకృత వ్యాకరణాలలో ప్రత్యేకంగా సంధి పరిచ్ఛేదము అనేది చాలా అరుదుగా కనబడుతుంది. ఇవన్నీ ప్రాకృతంలోని తద్భవ రూపాలను సాధించడమే లక్ష్యంగా కలవి కాబట్టి అజ్వికారాలనూ, హల్వికారాలనూ, ప్రత్యయ వికారాలనూ విస్తృతంగా చెప్పి వివిధ ప్రాకృత భాషలను ఆవిష్కరించడంతో ముగుస్తున్నాయి. ప్రాకృత ప్రకాశంలో "సంధా వచామజ్లోప విశేషా బహులమ్" (4_1) అనేది స్వర సంధి సర్వస్వ విధాయకంగా కనబడుతోంది.

కాత్యాయనుడు "అజ్లోప విశేషాః" అనే పాఠాన్ని స్వీకరించి

> సంధావచాం స్యురజ్లోప విశేషా బహులం పదే।
> అజ్లోప ఇత్యకాం లోపో విశేషాశ్చాన్యథాగమాః॥
> ప్రవృత్తిశ్చాప్రవృత్తిశ్చ విభాషా చాన్యదేవ వా।
> క్వాపి క్వాపి చతుర్థా స్యాద్బహులార్థస్య విభ్రమాత్॥
>
> (ప్రాకృత మంజరీ, 4–1)

అగ్లోపములు_విశేషములు–అని రెండు విభాగాలు చేసి విశేషాలు అంటే అన్యథాగ మాలు అని విస్తరింపజేశాడు.

సంస్కృత వ్యాకరణప్రోక్తాలయిన స్వర సంధులన్నీ వీరికి బహులం. "సంధౌ వర్తమానానాం అచాం స్థానే అజ్విశేషాః లోప విశేషాశ్చ బహులం భవంతి"। అని దీనికి భామహుని వ్యాఖ్య. సంస్కృత వ్యాకరణప్రోక్తాలు కాని దీర్ఘ హ్రస్వాదేశాదులనుకూడా ఈ సూత్రంతోనే ఇతడు సాధించాడు. (బహుముహం_బహూముహం_వధూముఖం. మొ॥ వి)

హేమచంద్రుడు ప్రాకృత వ్యాకరణంలో_

ఏదోతోః స్వరే ।_(8_1_7)

(ఏకార ఓకారయోః స్వరే పరే సంధిః న భవతి.)

పదయోః సంధిర్వా । (8_1_5)

(సంస్కృతోక్తస్సంధిస్సర్వః ప్రాకృతే పదయోః వ్యవస్థిత విభాషయా భవతి.)

స్వరస్యోద్వృత్తే।_(8_1-8)

(స్వరస్యోద్వృత్తే స్వరే పరే సంధిర్న భవతి.)

లుక్ ।-(8-1_10)

(స్వరస్య స్వరే పరే బహులం లుక్ భవతి. త్రిదశేశః_తిఅసీసో, నిశ్వాసూచ్ఛ్వాసౌ ।)

అని స్వర సంధి సూత్రాలను చెప్పాడు. ఈతని ప్రాకృత వ్యాకరణమంతా ప్రారంభంనుండీ బహులాధికారస్థమయినది కావడం విశేషం.

రామశర్మ తన ప్రాకృత కల్పతరువులో పంచమ స్తబకానికి "సంధివిధానమ్" (పుట_20) అని పేరుపెట్టాడు. కానీ ఇందులో ఒకటి—మూడూ శ్లోకాలు తప్ప

తక్కినవన్నీ ఆయా తద్భవాలలోని అజ్వికారాలను నిర్దేశించేవిగానే ఉన్నాయి. స్వర సంధి విశేషాలను చెప్పిన ఆ రెండు శ్లోకాలూ ఇవి-

అజ్లుక్ విశేషా బహులం భవన్తి।
సంధావచాం రూపమిహాభిధాస్యే॥ (5-1)
పరేణ పూర్వేణ చ సార్ధమాహుః।
ఇకో గుణం (గుణః) క్వాపి పదేషు ధీరాః॥ (5_3)

వీటిలోకూడా ఇతడు ప్రాకృత భాషకు ప్రత్యేకంగా విధించిన స్వరసంధులేవీ లేవు.

వాల్మీకి/త్రివిక్రమ వ్యాకరణంలో పరభాషావిభాగం అయిపోగానే "బహులమ్" అనే సూత్రం కనబడుతోంది. "అధికారోఽయమ్. ఆశాస్త్ర పరిసమాప్తేః యత్ ప్రాకృత లక్షణం ఉచ్యతే తత్ బహుళం భవతీతి వేదితవ్యమ్।" అనేది దీనికి త్రివిక్రమ వృత్తి. "అత్ర సర్వమపి కార్యజాతం బహుళం స్యాత్" అనేది ఈ సూత్రానికే ఎలకూచి బాలసరస్వతి వ్యాఖ్యానం. (షడ్భాషావివరణం—పుట—5) అటుపైవి "సంధిస్త్వపదే" అనే రెండవ సూత్రానికి వ్యాఖ్యానం రచిస్తూ త్రివిక్రముడు— —అంత్య హలోఽశ్రదుతీత్యాదినా లోపాది విధానేన, పదాంత వర్తినాం వ్యంజనానాం అభావాత్, అతో దో విసర్గ ఇత్యాదినా దో విధానేన సోర్లుగిత్యాదినా లుగాదివిధానేన చ విసర్జనీయ స్వాదీనామభావాచ్చ వ్యంజన విసర్జనీయ స్వాది సంధీనాం అత్రాప్రచురః ప్రయోగః।" అని ప్రాకృత భాషా స్వభావాన్ని ఆవిష్కరించాడు. తక్కిన స్వర సంధులనన్నింటినీ ఈ బహుళాధికారం క్రిందనే "లోపః" (7) అనే [illegible] "అచోఽచిపరే బహులం లోపో భవతి। తిఅసీసో। ణీసాసూసాసా [illegible]దిగా హేమచంద్రునిలాగానే సంగ్రహించాడు.

పురుషోత్తముడు ప్రాకృతానుశాసనంలో "లోపాగమ వికారాశ్చ వర్ణానాం బహులమ్" (13_10_11) అనే ఒక్క సూత్రంతో తద్భవాది వికారాలనన్నింటినీ సంక్షేపించాడు.

చండుని ప్రాకృతలక్షణంలో "సంస్కృతవత్ సంధికార్యం పదయోః" (2–1) "స్వరాణాం స్వరే ప్రకృతి లోప సంధయః" (2–2) స్వరస్యోద్వృత్తే (2–3) సంయోగే పరే లోపః (2–5) అనే సూత్రాలు సంధికి సంబంధించి కనబడు తున్నాయి.

ఇందులో రెండవ సూత్రానికి అతని వృత్తి గమనింపదగినది. 'స్వరాణాం స్వరే పరే ప్రృకృతిః లోపః సంధయశ్చ భవన్తి". (2–2) ప్రాకృతంలో స్వరానికి స్వరం పరంగా ఉన్నప్పుడు మూడు వికారాలీతడు నిరూపించాడు. మొదటిదిప్రకృతి. దీనికి "ఇహ అచ్చృతి" అనేది ఇతడిచ్చిన లక్ష్యం. రెండవది లోపం. దీనికి "ఇహచ్చృతి" అనేది ఈతడిచ్చిన లక్ష్యం. మూడవది సంధి. దీనికి "మహేసో" అనేది ఈయన ఇచ్చిన లక్ష్యం.

పూర్వస్వరానికి లోపంవచ్చి పరస్వరం నిలిచిన రూపాలకు 'సంధి' సంజ్ఞను ప్రాకృత వ్యాకర్తలు ఉపయోగించలేదు. అంతా "లోపః" అనే మాటను మాత్రమే ఉపయోగించారు.

"లోపః" (వాల్మీకి / త్రివిక్రమ, 1—1—24) అనే సూత్రానికి షడ్భాషా చంద్రికాకర్త "అచః అచి పరే బహుళం లోపః స్యాత్" అని మాత్రం వృత్తి రచించాడు. "సంధి" అనలేదు.

శేష కృష్ణుడు కూడా తన ప్రాకృత చంద్రికలో—"సంధిర్వా పదయోః క్వచిత్।" (1—18, పుట — 4) సంస్కృతోక్తః సంధిః పదయోః ద్వయోః ప్రాయేణ భవతి వా। మహీ ఈసరో — మహీసరో (మహీశ్వరః), వాస ఇసీ— వాసేసీ (వ్యాసర్షిః)

"నాసవర్ణే।" (1–10, పుట–5) అసవర్ణే అచి పరే ఇకారోకారయోః సంధిర్న స్యాత్। వందామి అజ్జ (వందే ఆర్య) దణు ఇందో (దనుజేంద్రః)

"క్వచిచ్చ లుక్।" (1–18, పుట–5) అచామచి క్వచిచ్చ లుగపి స్యాత్। త్రిదశేశః– తిఅసీసో। నిశ్వాసోచ్ఛ్వాసౌ–ణీసాసూసాసా।

—ఇలా ఇతడు సంధిః—లోపః అనే వాటికి కచ్చితమయిన భేదాన్ని పాటించాడు.

"అచః" అనే వాల్మీకి / త్రివిక్రమ సూత్రానికి బాల సరస్వతి "అచి పరే అచో లోపః స్యాత్" (షడ్భాషా వివరణం, పుట-9) అని వివరణం రచించాడేకానీ అతడుకూడా "సంధి" పదాన్ని ఉపయోగింపలేదు.

తద్భవ రూపసాధన ప్రవణాలయిన ప్రాకృత వ్యాకరణాలు సంస్కృత వ్యాకరణ ప్రోక్తాలయిన స్వర వ్యంజన సంధి కార్యాలను తద్భవ రూపాలలోని అజ్వికార హల్వికారాలుగా నిరూపించడంచేత సంధి విభాగం వాటికి అవశ్యకం కాలేదనీ, తద్భవరూపాలలోకూడా కాదాచిత్కంగా కనబడుతున్న స్వర సంధులను యథాసంస్కృత వ్యాకరణం గ్రహించాయనీ, పూర్వ స్వరం లోపించి పరస్వరం మిగులుతున్న రూపాల విషయంలో ఇవి సంధి పదాన్ని ఉపయోగింపక లోపసంజ్ఞనే ఉపయోగించినట్టు కనబడుతున్నదనీ ఇక్కడికి సారాంశం.

*పాణినీయం :*

స్వరానికి స్వరం పరంగా ఉండి పరినిష్ఠిత రూపంలోకూడా ఏదో ఒక స్వరమే నిలిచినట్టయితే వాటిని మాత్రమే స్వర సంధులుగా వ్యవహరించడం న్యాయ్యం. యణాదేశాదులను కేవల స్వర సంధులుగా పరిగణించడానికి వీలులేదు. వాటిలో స్వరానికి స్వరం పరంగా ఉండడం సంభవించినా పరినిష్ఠిత రూపంలో వ్యంజనాదేశ వికారం కనబడుతోంది. "అతి+అంతమ్" ఇక్కడ పూర్వ స్వరానికి 'య్' ఆదేశ మవుతోంది. ఇల్లాగే తక్కినవీను. కాబట్టి "ఇకోయణచి" (6-1-77) "ఏచోఽయ వాయావః" (6-1-78) ఇత్యాదులను కేవల స్వర సంధులుగా పరిగణించక పోవడమే సమంజసం. కానీ వీటిలో స్వరానికి స్వరం పరంగా ఉండడం జరుగు తున్నదికాబట్టీ, హల్సంధులనడానికి అవకాశంలేదు కాబట్టీ భట్టోజీ దీక్షితులవారు వీటిని అచ్సంధి ప్రకరణంలోకే చేర్చారు. కానీ ఇవి గుణవృద్ధిసంధులవంటివి కావు. పరినిష్ఠిత రూపాలలో కనిపించే ఈ భేదాన్ని బట్టి యణాదేశాదులకు నివారకంగా

స్వరసంధి శబ్దానికి పై నిర్వచనం ప్రస్తుతమవసరమయ్యింది. ఈ మేరకు స్వర సంధులు అంటే గుణాదులేకానీ యణాదేశాదులు కావు.

కాగా పాణినీయంలోని ఈ స్వర సంధులన్నీ ఏకః పూర్వ పరయోః (1-1-84) అనే అధికారంలోనివే. అంటే పూర్వరూప సంధులు పరరూప సంధులు అనే విభాగం పాణినీయంలో లేదనీ, ఉన్న స్వరసంధులు అన్నీ ఏకాదేశ సంధులే అనీ, మనం భావించవచ్చు. అందుచేతనే ఆద్గుణః (6-1-87) వృద్ధిరేచి (6-1-80) అకః సవర్ణే దీర్ఘః (6-1-101) ఇత్యాదుల వృత్తులలోలాగానే, ఏజి పరరూపమ్ (6-1-94) ఆతో గుణే (6-1-97) ఇత్యాది పరరూప విధాయక సూత్రాల వృత్తులలో 'పరరూపమేకాదేశః స్యాత్' అనీ, అమి పూర్వః (6-1-107) ఏఙః పదాంతాదతి (6-1-109) ఇత్యాది పూర్వరూప విధాయక సూత్రాల వృత్తులలో "పూర్వ రూపమేకాదేశః స్యాత్" అనీ ఏకాదేశ పదాన్ని విడవకుండా నిక్షేపించారు భట్టోజీ దీక్షితులవారు.

"శకంధుః" ఇత్యాది పరిణిష్ఠిత రూపాలలో పరస్వరం నిలిచిందికాబట్టి వీటిని పరరూపసంధులనీ, "శివోఽర్చ్యః" ఇత్యాది పరిణిష్ఠితరూపాలలో పూర్వస్వరం నిలిచింది కాబట్టి వీటిని పూర్వరూపసంధులనీ పరిశోధకులు విభజించి వ్యవహరించడం జరుగుతోంది. ఇవన్నీ గుణవృద్ధి సవర్ణదీర్ఘ సంధులులాగానే ఏకాదేశ సంధులు మాత్రమే. కాగా గుణాదులనుండికూడా వీటిని వేర్పరచి చెప్పవలసివస్తే పూర్వరూపైకాదేశ సంధులు అనాలేకాని కేవలం పూర్వరూప సంధులు-పరరూపసంధులు అనడానికి అవకాశాలు తక్కువ. కానీ పాణినీయంలోని కేవల స్వర సంధులన్నీ ఏకాదేశ సంధులే కాబట్టి పూర్వరూప సంధి అన్నా, పరరూప సంధి అన్నా, పూర్వరూపైకాదేశ సంధి, పరరూపైకాదేశ సంధి అనే భావమే లభిస్తుందిగదా। అని ఒక సమన్వయాన్ని ఇక్కడ చెప్పుకోవచ్చు.

కాగా రావూరి దొరసామిశర్మగారు అప్పకవీయ భావప్రకాశికలో లుప్త విసర్గక స్వర వళి సందర్భాన "ఏఙః పదాంతాదతి—అను సూత్రముచే ఏ-ఓ లమీది అత్వము లోపించి దాసోఽహమ్ అను రూపము సిద్ధించును"—అని వివరించడం సమంజసంగా

లేదు. (చూడుడు_ భావప్రకాశిక—లుప్తవిసర్గక స్వరవళి — భారతి—1969_మే- పుట—67, 68)

పాణినీయ సంప్రదాయాన్నిబట్టి ఇలా కేవల స్వర సంధులన్నీ ఏకాదేశ సంధులే అవుతున్నాయి కాబట్టి ప్రాకృత వ్యాకర్తలు ఈ సామంజస్యాన్ని పాటించి, పూర్వస్వరం లోపించి పరస్వరం నిలిచినచోటగానీ, పరస్వరం లోపించి పూర్వస్వరం నిలిచినచోటగానీ వారు "సంధి"—"స్వరసంధి" పదాలను ఉపయోగింపక కేవలం లోపశబ్దంతోనే ఆయా కార్యాలను చక్కబెట్టుకున్నారు.

*ఆంధ్రం* :

ఈ సంప్రదాయాన్ని గుర్తించిన చిన్నయసూరి "పూర్వ పరస్వరంబులకుఁ బరస్వరంబేకాదేశంబగుట సంధి యనంబడు" (బా వ్యా. సంధి_1) అని స్వర సంధిని ఏకాదేశ సంధిగా నిర్వచించి అపరిచ్ఛేదమూ ఈ నియమాన్ని పాటించాడు.

ఏకాదేశ విధానం చెయ్యకుండా పరపదాది స్వరానికి మాత్రమే లోపం విధించిన తావులో—"అది యని శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగానగు" (బా.వ్యా. సంధి—45) సంధిపదాన్ని ఉపయోగింపలేదు. "వాక్యావసానంబున సంధి లేమి దోషంబుగాదని యార్యులంద్రు" (బా వ్యా. సంధి—55) అనే చోటకూడా 'సంధి' అంటే అసంభవత్వాది హేతువులతో ఏకాదేశ సంధిమాత్రమే స్వీకరింప బడుతుంది. స్వర పరత్వంలో సంధ్యభావాన్నే సూరి ఉదాహరించాడు.

కేతన తన ఆంధ్రభాషాభూషణంలో ఈ సందార్భాన

అది యిఋంతము మీఁదను
గదిసిన నావ్యచ్చుడుగు వికల్పముతోఁ గా
లిది కాలియది యనఁగఁజే
తిది చేతియది యని పలుకఁదెల్లంబగుచున్

(ఆం. భా. భూ. 51)

అని "ఆద్యచ్చుడుగు" అన్నాడే తప్ప సంధిపదాన్ని ఉపయోగింపలేదు.

ఆంధ్ర శబ్ద చింతామణికూడా ఈ సందర్భంలో "శబ్దాత్తచ్ఛబ్దాతః" (సంధి_13) అనే సూత్రంలోకి లోపశబ్దాను వృత్తినే అభిలషించింది. అన్నన్న-ఔరౌర ఇత్యాదులలో ఆంధ్ర శబ్ద చింతామణి పూర్వస్వర లోపం విధించగా (ఆద్యస్యామ్రేడితే అంత్య లోపశ్చ—సంధి—17), చిన్నయసూరి వీటిని కూడా ఏకాదేశ సంధులుగానే సమన్వయించాడు. అయితే ఆద్యస్యేత్యాది సూత్రాన్ని "నానాఁడు" మొదలయినచోట్ల అంతిమాక్షరలోప విధాయకంగా సమన్వయించే సంప్ర దాయంకూడా కనబడుతోంది. (వ్యా. సం. స. పుట_250)

"అపి శబ్దార్థస్యేతః" (సంధి_54) అనే సూత్రాన్ని ఇత్వసంధి విధాయకంగా కాక విశేషరూప సాధకంగా సమన్వయింపదలచిన అహోబలుడు "చౌరేరుపదాత్మనశ్చ లుగ్వా స్యాత్" (సంధి—55) అనే అనంతర సూత్రంనుండి "లుక్" పదానికి అపకర్షను కల్పించాడు. అప్పుడిది స్వరసంధివిధాయకం కానేరదు ఈ యీ సమన్వ యాలను అంగీకరించిన పక్షంలో ఆంధ్ర శబ్ద చింతామణిలోని స్వర సంధి విధానాలన్నీ ఏకాదేశాలే అవుతాయి

కేతనాదుల నిర్వచనాలను పరామర్శించిన పిదప ఈ ఆంధ్ర శబ్ద చింతామణి లోని సంధిని గురించి ప్రస్తావిస్తూ, అప్పకవీయంలోని సంధి నిర్వచనాన్ని (5-52) సమన్వయ పరచి, డా॥ అమరేశం రాజేశ్వర శర్మగారు పండిత పరిశోధక ఆమోద యోగ్యమయిన అభిప్రాయం వెల్లడించారు. (ఆంధ్ర వ్యాకరణ వికాసము, ప్రథమ, పుట—372)

**వికృతి వివేకోక్తులు :**

క్వచిత్క్వచిత్సంస్కృతిర్యోఽపి ప్రాణోఽవ్యత్ర చ్యుతో భవేత్, (సంధి_3)

ప్రథమే చో త్తమే చైవ క్రియేతో వా భవేత్ చ్యుతిః। (సంధి_6)

అచోఽచి కుత్రచిల్లోపో బహుళం స్యాత్ ప్రయోగతః। (సంధి_13)

ఇత్యాదికారికలతో పరస్వరైకాదేశ సంధులను పూర్వస్వర లోపాలుగా విక్పతి వివేకం విధించింది.

వీటిలో చివరి కారిక హేమచంద్ర త్రివిక్రమ లక్ష్మీధర సింహరాజుల వృత్తులను స్ఫురింపజేస్తోంది.

1. లుక్। (8_1 10)
   స్వరస్య స్వరే పరే బహుళం లుక్ భవతి। (హైమం. పుట_3)

2. లోపః। (1_1 24)
   అచః అచి పరే బహుళం లోపో భవతి। (త్రివిక్రమ వృత్తి_పుట_5)

3. లోపః। (1_1_24)
   అచోఽచి పరే బహుళం లోపః స్యాత్। (షడ్భాషా చంద్రిక)

4. లోపః। (3_2)
   అచోఽచి పరే బహులం లోపో భవతి। (ప్రాకృతరూపావతార-పుట-5)

"గంగనుకాసె" ఇత్యాది స్థలాలలో పరరూపైకాదేశ సంధివి విధించినప్పటికీ పూర్వపదాంత్య స్వరం లోపించడమూ, పరపదాది స్వరం మిగలడమూ ఫలితంగా కనబడుతోంది కాబట్టి లాఘవైక దృష్టితో విక్పతి వివేక కర్త ఇలా పూర్వస్వరలోపం విధించడం జరిగిందనుకోవాలి. కానీ ఈ విధానం పాణినీయానికి గానీ ప్రాకృత వ్యాకరణాలకుగానీ అనుకూలమయినదిగా కనబడదు.

### కాతంత్ర విధానం :

కాతంత్రంలో స్వరసంధిని ఏకాదేశంగా చెప్పినజాడ కనబడదు. అతడు సవర్ణదీర్ఘ సంధినికూడా పరాజ్లోపంగానే భావించాడు.

సమానః సవర్ణే దీర్ఘీ భవతి పరశ్చలోపమ్। (సూ_24)

పాణినీయంలోని పరరూపైకాదేశాలను పూర్వస్వరలోప విధానంతో సరిపెట్టాడు.

"హల లాంగలయోరీషాయామన్య లోపః।" (సూ. 28)

హల లాంగలయోః అన్య లోపో భవతి ఈషాయాం పరతః।

హాలీషా। లాంగలీషా। (భావసేన వృత్తి)

యణాదేశ గుణ సంధులను విడగొట్టి ఒక్కొక్క అచ్చుకే చెప్పడంకూడా కాతంత్రంలో కానవస్తున్న మరొక విశేషం.

వికృతివివేకకర్త చేసిన పై విధానాలకు — కుత్రచిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽపత్ర—ఇత్యాదులకు_బహుశ ఈ కాతంత్ర సంప్రదాయమే మార్గదర్శకమై ఉండవచ్చు.

అదన్తంత వర్ణయోరైక్యం సంధిరిత్యుచ్యతే బుధైః।
పూర్వస్య పరరూపత్వమత్రైవ నియతం భవేత్॥

(అధర్వణ కారికావళి సంధి—1)

వికృతి వివేకకారుని ఈ సంధి నిర్వచనంకూడా లాఘవ దృష్టితో చేసినదిగానే కనబడుతున్నా పాణినీయాదులకు అవిరుద్ధమయిన సమన్వయంకూడా కుదురుతోంది.

పూర్వార్థంలోని వర్ణశబ్దాన్ని స్వరమాత్ర వాచకంగా భావిస్తే—"షష్ఠీ స్థానే యోగా" (1–1–50) అనే పాణినీయ పరిభాష మేరకు—ఆద్యంతస్వరయోః స్థానే, ఐక్యం= (స్వర) ఏకాదేశత్వం, సంధిః ఇతి=స్వర సంధిరితి, బుధైః=పాణినీయైః, ఉచ్యతే—అనే సమన్వయం కుదురుతుంది.

ఉత్తరార్థంలోమాత్రం ఇటువంటి అవిరుద్ధ సమన్వయానికి అవకాశం కనబడడంలేదు. పూర్వస్య=పూర్వస్వరస్య స్థానే, పరరూపత్వమ్=పరస్వరాదేశత్వమ్ అత్రైవ—ఆంధ్ర భాషాయామేవ, సంధిరితి నియతం భవేత్—అనే అర్థం యథాతథంగా లభిస్తోంది.

అంటే పూర్వ స్వర స్థానంలో పరస్వరం నిలవడమనే విధానం సంస్కృత ప్రాకృతవ్యాకరణసంప్రదాయాల మేరకు సంధికాకపోయినా తాను దానిని సంధిగా భావించినట్లు అవగతమవుతోంది. "అత్రైవ" అనేచోట "ఆంధ్ర భాషాయామేవ" అని కాకుండా "అస్మిన్ వికృతి వివేకే ఏవ" అని సంకోచపరచుకుంటే ఈ నిర్వచనం ఆంధ్ర శబ్ద చింతామణ్యాదులకు వర్తించవలసిన అవసరం ఉండదు. అప్పుడు "చ్యుతిః—చ్యుతః—లోపః" అనే వికృతి వివేక విధానాలు దాని నిర్వచనంతో పూర్తిగా అనుకూలిస్తాయి. ఆంధ్ర శబ్ద చింతామణికి పూరకమేకానీ వికృతివివేకమొక ప్రత్యేక గ్రంథం కాదనుకొన్నా ఈ సమన్వయంవల్ల కొత్తగా వచ్చే ప్రమాదమేమీ ఉండబోదు. ఏ సమన్వయం చేసినప్పటికీ వికృతివివేకం ఈ సందర్భంలో కాతంత్ర సంప్రదాయాన్ని అనుసరించింది అనడమే లెస్స. అనంతరాంధ్ర వ్యాకరణాలు మరికొన్ని ఈ సులభ మార్గాన పయనించాయి. (పట్టాభి రామ పండితీయం—సంధి–30, పుట—25)

### "డుజాదులు" విశేష సంధులా? :

బాలవ్యాకరణంలో చిన్నయసూరి "బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు" (ఆచ్ఛిక—3) అనే సూత్రానికి వివరణం వ్రాస్తూ 'మహత్త్వంబున వీనికి ఉత్వ డుజాదులు, ఆమహత్త్వంబున ము వర్ణకాదులు, స్త్రీత్వంబునందు ఆలు శబ్దముతోడ సమాసంబునుంగల్గునని యెఱుంగునది'' అనేచోట "డుజాదులు'' అని ప్రయోగించాడు. ఇక్కడ "డుజ్+ఆది'' అని ఉన్నప్పుడు "జమో హ్రస్వాదచి జముణ్నిత్యమ్"

(8-3-32) అనే పాణినీయాన్నిబట్టి ఙముడాగమం వచ్చి "ఢుఙ్ఙాదులు" అనే ద్విత్వరూపం ఉండాలనీ అలా ప్రయోగించలేదు కాబట్టి ఇది సూరి చేసిన విశేష సంధి అని కొందరు పరిశోధకులు భావించారు.

పాణిని ఙముడాగమాన్ని నిత్యంగానే విధించినప్పటికీ తానే పలుచోట్ల తద్విరుద్ధ రూపాలను ప్రయోగించాడు. "సనాద్యంతా ధాతవః" (3-1-32) "తనాది కృఞ్భ్య ఉః" (3-1-79)—మొదలయిన సూత్రాలలో సన్+ఆది, తన్+ఆది-అనే చోట్ల ఆ ఙముడాగమం కనిపించడంలేదు. మహేశ్వర సూత్రాలు అయిన వెంటనే "ఇతి మాహేశ్వరాణి సూత్రాణ్యణాది సంజ్ఞార్థాని" అనే వాక్యంలో "అణ్+ఆది" అనేచోట ఙముడాగమం కనిపించడంలేదు.

పరమ దండిన్+ఔ=పరమ దండినౌ అనేచోట ఙముడాగమాన్ని ఆశంకించి "పరమ దండినౌ ఇత్యత్ర ఙ ముద్వారణాయ "ఉఞి చ పదే" ఇత్యతః పదే ఇత్యను వర్త్య అజాదేః పదస్య ఙ ముడితి వ్యాఖ్యేయమితి శబ్దేందుశేఖరే ప్రపంచితమ్." అనేమాటలు బాలమనోరమలో కనబడుతున్నాయి. (ప్రథమ, పుట-92)

"హ్రస్వాత్పరో యో ఙమ్, తదంతం చ యత్పదం తస్మాత్పరస్య అచో నిత్యం ఙముడాగమః స్యాత్" అనేది భట్టోజి దీక్షితులవారి వృత్తి.

వీటినిబట్టి "ఢుఙాదులు" అనేచోట ఙముడాగమం రావలసిన అవసరం కనబడడంలేదు. ఙముడాగమంచేసి ఉంచే విశేష సంధి అయ్యేదేమో।

"వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడ కువర్ణకంబులు ప్రాయికంబుగానగు" (బా. వ్యా. కారక-6) అనే సూత్రంలో వచి+అర్థ= "వచ్యర్థ" అనే రూపం విశేష సంధిగా కొందరు భావించారు.

సంస్కృత ధాతువులను ఇగంతాలుగానూ శ్తిబంతాలుగానూ గూడా నిర్దేశింపవచ్చు. "ఇక్ శ్తిపౌ ధాతు నిర్దేశే" అనే సంప్రదాయం సంస్కృత వ్యాకరణాల్లో సుప్రసిద్ధమైఉంది. బాలమనోరమలో "ఏత్యేధత్యూఠ్సు" (6-1-89) అనే సూత్ర వ్యాఖ్యలో ఈ సూక్తి కనబడుతోంది. "ఏతీతి ఏధతీతి చ-ఇక్ శ్తిపౌ ధాతు నిర్దేశే—ఇతి శ్తిపా నిర్దేశః" (బాలమనోరమ, ప్రథమ, పుట-57) ఈ మాట మహాభాష్యంలోనిదే (3-3-108).

కాశకృత్స్నంలో "ఇక్ తిపౌ ధాతు స్వరూపే" (సూ—50) అనే సూత్రం కనబడుతోంది. వీటినిబట్టి వచి—ఏతి ఇత్యాదికాలయిన ఇగంత శ్తిబంత నిర్దేశాలు సంస్కృత వ్యాకరణాలకు లొంగేవేకానీ లొంగనివి కావని స్పష్టం అవుతోంది.

"వచి స్వపి యజాదీనాం కితి" (6—1—15) అనే పాణినీయంలో "వచ్" ధాతువే, ఇగంతంగానే, నిర్దేశింపబడింది. "భవతే రః" (7—4—73) అనే సూత్రంలో భూధాతువు శ్తిబంతంగా నిర్దేశింపబడింది. ఇంకా ఇటువంటి నిర్దేశాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. 'స్తంబ కర్ణయో రమి జపోః' (3-2-13)। "అధికరణే శేతేః" (3—2—15) ఇత్యాదులు. ఇగంత శ్తిబంత నిర్దేశాలు రెండూ సుబంతాలే.

ప్రాకృత వ్యాకరణాలలోకూడా ఇటువంటి నిర్దేశాలు ప్రచురంగా కనబడుతున్నాయి.

"అంత్యస్య వచి—ముచి—రుచి—శ్రు—భుజాం డోల్"
(వాల్మీకి/త్రివిక్రమ, 2_4_44)

ఈ సూత్రంలో 'వచ్' ధాతువే, ఇగంతంగానే, నిర్దేశింపబడడం గమనింపదగినది.

"చేత వర్ణకంబు హేతు కరణంబులకు గ్రహ్యాది యోగణంబగు పంచమికిని బహుళంబుగా నగు" (బా.వ్యా. కారక—4) అనే సూత్రంలో "గ్రహ" ధాతువు కూడా ఇగంతంగా నిర్దేశింప బడింది. "భవత్యర్థ—" (బా. వ్యా. కారక —28) అనేచోట "భూ" ధాతువు శ్తిబంతంగా నిర్దిష్టమయ్యింది.

ఆంధ్ర శబ్ద చింతామణిలో "రంజతి ఘట్యాదీనాం బిందోశ్చస్యాపి లావుభౌ భవతః', (క్రియా_33) అనే సూత్రంలో "రంజతి" అనేది శ్తిబంతంగానూ, "ఘటి" అన్నది ఇగంతంగానూ నిర్దేశింపబడ్డాయి.

అందుచేత ఇటువంటి నిర్దేశాలను "సంస్కృతాంధ్ర సంధులకు లొంగని విశేష సంధులుగా" భావింపవలసిన అవసరం లేదు. (ఆంధ్ర పాణినీయము_విశేష సంధులు భారతి, మే_1973).

13)

సంస్కృతీకరణం :

ఈ సందర్భంలోనే మరో విశేషాన్నికూడా ప్రస్తావించాలి. ఆచ్ఛికాలను సంస్కృతంలోకి తీసుకువెళ్ళవలసివచ్చినప్పుడు రెండు రకాల సంప్రదాయాలు వాఙ్మయంలో కనిపిస్తున్నాయి. యథాతథంగా స్వీకరించి వాటికే సంస్కృతవిభక్తులను చేర్చేపే పద్ధతి ఒకటి. కొండవీడౌ—వంటి ప్రయోగాలు ఇట్టివి. తిప్పమాంబాకుమారేణ, నన్నయార్యేణ వంటివికూడా ఈ కోవకే చెందుతాయి. కొండవీడు-తిప్పమ-నన్నయ-అనే పేర్లు యథాతథంగా స్వీకరింపబడ్డాయి. చివరి రెండిరెటిలో అమ-అయ-అనేవి ఉన్నప్పటికీ అవ్వి స్వార్థాన్ని అంటే అంతార్థకతను, ఆర్యార్థకతను కోల్పోయాయి. అందుకే మళ్ళి అంబా-ఆర్య-శబ్దాలతో సమాసాలు చెయ్యడం జరిగింది. ఈ స్వార్థత్యాగాన్ని గుర్తించిన ప్రౌఢ వ్యాకర్త అప-అన-అమ-అయ లను ఇటువంటిచోట ఆగమమాత్రాలుగా విధించాడు. ఇలా యథాతథంగా స్వీకరించినప్పుడు వాటికి అన్య పదాలతో సంస్కృత సంధులే జరుగుతున్నాయి.

ఏమ్యాదులు, ఆల్వాదులు, పద్వాదులు అంటూ సూరి గణనిర్దేశం చెయ్యడం ఈ మార్గానికి అనుసరణమే. ఏమిః ఆదిః యేషాం తే ఏమ్యాదయః అని విగ్రహం చెప్పుకొని "ఏమ్యాది" అనే సిద్ధ సమాసాన్ని తెలుగులోకి ప్రాతిపదికంగా తెచ్చుకోవాలన్నమాట. ఇలా యథాతథంగా స్వీకరించి నిర్దేశించడంలో లాఘవంతోపాటు స్పష్టతకూడా ఉంది అనడం నిర్వివాదాంశం.

కాగా, భాషాంతరీకరించే సంప్రదాయం రెండవది. రెంటచింతలవారిని ద్విత్రింత్రి ణీవారనళం, గాలి నరసయ్యగారు ప్రభంజనం వారవ్వడం ఈ శ్రేణిలోవి.

ప్రాయస్తు స్యాత్ కిమాదికస్యేతః, దారార్థేఽత ఉదపి రః, అదరితపాది శబ్దేతు పత్యర్థే బిందులోపకౌ—ఇత్యాదికమైన చింతామణి—వికృతి వివేక నిర్దేశాలు ఈ పద్ధతికి చెందుతాయి. వీటిలో స్పష్టత ఒకింత తగ్గిందనడమూ నిర్వివాదాంశమే.

ఏమి ఇత్యాదులు, ఆలు ఇత్యాదులు అని సానుకరణంగా చెప్పడమూ, ఏమాదులు, ఆలాదులు అని తెలుగు సంధిలో చెప్పడమూకూడా కనబడుతున్నాయి.

# రూప సాధన సరళి

"అపదం న ప్రయుంజీత" అనేది సంస్కృత వ్యాకర్తలకు అక్షరాలా వేద వచనం అయ్యింది. "సుప్తిజన్తం పదమ్" (1—4—14) అనేది పద స్వరూపానికి పాణినీయం ఇచ్చిన నిర్వచనం. సుబంతత్వంగానీ, తిజన్తత్వంగానీ లేనిది అపదం అవుతుంది. అది ప్రయోగార్హంకాదు. అందుచేత ప్రయోగంలో సుప్పులు వినిపించని అవ్యయాదులకు పదత్వ సిద్ధికోసం సుబంతత్వాన్ని కల్పించు కోవడం వారికి తప్పనిసరి అయ్యింది.

జైనేంద్రుడు "సుమ్మిజన్తం పదమ్" (1—2—102) అని పదాన్ని నిర్వచించాడు. సుబంతత పాణినీయమే. "మిఙంతత" ఇతని మార్పు. పాణినీయంలోని 'తిజన్తమ్' అనే పదం ఇందులో 'మిఙన్తమ్' అయ్యింది.

ఈతడు పురుషల వరసలో కొంత మార్పుచేశాడు. పాణిని ప్రథమ—మధ్యమోత్తమ పురుషల వరసలో పరస్మైపద—ఆత్మనేపద ప్రత్యయాలను చెప్పాడు. తిప్—తస్—ఝి—అని ప్రారంభమై ఇట్—వహి—మహిఙ్ అని ముగుస్తున్నాయి. కాబట్టి 'తిఙ్' అనే ప్రత్యాహారం క్రియా విభక్తి సర్వస్వ బోధకంగా సిద్ధించింది. కాగా జైనేంద్రుడి వరస ఇది—

మిప్—వస్—మస్,

సిప్—థస్—థ,

తిప్—తస్—ఝి

ఇట్—వహి—మహి,

థాస్—ఆథామ్—ధ్వమ్,

త—ఆతామ్—ఝఙ్. (2—4—64)

ఇందులో ఉత్తమ పురుష ముందుకి వచ్చింది. మధ్యమ ప్రథమలు తరువాత వచ్చాయి. అందుచేత "మహిఙ్" లోని ఙకారాన్ని "ఝ" కు ఇద్వర్ణంగా తగిలించి "మిఙ్" అనే ప్రత్యాహారాన్ని కల్పించాడు. "_ఝఙోజకారః ప్రత్యాహారార్థః" అని అభయనంది వ్యాఖ్యలో తెలియజేశాడు. (జైనేంద్రం, పుట_361)[1].

పాణినీయంలో ప్రథమ పురుషకు సంబంధించిన నిర్వచనం మధ్యమోత్తమ పురుషల నిర్వచనాలతో ముడిపడి ఉంది. "యుష్మద్యుపపదే సమానాధికరణే స్థానిన్యపి మధ్యమః". (1_4-105) అని మధ్యమను చెప్పి, "అస్మద్యుత్తమః" (1_4_107) అని ఉత్తమనుచెప్పి, ఆటుపైని, "శేషే ప్రథమః" (1_4_108) "మధ్యమోత్తమయోః అవిషయే ప్రథమః స్యాత్" అని చెప్పడం జరిగింది. జైనేంద్రుడు అస్పష్ట విషయకమయిన ప్రథమను ముందుంచడం కన్నా ఉత్తమను ముందుచెప్పడం ఉత్తమమని భావించి ఉండవచ్చు. ఏదో కొంత మార్పు చేశాడు.___సుబంతం మిఙన్తం చ శబ్దరూపం పద సంజ్ఞం భవతి_" అని అభయ నంది వివరించాడు. (పుట_88).

## సుబంతత :

ప్రాకృత వ్యాకర్తలు పదస్వరూపానికి ప్రత్యేకంగా నిర్వచనం ఇచ్చినట్టు కనబడదు. కాగా వీరుకూడా ఈ సంస్కృత వ్యాకరణ సంప్రదాయాన్నే అనుసరించారనడానికి ఆధారాలు చాలా ఉన్నాయి. ఇదంత శబ్దాలమీద సుప్రత్యయ స్థితికి ఇంచుమించు అందరూ లోపమే విధించారు. సోర్లుక్'. (వాల్మీకి/త్రివిక్రమ, 4-6) "ఇదుదంతయోః సోర్ద్విర్ఘః". (ప్రాకృత కల్పతరుః, 1_1_4). వీటినిబట్టి ప్రయోగార్హమయిన పదం అవ్వాలి అంటే సుబుత్పత్తి తప్పనిసరి అనేది వీరి

1. సుమ్మిఙంతం పదమ్' అనే ఢకారపాఠం (ట్) అప్పుతచ్చు.
(జైనేంద్రం, పుట-88)
లిపిలో జ కి, ఢ కి ఒక చుక్కేగదా. తేడా.
ఆంధ్ర వ్యాకరణ పరిశోధకులు కొందరు ఈ ఢకారపాఠాన్ని
యథాతథంగా ఉదాహరించారు.

అభిప్రాయంగా గ్రహింపవచ్చు. ఇల్లాగే క్రియాపదాలకు తిజన్తతనుకూడా వీరు ప్రతిపాదించారు.

యే ధాతవో౽త్ర ప్రధితా హలంతాః।
తే ప్రాకృతేష్వేవ భవంత్యదంతాః॥
పఠంతి తేభ్యో హ్యుభయం పదం చ।
తిఙ న్త కార్యాణి యథా క్రమేణ॥

(ప్రాకృత కల్పతరుః_సప్తమ స్తబకే_పుట_36)

తత్సమ రూప సాధనను కొంత వరకు చూపిన కేతన, లచ్చి-గౌరి-వాణి_హోత_ధాత_ఇత్యాదులన్నీ ప్రయోగార్హాలు అన్నాడే తప్ప వీటి సుబంతతను గురించి స్పష్టంగా చెప్పలేదు. (ఆం. భా. భూ_24. 32, 39). కానీ-

మును సంస్కృత పదములపైఁ
దెనుఁగు విభక్తులు ఘటించి తేటపడఁగఁజె
ప్పిన నది తత్సమ మనఁజను
వనము_ధనము_పురుషుఁడబల_వసుమతి యనఁగన్

(ఆం. భా. భూ_20)

ఈ మాటనుబట్టి సంస్కృతాలమీద సరాసరి తెలుగు విభక్తులను చేర్చుకోవాలని తెలుస్తోంది "వసుమతి" ఇత్యాదులలో తెలుగు విభక్తులు వినిపించకపోతున్నా వాటికి సంస్కృత సిద్ధమయిన పదత్వం అవ్యాహతంగా ఉంటుందని కేతన భావించాడా అనేది సందేహం. విన్నకోట పెద్దన కూడా_

బిందు విసర్గంబులుఁ గడ
నందిన పొల్లులును దక్కి, యంధ్ర విభక్తుల్
పొందుగ సంస్కృత పదముల
ముందటి దెస నిలుప నందముగఁదెనుఁగయ్యెన్

(కావ్యాలంకార చూడామణి, 9_14)

అవి కేతనలాగానే నిర్వచించాడు.

సంస్కృత పదాల చివరనున్న విసర్గ వ్యంజనాలకు లోపం విధించే పద్ధతి ప్రాకృత వ్యాకరణాలలో అంతటా ఉంది.

పదాంతస్య హలో లోపః (ప్రాకృత కల్పతరుః, 1-1-5).

అంత్య హలోఽశ్రదుతీ। (వాల్మీకి/త్రివిక్రమ, 1-1-25).

శేష కృష్ణుడుకూడా-

ఐ-ఔ-ఽ-క-ఽ-ప-ఋ-ౠ-ఌ-ౡ-ప్లుత శషాన్స్వర్గః।

చతుర్థీ భ్యసి, ప్రాంతే హల్, ఙ ఞ నాః పృథక్, ద్వివచనం।

నాష్టాదశ ప్రాకృతేః (ప్రాకృత చంద్రిక, 1-13, 25) అని స్పష్టం చేశాడు.

ఋదంతాలను తత్సమాలు చేసేటప్పుడు ప్రథమైకవచన రూపాల తుది దీర్ఘాలను హ్రస్వాలు చేసుకుంటేవాలు కర్త-భర్త ఇత్యాదిగా ప్రయోగార్హాలు అయిపోతాయి అల్లాగే అనేకాచ్కాలయిన స్త్రీలింగాల దీర్ఘాలకూను.

వెలయు ఋకారాంత పదా
దులఁ దెనుఁగుగఁ జేయుచోటఁదుది విడుపులు గు
ఱ్ఱలు సేయందగు నృపులకుఁ
జలుకర్యపతి కర్త-భర్త-సంహర్త యనన్.

స్త్రీ లింగంబుల నుడుపులు
వాలాయము నుడుపఁ దెనుఁగు వచనములగు నం
దాలోల స్త్రీ శ్రీ హ్రీ
ధీ అను లపితములు దక్కఁ ద్రిక్కన వెల్లన్.

(కావ్యాలంకార చూడామణి-9-31, 32)

ఈ మొదలయిన పెద్దన మాటలనుబట్టి ఈతడుకూడా వీటికి సుబంతత అవసరమని భావించినట్టు కనబడదు. కాగా ఇద్దరూకూడా "సంస్కృత పదములను" అనే మాటను విడవకుండా అనడాన్నిబట్టి వీటికి సంస్కృత సిద్ధమైన పదత్వం— ప్రథమైకవచనరూపాలు కాబట్టి — తెలుగులో కూడా అహతంగా నిలుస్తుందని భావించారనుకోవచ్చు.

అచ్చికాలకు గానీ, తత్సమాలకు గానీ ప్రయోగయోగ్యత సిద్ధించాలంటే సుబంతత తప్పనిసరి అనే సంప్రదాయం ఆంధ్ర శబ్ద చింతామణిలో స్పష్టంగా అనుసరింపబడింది ఈ మేరకు అచ్చికాలను స్త్రీసమాలుగా విభాగించి ప్రథమైక వచన వివక్షలో సుప్రత్యయలోపాన్ని విధించడం జరిగింది. (అజంత—167)

హలంత శబ్దాలకు కూడా, ఉత్త్వద్విత్వాలను చెప్పిన తరువాత "అగుణవతాం సర్వహలాం సోర్లోపః" (హలంత—177) అని ఆంధ్ర శబ్ద చింతామణి సులోప విధానం చేసింది.

వీటినిబట్టి తెలుగు వ్యాకరణాలలో ప్రకృతి ప్రత్యయ విభాగంతో రూప సాధన ఆంధ్ర శబ్ద చింతామణిలో ఒక క్రమపద్ధతికి వచ్చిందని భావించవచ్చు.

## సుప్పుల స్థానంలో విభక్తి విధానం :

సంస్కృతాచ్ఛిక ప్రాతిపదికలకు ముందుగా సుప్పులను వివక్షించి వాటి స్థానంలో ఆయా తెలుగు విభక్తిప్రత్యయాలను ఆదేశించడం ఆంధ్రశబ్దచింతామణిలోని విశేషం. మహతస్సోర్డుజనితో భవేత్పుంసి—సోర్లుగితః—స్యాదమహతాం విభక్తౌ సోశ్చ ము - టావశ్చేతః—అందు జిపః—అనుతాం ప్రియాం—ఇత్యాదిగా అన్ని సూత్రాలూ దీనికి ప్రమాణంగా నిలుస్తాయి.

ప్రాకృత వ్యాకర్తలుకూడా తమ తద్భవరూప సాధనను ఇదేవిధంగా చేశారు. సంస్కృత విభక్తుల స్థానంలోనే ప్రాకృతీయ విభక్తులను (వికృతులను) వారు ఆదేశించారు.

టాణః। (చండ—6)
హిం భిసః। (చండ—8)
టా ఆమో ర్ణః। (హైమ, 8-3-4)
భిసో హి హిఁ హిం। (హైమ, 8-3-7)
హింతో త్తో దో దుడ జసిస్। (వాల్మీకి/త్రివిక్రమ, 2-2-6)

హిం భిసః। (పురుషోత్తమప్రాకృతానుశాసనం. 5-4) ఇత్యాదిగా ఎన్నయినా దీనికి ప్రమాణాలు చూపించవచ్చు. కాగా వీరు క్రియా విభక్తి ప్రత్యయాలనుకూడా 'టణ'ల స్థానంలోనే చెప్పుకోవడం విశేషం.

ఏకార స్తతివోః జ్జా। (ప్రాకృతానుశాసనం, 6-28, పుట-160)
తిప్ఝి, సిస్థ, మిబ్మసాం—ది ని సిధ మిమ్హాః।
(ప్రాకృతానుశాసనం, 9-66, పుట-163)

అయితే వీరు పాణినీయమయిన దశ విధ లకార విభాగాన్నీ, వికరణ ప్రత్యయాలనూ, పరస్మైపదాత్మనేపదాలనూ, కచ్చితంగా పాటించలేదని—ధాతూనాముభయపదిత్వం హలంతానాం చాదంతతా (పాకృతకల్పతరుః, 6-1, పుట-160),

ధాతోః పరస్మైపదం ప్రాయః। (ప్రాకృత కల్పతరుః, 9-65, పుట-163),
ధాతోః హలంతస్యాదంతో లోపో వికరణాః క్వచిత్।
(శేష కృష్ణ, ప్రాకృత చంద్రిక, 7-1, పుట, 94),

ఇత్యాది వచనాలనుబట్టి గమనింపవచ్చు.

సంస్కృతభవ రూపాలలో సంభవించిన వర్ణ వికారాలను ప్రకృతి ప్రత్యయ విభాగంతో నిర్వచింపబూనుకొన్న ప్రాకృత వ్యాకర్తలు ఈ పాణినీయ సంప్రదాయాన్ని అనుకరించడంవల్ల వారి వ్యాకరణాలచే సాధింపబడిన రూపాలకు సుబంతత, తిఙంతత సిద్ధించి పదత్వమూ ప్రయోగార్హత-లభించాయి. ఈ అనుకరణంలో గొప్ప సౌలభ్యాన్ని వీరు పొందారు.

ఆంధ్ర శబ్ద చింతామణి క్రియా రూప సాధనలోకూడా ఈ ప్రాకృత వ్యాకరణాల పద్ధతిని అనుసరించిందనడానికి ప్రత్యక్షాధారాలు లేవు. లకారవిభాగం చేసినా

క్రియావిభక్తి ప్రత్యయాలనుమాత్రం—"వ్యతిరేకార్థే ల్యృటి లటి డుజ్ స్యాత్" (క్రియా—17) ఇత్యాదిగా—సాక్షాత్తుగానే విధించింది తప్ప తిజుల స్థానంలో విధించలేదు.

"ప్రథమైక వచన లోపః తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్" (క్రియా–16) అనే సూత్రం దగ్గరకూడా "తద్ధర్మార్థే చ క్రియాణాం ప్రథమ పురుషైకవచనస్య లోపః స్యాత్" అని వ్యాఖ్యానించాడే తప్ప తిప్పును చేసుకొని దానికి లోపం చెప్పాలని అహోబలపండితుడు భావించలేదు. (కవిశిరోభూషణం—పుట—239)

కానీ అరుణాచల శాస్త్రిగారు డుజాది క్రియా విభక్తి ప్రత్యయాలను తిజుల స్థానంలోనే ఆదేశాలుగా వ్యాఖ్యానించారు. (కవిశిరోభూషణ వివృతి, పుట—584)

### బాల వ్యాకరణ పద్ధతి :

అనంతర కాలంలోని చిన్నయసూరి తన తొలి వ్యాకరణాల్లో ఆంధ్ర శబ్ద చింతామణిలాగానే సుప్పుల స్థానంలో తెలుగు విభక్తులను విధించాడు.

డుమువులవస్సునః। (అజంత—7)

అమో నుః। (అజంత—8)

చేత కోడ టానః। (అజంత—9)

ఇత్యాది విధానాలు అతని సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణంలో ఉన్నాయి.

వీని సూకు ఙజగు। (తత్సమ—38)

సుజస్సులకు దివియగు। (తత్సమ—45)

ఇత్యాది విధానాలు అతని ఆంధ్ర శబ్దానుశాసనంలోనూ ఉన్నాయి. కాగా బాల వ్యాకరణంలోమాత్రం సంస్కృతాచ్ఛిక ప్రాతిపదికలకు రెండింటికీ సాక్షాత్తుగా విభక్తి ప్రత్యయాల విధానం చేశాడు.

కానీ స్త్రీలింగాలకూ, గిరి, వాక్కు, మొదలయినవాటికీ ప్రథమా విభక్తి ఏకవచనంలో పదత్వసిద్ధికోసం సుప్రత్యయాన్ని చేసుకోవడమూ, దానికి ఆయా సూత్రాలతో లోపాన్ని చెప్పుకోవడమూ తప్పనిసరి అవుతోంది. ఈ సందర్భాలలో వ్యాఖ్యాతలందరూ ఇదే విధానం అనుసరించినట్టు కనబడుతోంది. బహుశ సూరి ఉద్దేశించినదికూడా ఇదే కావచ్చు. ప్రథమైక వచనలోప విధాయక సూత్రాల ఆంతర్యాన్ని (బా. వ్యా. తత్సమ—44, 57) సూరి వాచ్యం చేయలేదు.

'హరి' ఇత్యాదులలో డుజ్వర్ణక ప్రాప్తికి అవకాశం ఉంది కాబట్టి దానికే లోపం చెప్పవచ్చు. 'గిరి' ఇత్యాదులకు సుప్రత్యయలోపంతో పదత్వాన్ని కల్పించుకోవలసిన అవసరం తప్పడంలేదు. ఇది మహత్తు కాదు కాబట్టి డుజ్వర్ణకం రాదు. అదంతత లేదు కాబట్టి ముఃవర్ణకం రాదు. ఉదంతత లేదు కాబట్టి వువర్ణకం రాదు. అందుచేత గిరి+సు అనుకొని "ఇగ్లౌ—" సూత్రంతో సుప్రత్యయలోపం చేసి పదత్వాన్ని కల్పించుకోవాలి. ఇటువంటి ఒకటిరెండు సందర్భాలను విడిచిపెడితే బాలవ్యాకరణంలో అన్ని రూపాలూ సాక్షాత్తుగా తెలుగు విభక్తులను చేర్చుకోవడంతోనే సుసాధాలు అవుతున్నాయి.

### పదత్వం సిద్ధింపదా ? :

"—88 సూత్రము మొదలు 95 సూత్రము వఱకుఁదెలుఁగునందలి ప్రత్యయములు చెప్పఁబడినవి. ఏతదంతములు పదములు కాఁజాలవని తలఁచి చింతామణి తెలుఁగు నామములమీఁద సంస్కృత సుప్పులనే నిల్పి వానికి ఈ తెనుఁగు ప్రత్యయముల యథానిర్దిష్టముగ నాదేశించినది. క్రియలనుగూర్చనట్లే యనఁగాఁ గ్రియలపైని సంస్కృతములోని తిఙ్ప్రత్యయములను నిల్పి వానికిఁదెన్గుప్రత్యయములనాదేశించినది. ఇట్లు చేయుటవలనఁ దెలుఁగు శబ్దములన్నియుఁబదములై, "అపదం న ప్రయుంజీత'' అను భాష్య వచనమునకు విరుద్ధముకానివై కావ్యాది గ్రంథ ప్రయోగ యోగ్యములు అగుచున్నవి. దీనినే శాస్త్రీయ సంప్రదాయమని యందురు ప్రయోజనము లేకుండ నింత పెద్ద ప్రక్రియనాశ్రయింపనేల యని శంకింపఁజనదు. దీని నాశ్రయింపకున్నచో భాష సంప్రదాయ విరుద్ధము, నశాస్త్రీయము నగును—".

(కవిశిరోభూషణ వివృతి, అజంత, పుట—281)

అరుణాచలశాస్త్రిగారి ఈ మాటలనుబట్టి ఆంధ్ర శబ్ద చింతామణి సంప్ర దాయాన్ని అనుసరింపని బాలవ్యాకరణాదుల్లో సాధింపబడుతున్న తత్సమాదులకు వేటికీ పదత్వమే సిద్ధింపకపోవలసివస్తున్నది. ఈ అభిప్రాయం సమంజసం కానేరదు.

పాణినీయ ప్రోక్తాలయిన సుప్పులుగానీ, తిఙులుగానీ యథాతథంగా తెలుగులో విలవవు. కాగా "సుప్తిఙన్తం పదమ్" అనే నిర్వచనం తెలుగుకి లాక్షణికంగా సరిపడు తున్నదేకానీ యౌగికంగా సరిపడదు. ఆంధ్ర శబ్ద చింతామణి సుప్పుల స్థానంలో నామ విభక్తులను విధించింది కాబట్టి నామ విభక్త్యంతాలకు సుబంతత స్థానులనుబట్టి సిద్ధించినా, క్రియావిభక్తులను తిఙుల స్థానంలో విధించలేదు కాబట్టి క్రియా విభక్త్యం తాలకు తిఙంతత సిద్ధింపదు. అందుచేత తెలుగులోని క్రియలు పదాలుకాకపోవలసి వస్తున్నది. ఈ అసామంజస్యాన్ని వారించడంకోసమే అరుణాచల శాస్త్రిగారు క్రియా విభక్తులనుకూడా తిఙులకు ఆదేశాలుగా వ్యాఖ్యానించారు.

సంస్కృతంలో స్వాదులు నామ విభక్తులు. తెలుగులో డుజాదులు నామ విభక్తులు. స్వాదులకున్నట్టే ప్రథమాది సంజ్ఞలు బాల వ్యాకరణంలో డుజాదులకు విధింపబడ్డాయి. తదంతాలకు సుబంతతతోపాటు ప్రథమాది విభక్త్యంతత సిద్ధిస్తోంది. డుమువులు ప్రథమ (తత్సమ—1) ఇత్యాది విధానాలవల్లనే తెలుగులో నామ విభక్తులకు స్వాదితుల్యత్వమూ, తదంతాలకు సుబంతతుల్యత్వమూ లభిస్తుంది. నామ విభక్తులనన్నింటినీ దేనికదిగా ప్రత్యేక సూత్రాలతో విధించిన బాలవ్యాకరణం, తత్సమ పరిచ్ఛేదాదిలో ఆయా నామ విభక్తులకు ప్రథమాది సంజ్ఞలను చెప్పడంలోని ఆంతర్యం ఇదిగానే భావించాలి.

ఇల్లాగే క్రియాపరిచ్ఛేదంలో లకారస్థానంలో విధింపబడుతున్న డుఙ్_రు, వు_రు, ను_ము లకు (క్రియా_8) "అందు వరుసను రెండేసి ప్రథమ మధ్యమోత్త మంబులనంబడు" (క్రియా—9) అని చెప్పడంవల్ల తిబాది తుల్యత్వమూ, తదంతాలకు తిఙన్తతుల్యత్వమూ సిద్ధిస్తుంది. తెలుగు పదాలకు "సుప్తిఙన్తం పదమ్" అనే నిర్వ చనం లాక్షణికంగానే కానీ యథాతథంగా అన్వయింపదు కాబట్టి ఈ పద్ధతిలో బాల వ్యాకరణం పాటించిన సంప్రదాయంవల్ల తెలుగులోని తత్సమాదులకు పదత్వం సిద్ధింపక పోవడమూ ప్రయోగార్హత లేకపోవడమూ మొదలయిన ప్రత్యవాయాలను ఆశంకించుకోవలసిన అవసరంలేదు.

ఘటమునన్ :

ఏ ప్రాతిపదికకైనా ముందుగా సంస్కృత విభక్తి ప్రత్యయాన్ని వివక్షించుకొని దాని స్థానంలో తెలుగు విభక్తి ప్రత్యయాన్ని ఆదేశింపజేసుకోవడమనే ఆంధ్ర శబ్ద చింతామణి ప్రణాళికను అనుసరించే పక్షంలో ఈ "ఘటమునన్" అనే రూపం చాలా తేలికగా సాధింపబడుతోంది. కానీ ఈ ప్రణాళికను అంగీకరింపక ప్రాతిపదికలపై సరాసరి తెలుగు విభక్తులను చేర్చుకొనే ప్రణాళికను స్వీకరించిన బాల వ్యాకరణ మార్గంలో ఈ రూపం దుస్సాధమవుతోంది. ఎలాగంటే—

"ఘట" అనేది ప్రాతిపదికం. ఇది అదంతం. దీనికి సప్తమీ విభక్తిలో నవర్ణకాన్ని వివక్షించాలి. అయితే సప్తమీ నవర్ణకం ఉదంతాలయిన జడ వాచకాలకే వస్తుందని—"ఉకారాంత జడంబునకు నవర్ణకంబునగు" (బా.వ్యా. కారక — 18) అనే సూత్రంవల్ల తెలుస్తోంది. ముగాగమం వచ్చినట్టయితే ఈ ప్రాతిపదికం ఉదంతంగా మారుతుంది కాబట్టి అప్పుడు దానిమీద సప్తమీ నవర్ణకం చేసుకునే అవకాశం కలుగుతుంది. కానీ మువర్ణకేతర విభక్తి ఏదో ఒకటి విమిత్తంగా ఉంటేనే తప్ప ఆ ముగాగమం వచ్చే అవకాశం లేదాయె. "వానికి మువర్ణకేతరంబైన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు" (బా.వ్యా. తత్సమ—40) అనే సూత్రం ఈ విషయాన్ని స్పష్టంగా చెబుతూనే ఉంది. అంటే ఇక్కడ ముగాగమం వస్తేనే తప్ప ఉదంతత్వం సిద్ధింపదు కాబట్టి నవర్ణకం రావడానికి వీలులేదు. నవర్ణకం ఉంటేనే తప్ప విభక్తి పరత్వం సిద్ధింపదు కాబట్టి ముగాగమం రావడానికి వీలు లేదు. ఇదొక రకమయిన అన్యోన్యాశ్రయ దోషంగా కనబడుతోంది.

పదత్వ సిద్ధికోసం సుప్రత్యయాన్ని చేసుకోవడం బాల వ్యాకరణంలోనూ ఉన్న విషయమే కదా, అందుచేత "ఘటమునన్" అనేరూపం దగ్గరకూడా చింతామణి ప్రణాళికను అంగీకరించి సప్తమ్యేకవచన వివక్షలో ముందుగా ఙిప్రత్యయం చేసి, తన్నిమిత్తకంగా ముగాగమాన్ని సాధించుకొని అటుతరువాత ఙిప్రత్యయ స్థానంలో నవర్ణకాన్ని ఆదేశించుకొంటే సరిపోతుంది— అనేది ఒక విధమయిన సమన్వయంగానే కనిపించడం వాస్తవం. కానీ ఇది బాల వ్యాకరణ ప్రణాళికకు పూర్తిగా విరుద్ధమనే మాట అంతకన్నా వాస్తవం. ఎందుకంటే ఇటువంటి ప్రణాళికను అనుసరించిన చోటు బాల వ్యాకరణంలో మరొకటి కనిపించడంలేదు. పదత్వసిద్ధికోసం

తప్ప మరికెక్కడా ఇతడు పాటించనీ—పైగా పరిహరించినా—ఇటువంటి ప్రణాళికను ఈ ఒక్కచోట అవసరంకోసం ఆదరించడం సమంజసం కానేరదు.

పాణినీయంలో "శదేః శితః" (1-3-60) అనే సూత్రందగ్గర భాష్యకారుడు ఇదేరకమయిన శంకను లేవనెత్తి సుదీర్ఘమయిన చర్చను చేయడం జరిగింది శిత్వ విశిష్టమైన 'శద్' ధాతువునకు పరంగా ఉన్న సార్వధాతుక లకార స్థానంలో ఆత్మనే పద ప్రత్యయాలు వస్తాయి అని దానికి వృత్తి. లకార స్థానంలో పరస్మై పద ప్రత్యయాన్ని గానీ, ఆత్మనే పద ప్రత్యయాన్ని గానీ చేసుకొన్న తరువాతనే వికరణ ప్రత్యయాలను చెయ్యడం పాణినీయ సంప్రదాయం. కాబట్టి ఇక్కడ శద్ ధాతువునకు పరంగా ఉన్న లకార స్థానంలో ఆత్మనే పద ప్రత్యయాన్ని చేసుకొంటేనే తప్ప శిత్వ విశిష్టమయిన వికరణ ప్రత్యయం—శప్—రావడానికి వీఇలేదు. శిత్వ విశిష్టమయిన వికరణ ప్రత్యయం (శప్) వస్తేనేతప్ప 'శద్' ధాతువునకు శిత్వం సిద్ధంపదు కాబట్టి లకార స్థానంలో ఆత్మనే పద ప్రత్యయాలను చేసుకోవడానికి వీలుకుదరదు. సరిగ్గా మన ఇబ్బందివంటిదే ఇదీను.

అయితే దీనికి భాష్యకారుడు ఒక మార్గం చూపించాడు. సమనంతర భవిష్యత్తులో చేయబోతున్న ఆత్మనే పద ప్రత్యయాలను దృష్టిలో పెట్టుకొని ముందుగా వికరణ ప్రత్యయాన్ని (శప్) వివక్షించుకోవాలనీ అప్పుడు ఆరకంగా శద్ ధాతువునకు శిత్వం సిద్ధిస్తుంది కాబట్టి లకార స్థానంలో ఆత్మనే పదప్రత్యయాలను విధించమని చెప్పడం ఈ సూత్ర తాత్పర్యమనీ తెలియజేశాడు. (భాష్యం, 1–3–2, పుటలు, 267 నుంచి 272). భట్టోజి దీక్షితులవారుకూడా దీనిని సంగ్రహించి చెప్పారు. "శిద్భావినో 'అస్మాత్ ఆత్మనే పదం స్యాత్".

ఈ సమన్వయానికి ప్రోద్బలకంగా ఈ తావున "వికరణేభ్యో నియమో బలీయాన్" అనే పరిభాషను భాష్యకారుడు పేర్కొన్నాడు.

భాష్యకర్త చేసిన ఈ అర్థ నిర్ణయాన్ని ఉద్యోత వ్యాఖ్యాకృత్తు నాగేశ భట్టు "పద సంస్కార ప్రస్తావాత్ తాత్పర్య వృత్యాఽయం సూత్రార్థ ఇతి భావః" అని సమర్థించారు. (మహాభాష్యోద్యోతం—పుట—272)

వీరు చేసిన ఈ సమన్వయాన్ని మన ప్రస్తుత రూపసాధనకు వినియోగించు కోవచ్చు. సమనంతర భవిష్యత్తులో తప్పనిసరిగా వివక్షింపబోతున్న సప్తమీ విభక్తి ప్రత్యయమయిన నవర్ణకాన్ని దృష్టిలో పెట్టుకొని ముందుగానే ముగాగమం చేసుకొని అప్పుడు ప్రాతిపదిక ఉదంతం అయ్యింది కాబట్టి నవర్ణకం చేసుకోవాలి. ఇలా కాని పక్షంలో "ఘటమునన్" అనే రూపాన్ని కేవలం బాలవ్యాకరణ సూత్రాలతో ఆ సంప్రదాయంతో సాధించలేము. మార్గాంతరాలు మృగ్యాలు.

అయితే ఈ పద్ధతి సమన్వయం చిన్నయసూరికి సమ్మతమవునా? అనే సందేహం కలుగుతుంది. సమ్మతమేనేమో అని అనుమానించడానికి తగిన ఒక ఆధార లేశం లేక పోలేదు. "ఉకారాంత జడంబునకు నవర్ణకంబునగు" అనే సూత్రానికి ఆధార వాచకాలు మూడింటికీ ఉదాహరణలు ఇవ్వవలసి ఉండగా ఔపశ్లేషిక వైషయికాలకు మాత్రమే ఇచ్చాడు. అవి రెండూ ఇవి–"ఘటంబున జలమున్నది", "మోక్షమునవిచ్ఛ(గలదు". అల్లాగే ఉదంత జడంబు తృతీయకు నవర్ణకంబునగు (కారక—23)–అనే సూత్రం దగ్గర "రాముఁడొక్క బాణంబున వాలిం గూలనేసె" అని ఉదాహరించాడు. నవర్ణక ప్రసంగం వచ్చిన ప్రధాన సూత్రాలు ఈ రెండింటి దగ్గరాకూడా సహజోదంతాన్ని ఒక్కదానినయినా ఉదాహరించకుండా మూడింటినీ కృతకోదంతాలనే—అందునా ముగాగమవశంవల్ల ఉదంతాలయ్యే వాటినే ఉదాహరించ డాన్నిబట్టి "నవర్ణకాన్ని దృష్టిలో పెట్టుకొని ముందుగా ముగాగమం చేసుకోండి" అని చిన్నయసూరి సూచిస్తున్నాడేమో!

ఈతడు తాను అనుసరించిన సంస్కృత వ్యాకరణ మర్యాదలనుగానీ, పరిభాషలను గానీ అయాచోట్ల వివరణ వాక్యాలతో సూచిస్తూనే వచ్చాడు. కొన్నింటిని నిగూఢంగా దాచనూ దాచాడు. గసడదవాదేశ సందర్భంలో "సిద్ధే సత్యారభ్యమాణో విధిః నియమాయ భవతి" అనే పరిభాషను నిగూఢంగానే ఉంచాడుగానీ వివరింపలేదు. అల్లా నిగూఢంగా విశేపించిన మరికొన్ని పాణినీయ సంప్రదాయాల్లో ఇదికూడా ఒకటి కావచ్చు.

"శదేశ్శితః" అనే సూత్రం దగ్గర చేసుకొన్న సమన్వయంవంటిదే ఇరయోరే (6–4–76) సామ ఆకమ్ (7–1–33) ఇత్యాద్యనేక సూత్రాలదగ్గరకూడా అవసర మవుతున్నదని పాణినీయ పారీణులు అంటున్నారు. అంటే ఇటువంటి సమన్వయ

సంప్రదాయం పాణినీయంలో ప్రసిద్ధమే అని భావింపవచ్చు. బహుశ అందుకనే చిన్నయసూరి ప్రత్యేకంగా ఒక వివరణ వాక్యాన్ని ఈ సందర్భంలో వ్రాయలేదేమో కూడాను!

ప్రత్యయాలకు సుబంతత :

అపదం ప్రయోగార్హం కాదుకాబట్టి ప్రత్యయాలను విధించేటప్పుడు వాటిని సుబంతాలుగానే నిర్దేశించడం పాణినీయంలో ప్రహతంగా కనబడుతున్న మరొక సంప్రదాయం "స్వౌజసమౌట్ఛష్టాభ్యాంభిస్ ఙే భ్యాంభ్యస్ ఙసిభ్యాంభ్యస్ ఙసోసామ్ ఙ్యోస్సుప్" (4_1_2) అనే విధాయక సూత్రాన్ని ద్వంద్వసమాసంగా పాణినీయులు భావించారు. "__ఇత్యేక వింశతిః స్వాదయః। సమాహార ద్వంద్వః, ఇతరేతర యోగ ద్వంద్వోవా। తథా సతి సౌత్రమేక వచనమ్।" (బాలమనోరమ, ప్రథమ, పుట—120) అనేది బాలమనోరమా వచనం. "తి ప్తస్ఝి —" (3_4_78) ఇత్యాది సూత్రాన్నికూడా "ఏషాం సమాహార ద్వంద్వాత్ ప్రథమైక వచనమ్" (బాలమనోరమ, తృతీయ, పుట_4) ద్వంద్వ సమాసంగా భావించడం జరిగింది. "సర్వో ద్వంద్వో విభాషైకవద్భవతి" అనే పరిభాషను పాణినీయులు అంగీకరించారు. (34 పరిభాషేందు శేఖరం, పుట_59) ఇందువల్ల కేవల ప్రత్యయాలకు చేసిన ఈ విధానాలకు పదత్వమూ ప్రయోగార్హత్వమూ లభించింది.

ఈ సంప్రదాయం మేరకు "డుమువులవః ప్రథమా స్యాత్, కూర్చి లనునయో ర్భవేద్ద్వితీయాతు—" (అజంత_1,2) ఇత్యాదిగా సాగిన ఆంధ్ర శబ్ద చింతామణిలోని నిర్దేశాలు బహుపద ద్వంద్వాలుగా సమన్వయింపబడుతున్నాయి. "డుశ్చ-ముశ్చ-వుశ్చ-లుశ్చ-డుమువులవః" అని ద్వంద్వ సమాసం సంఘటితమవుతోంది.

తోచేత తోడ చే స్యుః తృతీయాయాః
కొఱకు కై చతుర్థ్యాః స్తః

ఇత్యాది నిర్దేశాలు ద్వంద్వాలుగా సమన్వయింపబడుతున్నాయి. ప్రత్యేకాన్వయమయినా కుదురుతోనే ఉంది. కాగా బాల వ్యాకరణంలో_

డుమువులు ప్రథమ।

చేత_తోడ_తృతీయ।

కొఱకు_కై - చతుర్థి।

వలన-కంటె-పట్టి_పంచమి।

కు_యొక్క_లోపల_షష్ఠి।

అందు_న_న సప్తమి।

అనే విధానాలలో నిర్దేశింపబడిన ప్రత్యయాలకు విభక్తి ప్రత్యయాంతత కనబడడంలేదు. ద్వంద్వసమాసాలందామంటే బహువచనాంతత లేదు. కాబట్టి వీటికి పదత్వమే లేదనీ, ప్రత్యయాలను అపదాలుగా నిర్దేశించడం సమంజసం కానేరదనీ, సంస్కృత భాషా పండితులు కొందరు ఆక్షేపించడమూ జరిగింది. వీరి మతంలో "డు" అనే దాన్ని ప్రాతిపదికంగా స్వీకరించి ఉదంతతను బట్టి వు వర్ణకంచేసి విష్ణువు ఇత్యాదులవలె "డవు" అని నిర్దేశించాలి. అప్పుడు "డువు_మువు_వువు_ఌ వు_ప్రథమ" అనే నిర్దేశం ఏర్పడాలి. అల్లాగే "చేతము_తోడము_తృతీయ" ఇత్యాదిగా సాగాలి. ఈ విభక్తి ప్రత్యయాలలో కై -కంటె_లను మినహాయిస్తే తక్కిన అన్నింటికీ డు_ము_వు లలో ఏదో ఒకటి చేర్చి నిర్దేశించాలి. పట్టికి మాత్రం ఇగ్లౌరాయుగంతేత్యాది సూత్రంతో సులోపం సాధ్యమవుతుంది కాబట్టి ఇబ్బంది లేదు. ఇది వీరి తాలూకు అభిప్రాయంగా వినబడుతోంది.

ప్రత్యయాలన్నీ సార్థకాలేననీ, అవి నిర్దేశావస్థలో ధాతు ప్రత్యయ భిన్నాలు అవుతున్నాయనీ, అందుచేత ప్రత్యయాలకుకూడా "అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్" అనే నియమం మేరకు ప్రాతిపదికత్వం ఉంటుందనీ, వాటి మీద ప్రథమాది విభక్తి ప్రత్యయాలన్నీ చేరవచ్చుననీ, అందుచేతనే "సౌ చ" (6_4_13), త్వా వౌ సౌ (7_2-94) భ్యసో భ్యమ్ (7_1-30) ఇత్యాది నిర్దేశాలు పాణినీయంలో కోకొల్లలనీ సంస్కృత పండితులు అభిప్రాయపడుతున్నారు.

ప్రత్యయాలకు ప్రాతిపదికత్వమూ, అటుపైని సుబుత్పత్తి అనేవి పాణినీయం లోనూ, "మహతః సొర్దుజనితో భవేత్పుంసి", "నోర్లు గితః" ఇత్యాదిగా ఆంధ్ర

శబ్ద చింతామణిలోనూ కనబడుతున్న మాట వాస్తవం. అందుచేత సంస్కృత పండితులు చేస్తున్న పై ఆక్షేపాలకు సమాధానంగా ఆంధ్ర వ్యాకరణాభిమానులైన పండితులు, బాల వ్యాకరణంలో–డుమువులుప్రథమ–ఇత్యాది నామ విభక్తి నిర్దేశాలను స్త్రీసమాలుగా సమన్వయించడం జరిగింది 'డు+సు' అని ఉండగా స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు (బా. వ్యా. తత్సమ—57) అనే నియమం ప్రకారం సుప్రత్యయం లోపించి "డు" అనేదానికి పదత్వం సిద్ధించింది. ఇల్లాగే తక్కిన వాటికీను.

"లకారంబునకు డుఙ్రు వురు నుముఙ్గు" (క్రియా—8) అనే సూత్రంలో లాగానే వీటినికూడా సమాహార లేదా ఇతరేతర యోగ ద్వంద్వాలుగా సమన్వయించి, "సర్వో ద్వంద్వో విభాషైకవద్భవతి" అనే పరిభాషను వినియోగించుకోవడం మరొక సమర్థనంగా కనబడుతోంది.

పై ఆక్షేపణ ఈ సమాధానం అనూచానంగా వస్తున్నవే కానీ ఇవి గ్రంథస్థమయిన జాడ కానరాలేదు.

ప్రాకృత వ్యాకరణాలలోకూడా పై పాణినీయ సంప్రదాయమే కనబడుతోంది.

1. సోర్బిందుర్న్వా । (ప్రాకృత ప్రకాశ–5-30)
2. అతస్సేర్డోః । (హైమ, 8–3–2)
3. జేర్డే । (వాల్మీకి/త్రివిక్రమ, 4-31)
4. ఏతదస్సునా సహ పుంసి। (పురుషోత్తమ, 5–72, పుట-159)

ఇత్యాది నిర్దేశాలు ప్రాకృత వ్యాకరణాలలో ప్రచురంగా కనబడుతున్నాయి. ప్రత్యయం హలంతమయినప్పుడూ, దీర్ఘాంతమయినప్పుడూ, దాని నిర్దేశంలోని సుబంతత స్పష్ట పడక పోవచ్చును గానీ తక్కిన ప్రత్యయాల నిర్దేశాలు స్పష్టంగా సుబంతాలుగా సంస్కృత ప్రాకృత వ్యాకరణాలలో కనబడుతున్నాయి.

ఈ విశేషాలను గమనించిన మీదటనే ఆంధ్ర వ్యాకరణాభిమానులయిన పండితులు బాల వ్యాకరణ నిర్దేశాలకు పైరీతి సమన్వయాన్ని ప్రతిపాదించినట్టు భావించాలి.

కానీ–పాణినీయంలోకూడా సుబంతత లేని ప్రత్యయ నిర్దేశాలు క్వాచిత్కంగా లేక పోలేదు. "చ్లిలుఙి" (3-1-43) అనే సూత్రంలో "చ్లి" అనే నిర్దేశానికి సుబంతత కనబడడంలేదు. అందుచేతనే బాల మనోరమా వ్యాఖ్యాత "చ్లి ఇతి లుప్త ప్రథమాకమ్" అని సమన్వయించడం జరిగింది. (బాలమనోరమ, తృతీయ, పుట-25) "ఏత ఐ (3-4-93)-ఐ ఇతి లుప్త ప్రథమాకమ్" (బాల మనోరమ, తృతీయ, పుట-39)

థాసస్సే। (3-4-80) (సే)
అత ఔ ణలః। (7-1-34) (ఔ)
ఆత ఐ। (3-4-95) (ఐ)

ఇత్యాది నిర్దేశాలు పాణినీయంలో ప్రత్యయాధికారంలోనే అనేకం ఉన్నాయి. అన్నిచోట్లా "లుప్త ప్రథమాకమ్" అనేదే సమన్వయం.

వీటినిబట్టి స్పష్ట ప్రతిపత్త్యాది ప్రయోజనాలను ఉద్దేశించి ప్రత్యయాలకు నిర్దేశంలో సుబంతత లేక పోవడమనేది అపాణినీయం కానేరదని భావింపవచ్చు. బాల వ్యాకరణ నిర్దేశాలను ఈ మేరకు సమన్వయ పరచుకొనే అవకాశంకూడా ఉన్నదనడమే సారాంశం.

"న ఆ ఈః ఆత్మనే పదే" (సూ—110, పుట—75) అనే కాశకృత్స్న నిర్దేశంకూడా దీనికి మరొక ప్రమాణంగా కనబడుతోంది. "నా వికరణస్య ఆకారస్య ఈకారాదేశో భవతి ఆత్మనే పదే పరతః" అనేది ఈ సూత్రానికి యుధిష్ఠిర మీమాంసకుల వ్యాఖ్య. ఇందులో 'ఆ' అనే నిర్దేశానికి షష్ఠీవిభక్తి ప్రత్యయాంతత కానరావడంలేదు.

# ఉత్వ ద్రుతులు

పుంలింగంలో ఉన్న మహద్వాచక ప్రాతిపదికల చివరి అత్వానికి విభక్తి రత్వంలో ఉత్వం వస్తుందని ఆంధ్ర శబ్ద చింతామణి చెబుతోంది.

"మహతోఽత ఉద్విభక్తౌ"। (అజంత-11) విభక్తి ప్రత్యయం ఏది నిమిత్తంగా ఉన్నా ఈ ఉత్వం వస్తుంది. బాల వ్యాకరణంకూడా "పుంలింగంబై మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకు ఉత్వంబగు" (తత్సమ—21) అని సర్వ విభక్తులలోనూ వీటి అత్వానికి ఉత్వం వస్తుందని సూత్రించింది. (లింగడు—రంగడు—గంగడు—ఇత్యాది సంజ్ఞా వాచకాలు దీనికి అపవాదలు).

భర్త - కర్త—ఇత్యాదులు పుంలింగ మహద్వాచకాలే అయినప్పటికీ ఆంధ్ర శబ్ద చింతామణి ప్రకారం ఇవి ఋబంతాలు కాబట్టి—తావుభౌ రమేశసమౌ (అజంత — 50)—అనే నిర్దేశం మేరకు పుంలింగతను కోల్పోయి ఉత్వాన్ని పొందడం లేదు. బాల వ్యాకరణంకూడా వీటికి స్త్రీసమత్వాన్ని అతిదేశించింది. (తత్సమ—52) ఈ వ్యాకరణాలలో ఉత్వద్రుతులు సన్నియోగ శిష్టాలు కావనేది సారాంశం.

ద్రుత్వర్ణకంలోని ఉత్వ సాహచర్యంవల్ల ఈ ప్రాతిపదికల చివరి అత్వం ఉత్వంగా మారుతున్నదనీ, ఇది స్వరాకర్షణ అనీ, భాషా చారిత్రికులు భావిస్తున్నారు. కానీ వృద్ధు—మూర్ఖు—ఇత్యాదులలోనూ, రామున్—రామునిచేతన్-ఇత్యాదులలోనూ ద్రుత్వర్ణకం లేనప్పుడుకూడా అత్వం ఉత్వంగా మారుతోంది. అల్లాగే మగడు—మనుమడు—అతడు—ఒకడు ఇత్యాదిదేశ్యాలలో ద్రుత్వర్ణకమున్నా అత్వం ఉత్వంగా మారడంలేదు. వీటివిబట్టి పై భాషా చారిత్రికుల అభిప్రాయంలోని సామంజస్యాన్ని వ్యాకరణ పరిశోధకులు శంకించడం జరిగింది. (తెలుగు వ్యాకరణ వికాసము, ప్రథమ, పుట—234)

ఉత్వం ప్రాకృతీయమా ?

తత్సమ తద్భవాలలోనూ, బల్లిదాది గణ పఠిత శబ్దాలలోనూ (బా వ్యా. ఆచ్ఛిక—3) మాత్రమే తుది అత్త్వం ఉత్త్వంగా మారడమనే వికృతి కనబడుతోంది. ఈ బల్లిదాది గణంలోకూడా బల్లిద (బలిష్ఠ) మొక్కల (మూర్ఖ) ఇత్యాదులు తద్భవాలుగానే భాసిస్తున్నాయి. కాగా మిసిమింతుఁడు_కావలుఁడు_ఇత్యాదులయిన కతిపయ దేశ్య శబ్దాలలో కనబడుతున్న ఈ ఉత్త్వ వికృతి తత్సమ పద సామ్యంవల్ల ఏర్పడినదిగా భావింపవచ్చు. పోగా ఇక మిగిలేవి తత్సమ తద్భవాలు మాత్రమే. అందుచేత ఈ వికృతి సంస్కృత భాషా సంబంధి గానీ, ప్రాకృత భాషా సంబంధి గానీ అయి ఉండవచ్చు.

సంస్కృత భాషలో మహత్సంలింగాల తుది అత్త్వం ఉత్త్వంగా మారుతున్న జాడ ఎక్కడా కనిపించడమేలేదు.

కాగా పుంలింగాలయిన, పుంతుల్యాలయిన మహద్వాచక ప్రాతిపదికల చివరి అత్త్వం ఉత్త్వంగామారడమనే ఈ వికృతిని ప్రాకృతభాషా ప్రభావంగా భావించడానికి తగినంతగా అవకాశాలు కనబడుతున్నాయి.

అదంత పుంలింగ ప్రాతిపదికలకు పరంగా ఉన్న 'స్' ప్రత్యయం ప్రాకృతంలో 'ఓ'గా మారుతోంది దీనిని ప్రాకృత వ్యాకరణ కర్తలందరూ ప్రస్తావించారు. అయితే వీరిలో ప్రాచీనులు 'ఓ'ను మాత్రమే విధించగా నవీనులు 'డో' ను విధించి డిత్వ సామర్థ్యతతో ప్రాతిపదికాంతంలోని అత్త్వాన్ని - టి – లోపింపజేశారు.

1. అత ఓత్ సోః। (ప్రాకృత ప్రకాశ, 5—1)

ఎ. అకారస్య పదాంశస్య సతి సౌ పరతః స్థితే।
భవతోత్వకారో ఆదేశః, కామః కామో, వసః వసో॥

(కాత్యాయన—ప్రాకృత మంజరీ)

బి. అకారాంతాత్ శబ్దాత్ పరస్య సోః స్థానే ఓత్వం భవతి।
వచ్ఛో। వసహో। పురిసో। (వృక్షః, వృషభః, పురుషః)
(భామహ—మనోరమ — పుట-107)

సి. అకారాంతాత్ ప్రాతిపదికాత్ ఉత్తరస్య సోః ప్రథమైకవచన సుప్రత్యయస్యోకారాదేశః స్యాత్।

(సదానంద—ప్రాకృత చంద్రిక-పుట-18)

2. స్యాదోదతస్సోః, జసి ఆచ్చ, శస్యేల్।
లుక్ జశ్శసోః, వా తు జే భ్యస్—జసీనామ్॥
జేరిష్ట ఏ చ ఙం సదా తు టామోః।
దీర్ఘో జసావామి తదా భ్యసి స్యాత్॥

(ప్రాకృత కల్పతరుః. 1-6-2, పుట-26)

3. అదంతాద్విసర్గాలుగోత్వం చ।

(ప్రాకృతానుశాసనం, 5—8, పుట—158)

4. అతస్సేర్డో।
అకారాంతాన్నామ్నః పరస్య స్యాదేః సేః స్థానే డో భవతి। వచ్ఛో।

(హేమచంద్ర—8—3—2)

5. సోః (4—7) అతో డో విసర్గః (7—28 వాల్మీకి/త్రివిక్రమ)

ఏ. అతః పరస్య సోః స్థానే డో భవతి। అనుక్తమన్యన్యాయేన డలోప టిలోపౌ। రామో।

(షడ్భాషా చంద్రిక, 2-2-13)

బి. అకారాత్పరస్య సోః స్థానే డిదోకారో భవతి। అనుక్తమన్యశబ్దాను శాసనపదితి డిత్యభస్యాపి అనుబంధకరణ సామర్థ్యాత్ టేరితి టిలోపః। రుక్ఖో। వచ్ఛో।

(ప్రాకృత రూపావతారః-పుట-7)

16)

సి. అతః పరస్య సోః డో ఆదేశః స్యాత్। అన్యవట్టిలోపః।
దలోపః। రామో।—

(షడ్భాషా వివరణమ్-పుట -10)

6. సర్గేఽతో డో। (5-2)

అదంతాత్పరస్య విసర్గస్య స్థానే డో ఇత్యాదేశః స్యాత్।
డిత్వాట్టిలోపః। రామో। సర్వతః—సవ్వదో।
కుతః—కుదో।

(శేష కృష్ణ—ప్రాకృత చంద్రిక—49)

అయితే ఈ విధి మహదమహద్వాచకాలకు రెండింటికీ సమానం. ప్రాతిపదికం పుంలింగమవ్వాలి, అదంతం కావాలి అనేది మాత్రమే ఇక్కడ నియమం.

"కుతః-కుదో, సర్వతః—సవ్వదో" వంటివాటిలోకూడా ఈ కార్యం కనబడు తోంది. అందుకే శేష కృష్ణుడు "సోః" అనే మాటను పరిహరించి "సర్గే" అనే మాటను ప్రవేశ పెట్టి తసిలంతాలనుకూడా దీనితోనే సాధించాడు. ఇది ఈతని లాఘవం. ప్రాకృతానుశాసనంకూడా "విసర్గాత్" అనే అంది. తక్కిన వారంతా ఈ తావులో అదంత పుంలింగాలను మాత్రమే స్వీకరించారు. ఇది గుర్తింపవలసిన విశేషం.

## అమహత్పుంలింగాలకు క్లీబత :

సంస్కృత భాషలో శబ్దార్థానికీ, శబ్దలింగానికీ సంబంధం లేదు. పురుష బోధకం నపుంసక లింగంలో ఉండవచ్చు. (మిత్రమ్). స్త్రీ బోధకం పుంలింగంలో ఉండవచ్చు. (దారాః). అంటే మహద్వాచకాలన్నీ పుంలింగంలో ఉండాలనీ, అమహ ద్వాచకాలన్నీ నపుంసక లింగంలో ఉండాలనీ, మహతీ వాచకాలన్నీ స్త్రీ లింగంలో ఉండాలనీ—ఇటువంటి పొంతన ఏదీ ఆ భాషలో లేదు ఇది జగద్విదితం.

ఎప్పుడో ఒక ప్రాచీనావస్థలో ఈ పొంతన ఉండి ఉండేదనీ, అప్పట్లో "న్యూటర్" మరియు "కామన్" అని రెండే లింగాలుండేవనీ, "కామన్ జెండర్"

అనేది తరువాత కాలంలో పుం-స్త్రీ లింగాలుగా విభజింపబడిందనీ, ఈ భాషా కుటుంబానికి చెందిన "హిట్టయిట్" భాషలో (Hittite) రెండు లింగాలే ఉన్నాయనీ పరిశోధకులు భావిస్తున్నారు. (A History of Sanskrit Litterature_A.A. Macdonell)

ప్రాకృత భాషలో శబ్దార్థానికీ లింగానికీ సయోధ్య కుదిర్చే ప్రయత్నం కొంతలో కొంత సాగినట్టు కనబడుతోంది. సంస్కృతంలో అమహద్వాచకాలయ్యి పుంలింగంలో ఉన్న శబ్దాలకు నపుంసక లింగతను చాలమంది ప్రాకృత వ్యాకర్తలు వైకల్పికంగా అతిదేశించారు. మరికొందరు సంస్కృత భాషా ప్రసిద్ధమయిన లింగం ప్రాకృతంలో యథాతథంగా అనుసరింపబడదు-అని సామాన్యంగా చెప్పి ఊరుకొన్నారు. ప్రాకృత కామధేనువులో లంకేశ్వరుడు ఇలా_

"న భేదః స్త్రీ పుం నపుంసక కృతః"।

ఇహ స్త్రీ పుం నపుంసక కృతో భేదో నాస్తి_

(సూ_9, పుట_171)

అని సామాన్యంగా చెప్పి ఊరుకున్నాడు.

శేష కృష్ణుడు కూడా "సుప్తిఙ్ లింగ నరాఙ్ఖలాది వహుళమ్" (1_14) అని సంక్షేపంగా చెప్పి, అటుపైని "లింగ వ్యత్యయో యథా_" అంటూ మూడు శ్లోకాలలో లింగ వ్యత్యయాన్ని ప్రతిపాదించాడు. (పుట_2,4)

"లింగమతంత్రమ్" (వాల్మీకి/త్రివిక్రమ, 3_4-67) అనే సూత్రానికి "అపభ్రంశే లింగమతంత్రం వ్యభిచారిప్రాయో భవతి। గఅ కుంభఇం దారంతు-గజ కుంభాన్ దారయంతమ్। అత్ర పుంలింగస్య నపుంసకత్వం। (కుంభాన్_కుంభఇం) అని త్రివిక్రముని వృత్తి. (పుట_202). వీటి వల్ల ప్రాకృత భాషలో లింగ వ్యవస్థ మరింత కలకలాన్ని సృష్టించిందని స్పష్టపడుతోంది.

"గుణాద్యాః క్లీబే వా" (8-1_34, పుట_77) అని హేమ చంద్రుడు చెప్పగా, 'క్లీబే గుణగాః' అనేది వాల్మీకి/త్రివిక్రమ వ్యాకరణంలోని సూత్రం. "గో

గణపరః" (గో గణపాఠః" 1-1-10) అన్నాడు కాబట్టి గుణాది గణం నిర్దేశింప బడింది. ఈ గణంలో ఉన్న శబ్దాలన్నీ అమహత్వంలింగాలే-అంటే-మహన్మహ తీతరాలయిన పుంలింగ శబ్దాలే. వీటికి క్లీబతను ఈ సూత్రం అతిదేశిస్తోంది.

ఎలకూచి బాల సరస్వతి ఈ సూత్రాన్ని ఇలా వ్యాఖ్యానించాడు-

క్లీబే గుణాదయో వా స్యుః। గుణం, కంఠం, ఖడ్గం।
పక్షే గుణో ఇత్యాది। గుణ కంఠ ఖడ్గ దేవ మండలాగ్ర
బిందు కరరుహ వృక్షాదయః।

(షడ్భాషా వివరణం, పుట-39)

దీనిని ఆకృతి గణంగా విడిచిపెట్టడం గమనింపదగినది. అమహత్పులింగాలకు నపుంసక లింగత ప్రాకృతంలో ప్రచురమనీ, అటువంటివన్నీ ఈ గణంలో చేరతాయనీ దీని తాత్పర్యం.

ఇలా సంస్కృతంలో అమహద్వాచకాలయిన అదంత పుంలింగాలకు ప్రాకృతంలో ద్వైరూప్యం (గుణో-గుణం) సిద్ధిస్తుండగా, మహత్తులయిన అదంత పుంలింగాలకు డోంతత మాత్రమే తప్పవిసరిగా కనబడుతోంది.

ఈ డోంతాలయిన ప్రాకృత పదాలను తెలుగులోకి ప్రాతిపదికలుగా స్వీకరిస్తే-

అనేకాక్షర ప్రాతిపదికల తుది దీర్ఘానికి హ్రస్వం నిత్యంగా రావడం తెలుగులో- దీర్ఘాణాం హ్రస్వః స్యాత్ న చ దేశ్య పదే నచైక వర్ణేఽపి। (ఆంధ్ర శబ్ద చింతామణి- అజంత-46, 47)-నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు. (బా. వ్యా. తత్సమ-54)-ఇత్యాదిగా వ్యాకరణ సాధ్యమవుతుంది.

అగ్గి-ఆడీ-జడా-మేరా-ఇత్యాది ప్రాకృత పదాలకన్నింటికీ హ్రస్వాంతతను ఈ సూత్రాలతోనే సాధిస్తున్నామాయె. అదే విధంగా ఈ డోంతాలకూ హ్రస్వత సిద్ధిస్తుంది.

ఓకారానికి హ్రస్వరూపం ఉకారమేగదా! (చిత్రగో—చిత్రగుః). "ఏచ ఇక్ హ్రస్వాదేశే" (1-1-48) అనేది పాణినీయవిధానం.

"రామ+సు" అని ఉండగా "అతస్సేర్డో" అని ఓత్వం వచ్చి-"రామో" అని ఏర్పడిన ప్రాకృత పదం తెలుగులో ప్రాతిపదికమై హ్రస్వాంతతను పొంది "రాము" అనికాగా దీనిమీద ప్రథమైక వచన వివక్షలో "డుజ్" చేరి "రాముఁడు" అనే రూపం సిద్ధిస్తుంది. ఇల్లాగే తక్కిన విభక్తులలోనూ వచనాలలోనూ రూపాలను సాధించు కోవచ్చు.

సంస్కృతంలోని సుబంతాలు తెలుగులోకి ప్రాతిపదికలుగా స్వీకరింపబడడం సుప్రసిద్ధమే. కాగా అక్కడ తుల్య పద వ్యవహారం-ప్రథమైక వచనాంత తుల్యంబు ఇత్యాదిగా-వ్యాకరణాలలో కనబడుతోంది. వాక్కు-గుణవంతుఁడు-దివి-హృది-ఇత్యాదులన్నీ అలా సిద్ధించినవే. చివరి రెండూ సప్తమ్యంతాలు. అవే ప్రాతి పదికలై సర్వ విభక్తులనూ పొందుతున్నాయి. ఈ సంప్రదాయాన్నిబట్టి ప్రాకృతంలో పదాలయిన "రామో" ఇత్యాదులు తెలుగులో ప్రాతిపదికలుగా స్వీకరింపబడడం అసమంజసం కానేరదు.

"రావో" అనే దోంత ప్రాకృత పదం తెలుగులో "రావు" అని నిలిచింది. (రామారావు). దీనిపైని మరి 'డుజ్' చేరడంలేదు. ప్రీ సమంగా భావించి సుప్రత్యయ తల్లోపాలతో పదత్వ కల్పనకు పాటుపడడం వైయాకరణం.

సంస్కృత భాషనుంచి తద్భవాలుగా ప్రాకృతంలో నిల్చిన రూపాలలోని ఆయా వర్ణ వికారాలను పరిహరించి యథా పూర్వ వర్ణ స్థితితో దోంత రూపాలను ప్రాతిపదికలుగా స్వీకరించడం తెలుగులోని ప్రత్యేకత. ఈ ప్రత్యేకత కారణంగానే ఇటువంటి రూపాలను ప్రాకృత సమాలు అనకుండా సంస్కృత సమాలుగా పరిగణిం చడం సుసంగతమవుతోంది. దోంతత అనేదికూడా విభక్తి ప్రత్యయ సంబంధమైన వికారమే కాబట్టి ఆ వికృతినిబట్టి వీటిని ప్రాకృత సమాలనిగానీ, భవాలనిగానీ భావింపవలసిన అవసరం లేదు.

విభక్తి ప్రత్యయ సంబంధమయిన వికారాన్నికూడా సంస్కృత సమతా బాధకంగా భావించేటట్టయితే, పై ప్రతిపాదనను అంగీకరించినా అంగీకరించకపోయినా రాముఁడు-కృష్ణుఁడు-ఇత్యాదులన్నింటా ఉత్వవికారం కనబడుతూనే ఉందికాబట్టి వాటిని సంస్కృత సమాలు అనడానికే అవకాశం ఉండదుగదా!. ఉత్వ వికారాన్ని సంస్కృత సమతా బాధకంగా భావించడంలేదు కాబట్టి డోంత రూపాలను స్వీకరించినా అదే పరిగణన కొనసాగడంలో అనౌచిత్యం ఉండబోదు.

అత్వం ఉత్వంగా మారడమనేది సంస్కృత ప్రాతిపదికలలో మహత్పుం లింగాలకూ, ఆచ్ఛికాలలో బల్లిదాదులకూ మాత్రమే కనబడుతోంది. ఈ బల్లిదాదులను మువర్ణకాదేశరానేక కార్యాలకోసం సంస్కృత తుల్యాలుగా అంగీకరించడం ఇప్పటికే అత్యవసరమయ్యింది. ఈ గణంలో ఉన్న తద్భవాలను ప్రాకృత సమాలుగానో, భవాలుగానో- డోంతరూపాలనుంచే సాధించవచ్చు. కాగా ఈగణంలో చేరిన కేవల దేశ్యాలలో (ప్రమింత మొ॥) ఉత్వ సాధనకు ఈ సంస్కృత తుల్యతా కథనం సమగ్రంగా ఉపకరిస్తుంది. ఈ గణ పరిగణనకు వైయర్థ్యాపత్తి ఉండబోదు అనడం తాత్పర్యం.

కర్త-భర్త-ఇత్యాదులను, ఉత్వడుజాది పరిహారణంకోసం స్త్రీతుల్యాలుగా భావించినట్టే, వృద్ధు, మూర్ఖు, నీచు-ఇత్యాదులయిన కతిపయ శబ్దాలను డుజ్వర్ణక పరిహారణంకోసం వైకల్పిక స్త్రీతుల్యాలుగా భావించవచ్చు.

"వృద్ధాదుల డుజ్ఞనకు లోపంబు విభాషనగు" (బా. వ్యా. తత్సమ—56) అనే సూత్రం ఉండనే ఉంది కాబట్టి బాల వ్యాకరణం మేరకు వీటికి ఈ స్త్రీ తుల్యతాతి దేశంకూడా అవసరంలేదు. "వృద్ధో" అనే డోంతం ప్రాతిపదికమై హ్రస్వతను పొంది డుజ్వర్ణకలోప వైకల్పికతతో "వృద్ధు-వృద్ధుఁడు" అని రెండేసి రూపాలను పొందుతుంది.

తెలుగు భాషలో మహత్పుంలింగాలకూ, బల్లిదాదులకూ కనబడుతున్న "తుది అత్వంబునకు త్వంబగు" అనే వికారాన్ని డుజ్వర్ణక సాహచర్యంవల్ల ఏర్పడినదిగా భావించడంకన్నా ప్రాకృత భాషా ప్రభావంవల్ల ఏర్పడినదిగా భావించడం సహేతు

కమనీ, అలా భావించినందువల్ల ప్రత్యవాయమేదీ భాషలోగానీ వ్యాకరణ గ్రంధాలలో గానీ ఉండబోదనీ ఇక్కడికి ఒక ప్రతిపాదన. లాఘవైక దృష్టి కలిగిన—లేదా—చారిత్రిక దృష్టి అంతగా లేని—వ్యాకర్తలలో కొందరు దీనిని "అత్వంబునకుత్వంబగు" అని చెప్పవచ్చు, మరికొందరు డుజ్వర్ణకంతో కలిపేసి, "ఉడుజ్" అగు అని చెప్ప వచ్చును గాక। (అండు—ఽడు—ఉండు—ఉఁడు—పుంలింగ ప్రత్యయములు—టి. యమ్. శేషగిరిశాస్త్రి—ఆంధ్రశబ్ద తత్త్వము—2, పుట–11)

అగ్గి—అడి-జడ—మేర—ఇత్యాది ప్రాకృత సమాలకు అగ్గీ—అడీ—జడా—మేరా—ఇత్యాది ప్రాకృత పదాలు ప్రాతి పదికలయినట్టే "జముఁడు" అనే ప్రాకృత సమ రూపానికి "జమో" అనే ప్రాకృత పదమే ప్రాతిపదికమై రూపసాధనలో సౌలభ్యమూ సామంజస్యమూ ఎంతగానో సమకూరుతున్నాయి. కాగా, కారము — సింగారము—ఇంగాలము—పవడము—జన్నము—మచ్చరము—కంబము—ఇత్యాది రూపాలసిద్ధికి కారో—సింగారో—ఇంగాలో—పవాళో-జన్నో—మచ్చరో—ఖంబో-ఇత్యాది డోంత రూపాలను ప్రాతిపదికలుగా స్వీకరింపవలసిన అవసరంలేదు. ఇవన్నీ అమహద్వాచకాలే. అదంతాలయిన అమహద్వాచకాల పుంలింగత ప్రాకృతంలో గుణాది పాఠంవల్ల వికల్పంగా క్లీబతను పొందుతోంది. కాబట్టి వీటికి డోంతత నిత్యం కాదు.

కారము ఇత్యాదులలోని మువర్ణకం "అచ్చిక శబ్దంబులెల్లం దఱచుగ స్త్రీ సమంబులుం గ్లీబసమంబులునై యుండు" (బా. వ్యా. అచ్చిక—2) అనే క్లీబసమతా కథనంవల్లనే సిద్ధిస్తోందన్నట్టయితే, ప్రాకృతంలో కూడా "క్లీబే గుణగాః" అనే నిర్దేశం మేరకు క్లీబతను పొంది—ఇంకా సుబంతతను పొందని— కార—ఇంగాల—వంటి ప్రాతిపదికలనే యథాతథంగా తెలుగులోకి ప్రాతిపదికలుగా స్వీకరించి, మువర్ణకం చేసుకోవడంలోగల సామంజస్యం గమనింపదగినది. ఇవి అదంతామహత్తులుకాబట్టి అసలు ఈ క్లీబతతో ప్రమేయం లేకుండానే మువర్ణకం వచ్చేస్తుంది.

"వెజ్జో" మొదలయిన డోంత ప్రాతిపదికలనుంచి సిద్ధించిన వెజ్జు (రావో-రావు) వంటి రూపాలలో ప్రథమైకవచన లోప సిద్ధికి పై బాల వ్యాకరణ సూత్రంచేత స్త్రీ సమత ఉండనే ఉన్నది. (బా.వ్యా. అచ్చిక—2)

ఈ ఉత్వాన్ని డో ప్రత్యయ ప్రహ్వస్థితిగా అంగీకరిస్తే ఆంధ్ర శబ్ద చింతామణి-బాలవ్యాకరణాలలో ఉన్న ఉత్వ విధాయక సూత్రాలు (మహతోఽత ఉద్విభక్తౌ, పుంలిం

గంబై మహద్వాచకంబైన నామంబు తుది య త్త్వంబునకు త్త్వంబగు) వ్యర్థమవుతాయి గదా! అని ఆశంకింపవలసిన అవసరం లేదు. అదంత ప్రాతిపదికను స్వీకరిస్తే నే తప్ప సాధ్యాలు కాని రూపాలు కొన్ని—బాలురు—నృపాలురు వంటివి—ఉన్నాయి. వీటిలో లు — ల లు, రు—ర లు గా మారిన పిదప ప్రాతిపదికలకు ఉత్త్వ సంపాద కంగా పై సూత్రాలు చరితార్థాలు అవుతాయి. లేదా అన్నింటా డోంత ప్రాతిపదికలను స్వీకరించడానికి మనస్కరించకపోతే, తద్భవాలలోనయినా ఈ మార్గాన్ని అనుసరిం చడం సముచితమవుతుంది. పైగా ఇది ప్రాకృతాంధ్ర వ్యాకరణాల తులనాత్మక పరిశీలనతో చేసిన ఒకానొక ప్రతిపాదనమే కానీ వర్ణనాత్మక వ్యాకరణ నిర్దేశం కాదాయె. కాగా వర్ణనాత్మక వ్యాకరణాలలో దీనివల్ల వచ్చే వైయర్థ్యాదులు లేవనడమే తాత్పర్యం.

## వృద్ధ సమ్మతి :

మహత్పుంలింగ ప్రాతిపదికల తుది అత్త్వానికి ఉత్త్వం వస్తుందని కేతన వచించారు.

> వుఱగు నుఱంతముపై
> ముఱగు నఱంత శబ్దములపై రెంటన్
> డుఱగుఁబురుషాఖ్యలపై
> నుఱ ఱగు నట్టియెడల నభినవ దండీ!
>
> (ఆం. భా. భూ—34)

ఆంధ్ర శబ్ద చింతా[illegible]టి—బాల వ్యాకరణము—తదనుయాయులు—ఈ మార్గాన్ని స్వీకరించారు. అత్త్వానికి ఉత్త్వం వస్తుందని చెప్పారు.

పట్టాభి రామ పండితీయంలో "ఒనరు డు వర్ణకంబు కవులొప్ప మహత్తగు వాని మీఁదనుండి : నుడువు భూమి పాల సుతుఁడు—" ఇత్యాదిగా సాగిన లక్షణంలో త్త్వప్రసక్తి వాచ్యం కాలేదు. (పుట—44, పద్యం—111)

విన్నకోట పెద్దనకూడా అత్త్వానికి ఉ_త్వం వస్తుందని చెప్పలేదు.

స్థావర తిర్యక్పదములు
దేవ మనుష్యాదికములుఁదెనిఁగించునెడన్
వావిరి నజంతముల తుదఁ
గావించు ముకారమును డుకారము నువికిన్.

(కావ్యాలంకార చూడామణి, 9_25)

చేరు నకారాంతముల డు
కారము దెనిఁగించుచోటఁ గతినాత్ముఁడనన్
దారుణ కర్ముఁడనంగను
మేరు మహా ధన్వుఁడన నమృత ధాముఁడనన్.

(కావ్యాలంకార చూడామణి, 9-42)

ఈ ఉన్న రెండు డువర్ణక విధానాలలోనూకూడా ఉత్త్వాదేశం ప్రస_క్తం కాలేదు. "ఆంధ్రభాషయుఁ ప్రాకృతాహ్వాయమ" (9-8) అని భావించిన వాడితడు. పైగా.

తెలుఁగుం బ్రాకృత భంగిన
బలియుటచే నేకవచన బహువచన పదం
బుల కావి ద్వి వచనంబులు
గలుగవు తత్క్రియలఁ గారకంబులయందున్. (9_72)

అని ప్రాకృత భాషా సామ్యాన్ని ప్రస_క్తిపూర్వకంగా నిర్ధారించాడు. ఇది-

న సు_ప్తిఙాం ద్విత్వమిహ ప్రయోజ్యం
తథా చతుర్థీ న కదాచిదేవ॥
ద్విత్వే బహుత్వం పరియోజనీయం
షష్ఠీ చతుర్థ్యామపి యోజనీయా॥

(ప్రాకృత కల్పతరుః, 16_1, పుట-26)

అనే శ్లోకాన్ని స్ఫురింపజేస్తోంది. రెండు లక్షణ గ్రంథాలూ ఛందోబద్ధాలుగానే ఉండడం గమనింపదగినది.[1]

కూచిమంచి తిమ్మకవి ప్రభృతులు ఏతన్మార్గానుయాయులు మరికొందరూ ఉత్త్వవిధానాన్ని చేయనివారు ఉన్నారు. కానీ ప్రాతిపదికాంగంగా కనబడుతున్న ఈ ఉత్త్వాన్ని వీరు ప్రాకృతభాషా సంప్రదాయ సిద్ధంగా భావించారు అడానికిగానీ, భావించ లేదు అనడానికిగానీ అవకాశాలు సరికి సరి.

అడిదము సూరకవిమాత్రం కొంత విలక్షణంగా ఈ విషయాన్ని ప్రస్తావించి ఉదాహరించాడు.

మహిత హలంత ప్రథమా
బహువచనాంతాక్షరములపై నిలుపఁదగున్
బహుళాకారాంత పదో
న్నిహిత ప్రథమా విభక్తి నియతిఁదెలుఁగునన్.
(కవి సంశయ విచ్ఛేదము—2-82, పుట_53)

అకారాంత పుంలింగ ప్రథమా విభక్తి వలె నిలుపవలెననఁగా:-
అకారాంత శబ్దము రామ శబ్దము. దీనిమీద ప్రథమావిభక్తి
నిలిపిన రాముడు. తకారాంత శబ్దములకుఁ బరీక్షితుఁడు.
దకారాంత శబ్దమునకు గోత్రభిదుఁడు. సకారాంత శబ్దమునకు
ఏతాదృశుఁడు. బహు వచనమునం దేతాదృశులు. ఇటువలెనే యనుక్త
శబ్దములకుఁగూర్చునది. (2_83)

---

1. ఈ ప్రాకృత కల్పతరువు క్రీ.శ. 12వ శతాబ్దానికి ముందుది కాదనీ క్రీ. శ. 1639 కి తరువాతది కాదనీ పీఠికాకర్త శ్రీ మన్మోహన్‌ఘోష్ ప్రతిపాదించారు.

కడల ముత్వంబుగల తెన్గు నుడువు లోలి
రహిని దేవ మనుష్య పరంబులై
ముత్వములఁ బాసి తగ దుత్వముల భజించు
బల్లిదుండక్కజుండనుభంగి శర్వ! (2_91, పుట_55, 56)

ఈ దువర్ణక ప్రసంగాలలో ఈతడు ఉత్త్వాన్నిగురించి ప్రస్తావించలేదు. కానీ తద్భవాలలోని వర్ణ వికారాలనుగురించి చెబుతూ ఈతడు పలికిన రెండు పద్యాలు మరీ గమనింపదగినవిగా ఉన్నాయి.

ధర యథా పూర్వ వర్ణ శబ్ద ప్రతతికి
నోలిఁ గొన్నిటి కాదేశ ముత్త్వమగును
తద్భవం బజ్విభక్త్యైకతన్ భజించు
తఱచుగా దీని పద్ధతు లెఱుఁగవలయు.
(కవి సంశయ విచ్ఛేదము. 3_5)

ఈ లక్షణానికి అనుకూలంగా "5 (1) యథాపూర్వాక్షరముల మీద నుత్త్వాదేశము వచ్చును. వృద్ధ శబ్దము_వృద్ధు, మూర్ఖశబ్దము—మూర్ఖు, దుష్టశబ్దము_దుష్టు, ధూర్త శబ్దము—ధూర్తు" ఇత్యాదిగా ఉదాహరించాడు. (కవి సంశయ విచ్ఛేదము–పుట_67)

వీటినీతడు తద్భవాలుగా భావించాడనడంలో సందేహంలేదు. యథాపూర్వాక్షర స్థితి ఉన్నప్పటికీ_అంటే_యథా సంస్కృత వర్ణ స్థితి ఉన్నప్పటికీ (ప్రాకృతంలోకి తత్సమాలుగా తద్భవాలుగా స్వీకరింపబడిన వాటికీ, తెలుగులోకి సరాసరి తద్భవాలుగా స్వీకరింపబడిన వాటికీ_యథాపూర్వాక్షర స్థితి అంటే_యథా సంస్కృత వర్ణ స్థితి అనే గదా!) చివరి ఉత్త్వాదేశ వికృతినిబట్టి వీటిని తద్భవాలుగా ఈతడు భావించాడనుకోవాలి. "రాముఁడు" ఇత్యాదులలో ఉత్త్వం కనబడుతున్నప్పటికీ అది దుజ్వర్ణక నిమిత్తకమయినదిగా భావింపబడి వాటి తత్సమతకు బాధకం కాలేదనీ, "వృద్ధు" ఇత్యాదులలో తద్భవతా బాధకాలయిన వర్ణాలు ఉన్నప్పటికీ ఉత్త్వ వికృతినిబట్టి అవి తద్భవాలేననీ, అవి యథా పూర్వ వర్ణ స్థితితో ఉంటాయనీ, ఈతని అభిప్రాయంగా గ్రహింపవచ్చు.

దీనివిబట్టి "వృద్ధు" ఇత్యాదులలోని ఉత్వాదేశాన్ని దోంత వికృతిగా భావించాడేమో। వీటి చివర కనబడుతున్న ఆ ప్రాకృత భాషా సంప్రదాయ సంబంధాన్నిబట్టి వీటిని తద్భవాలుగా పరిగణించాడేమో। అనే ఆలోచనలకు కొంతలో కొంత అవకాశం లేక పోలేదు. అయితే వీటి చివరి ఉత్వం దోప్రత్యయ హ్రస్వరూపమే అని తేల్చి చెప్పడానికి ఇతడు తెగింపలేదు. దీనికి కారణం వీటిలో కనబడుతున్న "యథా పూర్వాక్షర స్థితి" కావచ్చు. లేదా "రాముఁడు" ఇత్యాదులలో ఇదేవిధమయిన ఉత్వ వికృతి కనబడుతున్నప్పటికీ వాటిని తత్సమాలుగానే పూర్వాంధ్ర వ్యాకర్తలు పరిగణించడమూ కావచ్చు. ఏమయినప్పటికీ వీటి తద్భవత విషయంలో ఈతడొక ప్రత్యేకమయిన ఆలోచన చేశాడనడంలో సందేహం లేదు. అందుకనే "విభక్త్యేక లోపములగు పదములు తద్భవంబులగు కొన్ని, కొన్ని మాత్రిక వికృతులగున్ మహేశ।"(కవి సంశయ విచ్ఛేదము, 3_10) అని ఈతడు స్పష్టం చెయ్యడం జరిగింది.

తద్భవాలలో జరుగుతున్న స్వర వికృతులను కొన్నింటిని ప్రత్యేకంగా ఈతడు పేర్కొన్నాడు.

ఋత్వమునకు నిత్వమ్మును
నేత్వము సిద్ధించు, నోత్వమెనయును నుత్వం,
బౌత్వమునకు నోత్వంబగు,
నైత్వంబేత్వమగు, సుమశరాసన మథనా।
(కవి సంశయ విచ్ఛేదము, 3_8)

ఇందులో "ఓత్వమెనయునుత్వంబు" అనే మాటను సంస్కృత పదాలలోని ఉత్వం తద్భవాలలో ఓత్వంగా మారుతుంది అని అన్వయించి–

కులము — కొలము
కుడ్యము — గోడ
కుంతి — గొంతి
తుండము — తొండము

వీటిని లక్ష్యాలుగా ఇచ్చాడు. (పుట_10). వీటిలో ఓ_త్వంగా మారినది ఒక్క_"గోడ" అనేదానిలోనే. తక్కినవన్నీ హ్రస్వమయిన ద్వితీయ వక్రంతోనే ఉన్నాయి.

కాగా ప్రకృతులలో ఓ_త్వం వికృతులలో ఏమార్పును పొందుతోంది? అనే విషయం ఈ పద్యంలో ప్రసక్తం కాలేదు. ఈ లోటును పూరించాలంటే తంత్రోచ్చారణ సంప్రదాయంలాగా "ఓ_త్వము ఉ_త్వము నెనయును" అనీ అన్వయం కుదర్చవచ్చు. అప్పుడు డోంత రూపాలకు ఈ వాక్యంతో హ్రస్వతను సంపాదించుకొనే అవకాశం ఏర్పడుతుంది. కానీ ఈ పద్యంలో పేర్కొన్న స్వర వికృతులన్నీ పదాదికి సంబంధించినవి కాగా ఇదిమాత్రం పదాంతానికి చెందినది అవుతుంది. అయితే ఈ అన్వయాన్ని సూరకవి ఉద్దేశించాడనడానికి ఆధారాలు ఏమీ లేవు. ఉద్దేశించే ఉంటే లక్ష్యాలు చూపించేవాడే గదా। కాబట్టి అదంత మహత్పుంలింగాలలోని చివరి స్వరం ఉ_త్వంగా మారడమనేది ఈతని గ్రంథంలోకూడా ప్రత్యక్ష ప్రసక్తం కాలేదనడమే సమంజసం.

*హనుమానుఁడు :*

హనుమంతుఁడు_భగవంతుఁడు అనే రూపాలు గుణవంతుఁడు మతిమంతుఁడు ఇత్యాదులలాగానే ద్వితీయైక వచన తుల్య ప్రాతిపదికలనుంచి సులభంగా సాధింపబడుతున్నాయి. కాగా హనుమానుఁడు_భగవానుఁడు అనే రూపాలను సాధించడంలో ఆంధ్ర శబ్ద చింతామణి బాల వ్యాకరణాల మేరకు కొంత క్లేశం కనబడుతోంది [1]

*ఆంధ్ర శబ్ద చింతామణి :*

హలంతాలను గుణవద్గణము_అగుణవద్గణము అని విభజించి వీటికి క్రమంగా ద్వితీయైక వచనతుల్య ప్రథమైక వచనతుల్య రూపాలను ప్రాతిపదికలుగా స్వీకరించి

1 "భగవదాదులకుం బ్రథమాంత తుల్యత్వంబు నుత్వదుజ్జులు నగునవి కొంద ఱార్యులు". "ప్రశానుఁడు". (శబ్దలక్షణసంగ్రహం_తత్సమ_10, 11) ఈ సూరి సూత్రాలనుబట్టి భగవాన_హనుమాన (న్) లనే ఇతడు ప్రాతిపదికలుగా భావించాడా? అనే సందేహానికి అవకాశం కలుగుతోంది.

తత్సమ రూపాలను ఆంధ్ర శబ్ద చింతామణి సాధించింది. మతుప్ ప్రత్యయాంతాలన్నీ గుణవర్గణంలో చేరుతున్నాయి కాబట్టి "హనుమంతమ్_భగవంతమ్" అనే ద్వితీయైక వచనాంత తుల్యరూపాలను ప్రాతిపదికలుగా స్వీకరించి హనుమంతుఁడు ఇత్యాది రూపాలను సులభంగా సాధింపవచ్చు. కానీ వీటికి ప్రథమైక వచనాంత తుల్యరూపాలను ప్రాతిపదికలుగా స్వీకరించాలంటే అగుణవర్గణ పాఠాన్ని కల్పించాలి.

*గణద్వయ పాఠం :*

ఒకే శబ్దానికి గణద్వయంలో పాఠాన్ని కల్పించడం సమంజసం కానేరదని శ్రీ వజ్ఝలవారు అభిప్రాయపడ్డారు. (వ్యా॰ సం. సర్వస్వము, పుట_642). కానీ ప్రాకృత వ్యాకరణాలలో ద్వైరూప్య సిద్ధికి ఒకే శబ్దాన్ని గణద్వయంలో పఠించడం ప్రచురంగా కనబడుతోంది. ఎలకూచి బాల సరస్వతి ఈ మార్గాన అనేక తద్భవ రూపాలను సాధించాడు. (గృష్టి శబ్దో వక్రాదిః కృపాదిశ్చ। గింఠిహః। ఇత్యాదులు. షడ్భాషా వివరణం పుట—33) కాబట్టి ఇష్ట రూప సిద్ధికోసం గణద్వయ పాఠాన్ని అంగీకరించడంలో సంప్రదాయ వైరుధ్యం ఉండబోదు.

అలా అంగీకరించినప్పటికీ "హనుమాన్_భగవాన్" అనే ప్రథమైక వచన తుల్య ప్రాతిపదికలనుంచి హనుమానుఁడు-భగవానుఁడు అనే రూపాలు ఆంధ్ర శబ్ద చింతామణి_వికృతి వివేకాలవల్ల సాధ్యం కావడంలేదు.

హనుమాన్+సు, భగవాన్+సు అని ఉండగా "ద్విత్వో త్త్వే సర్వహలాం హ్రస్వాత్" (ఆంధ్ర శబ్ద చింతామణి—హలంత_3) అనే సూత్రంచేత ఉగాగమం నిత్యంగానూ, "ద్విత్వం తు దీర్ఘాత్ బహులమ్'' (హలంత_4) అనే సూత్రంచేత ద్విత్వం బహుళంగానూ రాగా హనుమాను+సు, భగవాను+సు అని ఏర్పడుతుంది. వెంటనే "అగుణవతాం సర్వహలాం సోర్లోపః'' (హలంత— 5) అనే సూత్రంవల్ల సుప్రత్యయం లోపించుతుందేగానీ దాని స్థానంలో డుబ్వర్ణకం రానేరదు. ఉగాగమ ప్రాప్తి వల్ల ఉకారాంతతను పొందిన హలంత ప్రాతిపదికలకు పరంగా ఉన్న సుప్రత్యయం నిత్యంగా లోపించడమే ఆంధ్ర శబ్ద చింతామణి_వికృతివివేకాలకు సమ్మతం. "ప్రకామఁడు। ప్రథమైక వచన తుల్యత్వం। దీర్ఘాత్పరత్వాన్న ద్విత్వం।'' అనే ఈ

అతో బలపతి మాటలు (కవిశిరోభూషణమ్, పుట—448) సమంజసాలు కానేరవు. (చూడుము_అనుబంధం_1) కాగా హనుమానుఁడు_భగవానుఁడు అనే రూపాలు ఈ వ్యాకరణాలతో సాధింపబడవనేది సారాంశం.

*బాల వ్యాకరణం :*

ఈ రూపాలను సాధించడానికి గాను బాల వ్యాకరణం ఒక ప్రత్యేక సూత్రాన్ని విబద్ధించింది "ఒకానొకచో మహత్త్వంబునందు మతు ప్రకారమునకు ఆనాదేశంబు విభాషనగు'' (తత్సమ—74). "మతు ప్రకారమునకు'' అన్నాడు కాబట్టి హనుమత్-భగవత్ అనే కేవల ప్రాతిపదికలనే ప్రాతిపదికలుగా స్వీకరించి ఆనాదేశంచేసి ఉత్త్వ డుజ్జులతో "హనుమానుఁడు—భగవానుఁడు'' అనే రూపాలను కొందరు వ్యాఖ్యాతలు సాధించారు. ద్వితీయైక వచనాంత తుల్యరూపాలను ప్రాతిపదికలుగా స్వీకరించి "హనుమం+ఆన'' అని ఏర్పరచి స్వర పరత్వంలో బిందువు ఉండదు కాబట్టి దానిని లోపింపజేసి అపదాది స్వర నిత్య సంధితో "హనుమాన'' తయారుచేసి ఆటుపైని ఉత్త్వడుజ్జులనుచేసి మరికొందరు ఈ రూపాలను సాధించారు. ప్రత్యేక విధానంతో మాత్రమే ఇవి సాధింపబడడం ఇక్కడ విశేషం.

*ఆంధ్ర భాషా భూషణం :*

> వానునకున్ వంతుండును
> మానునకును మంతుఁడునుఁ గ్రమంబున నగు శ
> బ్దానీకాంత నకారము
> మానించి విభక్తులెక్క మఱియొక్కొకచోన్
>
> (ఆం. భా. భూ.—[illegible])

ఈ విధానాలనుబట్టి ఈతడు హనుమంతుఁడు_భగవంతుఁడు అనే రూపాలను సాధించాడేగానీ హనుమానుఁడు భగవానుఁడు అనే రూపాలను సాధింపలేదని తెలుస్తోంది. తరువాత పద్యంలో గుణవంతుఁడు, మతిమంతుఁడు, హనుమంతుఁడు అనేవి మాత్రమే ఉదాహరించాడు.

*సర్వ లక్షణ సార సంగ్రహం.*

కూచిమంచి తిమ్మకవి రెండేసి రూపాలను విధించాడు—

హనుమద్భగవత్పదముల
పనివడి హనుమంతుఁడనఁగ భగవంతుఁడనన్
హనుమానుఁడు భగవానుఁడు
ననుచుఁ బ్రయోగింపఁజెల్లు నంబర వసనా!
(1–20, పుట–5)

*ప్రాకృత వ్యాకరణాలలో మతుప్ :*

వాన్–వంతు, మాన్–మంతు అని పైని కేతన చేసిన ఆదేశ విధానం ప్రాకృత వ్యాకరణ సంప్రదాయాన్ని స్ఫురింపజేస్తోంది. "మతుప్" ప్రత్యయానికి దాదాపు పది రకాల ఆదేశాలను ప్రాకృత వ్యాకరణాలు చెప్పాయి. అవి కేవలం "మతుప్" వకే అని కొందరు భావిస్తే పాణినీయంలోని ఆయా మతుబర్థకాలకు అన్నింటికీనని మరికొందరు అభిప్రాయ పడ్డారు.

1. ఆల్విల్లోల్లాలవన్తేన్తా మతుపః। (ప్రాకృత ప్రకాశః, 4-25)

ఎ. ఆలు–ఇల్ల–ఉల్ల–ఆల–వన్త–ఇన్త–ఇత్యేతే (6)
ఆదేశాః మతుపః స్థానే భవన్తి।
ఆలుస్తావత్–ఈసాలూ (ఈర్ష్యావత్)।
ణిద్దాలూ (నిద్రా[illegible]త్) (భామహ–మనోరమా–పుట–97)

బి. తదస్యాస్త్యస్మిన్[illegible]ర్థే విహిత ప్రత్యయానాం
సర్వేషాం మతుప్[illegible]దేన। (ప్రాకృత చంద్రికా–సదానంద–18, 19)

2. మత్వర్థే ఆల ఇ[illegible]। (ప్రాకృత లక్షణమ్–1-25)
మత్వర్థే ఏతౌ ప్రత్యయౌ భవతః।
జడాలో। జడిల్లో। ఫడాలో। ఫడిల్లో।

శ్లో॥ (వతీర్ మతీర్) ఇల్ల—ఉల్ల
ఆల-ఆలూ—ఇరా—మణః।
వన్తో—మా—మన్త—ఇత్తాశ్చ
యథా లక్ష్యం దశ స్మృతాః॥
—శ్రద్ధావాన్—సద్దాలో। -ధనవాన్-ధణమణో-ధణవన్తో।
హనుమాన్—హణుమా, హణుమన్తో—
తత్రభవేఽపి ఇల్ల ఉల్లౌ। గ్రామే భవః—గామిల్లో।
పురే భవః—పురిల్లో।

3. ఆల-ఇల్ల—ఉల్ల—ఆలు-వన్త—ఇత్తా—మతుపో యథా దృష్టి।
ఆల్వంతాత్ ఇణీ చ స్త్రియామ్।
(ప్రాకృతానుశాసనమ్, 4—29, 30, పుట—157)

4. మన్త మణ వన్త మా ఆలు ఆల ఇర ఇల్ల ఇన్త మతుపః।
(వాల్మీకి/త్రివిక్రమ, 2—1—1)

ఎ. మతుప్ ప్రత్యయస్య మన్తాదయ ఆదేశాః యథా ప్రయోగం భవంతి।
ఆలు:—గేహాళూ। దయాళూ। లజ్జాళూ।
ఆల:—సద్దాలో। జడాలో। రసాలో। (జోహ్ణాలో)
మతుపః ఇతి కిమ్? ఫణీ। అత్థి।
(షడ్భాషా చంద్రిక—లక్ష్మీధరః)

బి. మతుప ఏతే స్యుః। మంత—ధీమంతో। మణ—ధీమణో।
వంత—భత్తివంతో। మా—హణుమా। ఆలు—గేహాలూ।
ఆల—రసాలో। ఇర—అనుక్తన్యాయేన యస్యేతి చ—గవ్విరో।
ఇల్ల – గుణిల్లో। ఉల్ల—దప్పుల్లో। ఉల్లే ఉలోప ఇతి కేచిత్।
ఇన్త—మావిన్తో। (షడ్భాషా వివరణమ్—పుట—101)

5. మతోః స్థానే ఇల్ల—ఉల్ల ఆల ఆలు ఇరో మణాః
వన్తో మా మన్త ఇత్తశ్చ యథా లక్ష్యం దశ స్మృతాః॥
—గేహాలూ। దయాలూ। లజ్జాలూ। ధణమణో।
భత్తివన్తో। దణవన్తో। హణుమా। హణుమన్తో। కఇత్తో।—
(శేష కృష్ణ—ప్రాకృత చంద్రికా—పుట—41, 42)

ఈ ప్రాకృత వ్యాకర్తలు చెప్పిన పది ప్రత్యయాలనూ పాణినీయంలోని మతుబాద్యర్థక ప్రత్యయాలతో పోల్చి చూడడం అప్రస్తుతం కానేరదు.

| | |
|---|---|
| మా_మన్త_మత్తో_వన్త | తదస్యాస్త్యస్మిన్నితి మతుప్। (5-2-94) |
| మణ. ఇత్త_ఇన్త | మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః (8_2_9) |
| | ఇతి వత్వమ్। |
| | ఆలజాటజౌ బహు భాషిణి। (5_2_125) |
| | ప్రాణిస్థాదాతో లజన్యతరస్యామ్। (5_2-96) |
| | హృదయాచ్చాలు రన్యతరస్యామ్। (వార్తికం) |
| ఆల___ఆలు | సిధ్మాదిభ్యశ్చ। (5_2_97) |
| | స్పృహి గృహి పతి దయి నిద్రా తంద్రా |
| | శ్రద్ధాభ్య ఆలుచ్। (3-2-158) |
| | శీఙో వాచ్యః। (వార్తికం) |
| | ఫేనాదిలచ్చ। (5_2-99) |
| | లోమాది పామాది పిచ్ఛాదిభ్యశ్శనేలచః। (5-2-100) |
| ఇల్ల_ఇర-ఉల్ల | దేశే లుబిలచౌ చ। (5-2-105) |
| | ఊష సుషి ముష్క మధో రః। (5_2-107) |
| | తుందాదిభ్య ఇలచ్చ। (5-2_117) |
| | దన్త ఉన్నత ఉరచ్। (5-2-106) |

"మతుప్" ప్రత్యయం మా_మన్త-మత్త_వన్త_మణ-లుగా మారుతోంది. "హనుమాన్" అనేది "ఉర్భ్యాహనుమత్ కండూయ వాతూలే।" ఏషూత ఉత్త్వం భవతి। (8-1-121___హైమం___పుట_19) అనే సూత్రంచేత హ్రస్వం పొందిన రూపం. అటుపైని అజంతతను పొంది అంటే మతుప్ ప్రత్యయం "మాణ"గా మారి_ "హనుమాణ" అని ఏర్పడి___"దీర్ఘ హ్రస్వౌ మిథోవృత్తౌ"-(హైమం-8-1-4, పుట-2) అనే సూత్రంతో హ్రస్వతను పొంది సుప్రత్యయమూ 'దో' ఆదేశమూ జరిగి

"హనుమణో" అనేరూపం ఏర్పడుతుంది. వృత్తి పదాన్ని సమాస పర్యాయంగా ఇతడు స్వీకరించాడు.1 "వృత్తౌ సమాసే స్వరాణాం దీర్ఘ హ్రస్వౌ బహులం భవతః మిథః పరస్పరమ్।" అని ఈ సూత్రానికి హైమ స్వోపజ్ఞ వృత్తి. కానీ ప్రత్యయ పరత్వంలోకూడా-తద్ధితవృత్తి - ఈ దీర్ఘ హ్రస్వాల వినిమయాన్ని ప్రాకృత వ్యాకర్తలు అంగీకరించారు. "వారి మఈ - వారీ మఈ" అని మయట్ పరత్వంలో శేష కృష్ణుడి ఉదాహరణం గమనింపదగినది. (ప్రాకృత చంద్రికా. 1-18-పుట-4) 'మతుప్' ప్రత్యయానికి 'మణ' అనే హ్రస్వసహిత రూపమే ఆదేశంగా వచ్చినదని భావించడం సమంజసం. ప్రత్యయ మధ్యగమయిన దీర్ఘానికి హ్రస్వ స్థితిని పై సూత్రం సాధించడంలేదు. కానీ "హనుమాన్" అనే సంస్కృత పదంలో చివరి నకారం లోపించడంవల్ల "హనుమా" అనేరూపమూ, నకారం లోపించకుండానే అజంతతను పొందినందువల్ల "హనుమాణో" అని ఏర్పడి అటుపైని హ్రస్వ స్థితిని పొంది "హనుమణో" అనే రూపమూ ఏర్పడి ఉంటాయని భావించడానికి అవకాశంలేక పోలేదు. లాఘవ దృష్టితో ఈ ప్రాకృత వ్యాకర్తలు-మా, మణ - అనేవి మతుప్ ప్రత్యయానికి ఆదేశాలుగా విధించడం జరిగి ఉంటుంది.

ప్రాకృతంలో హ్రస్వదీర్ఘాల వినిమయానికి ఒకనియమంటూ లేదు. చాలా స్వేచ్ఛగా జరగడం ఆ భాషా స్వభావంగా కనబడుతోంది. అందుకే రామశర్మ—

> హ్రస్వోఽపి దీర్ఘో క్వచిదప్యభీష్టో।
> హ్రస్వోఽపి దీర్ఘః క్వచిదూహనీయః।
> (ప్రాకృత కల్పతరుః, 1—5, పుట—20)

అని ఈ విషయాన్ని యథా ప్రయోగంగా ఊహకు వదిలేశాడు.

"దీర్ఘాణామపి లఘుత్వం తథైవోచ్చరితానాం" (ప్రాకృత కామధేనుః—30, పుట—173) అనేది లంకేశ్వర వచనం.

---

1. బాలవ్యాకరణకర్తకూడా "అది యని శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగానగు" (సంధి—45) అనేచోట వృత్తి శబ్దాన్ని సమాస పర్యాయంగానే విశేషించాడు.

"దిహఠా మిథస్సే! (1—1—18) అనేది వాల్మీకి/త్రివిక్రమ వ్యాకరణోక్తి.

"నదిసుత—" అనే నన్నయ భారత ప్రయోగంలో సిద్ధ సమాస మధ్యంలోని హ్రస్వ స్థితి ఈ ప్రాకృత భాషా సంప్రదాయమే అయిఉండవచ్చు. (చూడుము. అనుబంధం—రెండు)

"మణ" అని హ్రస్వతను పొందినప్పటికీ సంస్కృతంలోని దాని దీర్ఘ సహితత్వాన్ని గుర్తించి "హనుమాణ" లేక "హనుమాణో" (ఓంతం) అనే ప్రాకృత పదాలకు తెలుగు విభక్తులు చేర్చి "హనుమానుఁడు" ఇత్యాదిగా వ్యవహారం జరిగి ఉండవచ్చు. అయితే "హనుమాణో" అనే రీతిగా దీర్ఘ ఘటిత (మాణ) రూపానికి వివిధ ప్రాకృత భేదాలలో ఎక్కడయినా ప్రయోగం దొరుకుతుందేమో ఇంకా వెదక వలసి ఉంది.

బహుశ ఈ రూపసామ్యాన్ని బట్టి భగవానుఁడు—భగవానునిచేతన్ ఇత్యాదులను ప్రజా కవులు ప్రయోగించి ఉండవచ్చు. ప్రజల వ్యవహారంలో హనుమానుడు కన్నా "భగవానుడు"కే ప్రాచుర్యం కనబడుతోంది.

కూచిమంచి తిమ్మకవి హనుమద్భగవత్పదాలకు మాత్రమే ఈ ద్విరూపతను విధించాడు. (సర్వలక్షణ సారసంగ్రహం—1_20, పుట–5). చిన్నయసూరి మహత్తు లయిన మతుబంతాల కన్నింటికీ ఆనాదేశం రావచ్చునని విశాలంగా ప్రవృత్తి పరిధిని పెంచి సూత్రరచన చేశాడు. (బా.వ్యా. తత్సమ_74). "మాణ" అనేది "మణ" యినట్టు ప్రాకృత వ్యాకర్తలు భావించగా ఇతడు మతుప్పులోని మకారమూ దాని కృత్తి అయిన వకారమూ (గుణవత్) సర్వత్ర సమానమే కాబట్టి వాటిని విడిచిపుచ్చి కారానికిమాత్రం 'ఆన' ఆదేశం విధించి మరింత లాఘవాన్ని సముపార్జించాడు. ఈ రూపాల పట్లగల ప్రాకృత భాషా సంప్రదాయ ప్రమేయానికి ఈ ఆదేశ విధానం కూడా ప్రమాణమవుతోంది. ఈ ఆనాదేశ విధాయక సూత్ర రచనా విస్తృతిని బట్టి ధీమానుఁడు_గుణవానుఁడు ఇత్యాదులుకూడా సుసాధాలు అవుతున్నాయి. ఇటువంటి ప్రయోగాలేవయినా చిన్నయసూరికి దొరికి ఉండవచ్చు. వాటి ప్రామాణికతను శంకించి

లక్ష్యాలుగా ఇచ్చి ఉండక పోవచ్చు. సూత్ర ప్రవృత్తి పరిధినిమాత్రం తదనుకూలంగా విస్తృత పరచడం గమనింపదగిన విశేషం. "ఒకానొకచో" అనేమాటను సూత్రాదినే ఉంచి ప్రామాణిక ప్రయోగోపలబ్ధిని సూరి వీరీకించినట్టు కనబడుతోంది.

దయాళురు :

"స్పృహి–గృహి–పతి–దయి — నిద్రా — తంద్రా — శ్రద్ధాభ్య ఆలుచ్" (3—2—158) అనే పాణినీయం తాచ్ఛీల్యార్థంలో ఆలుచ్ ప్రత్యయాన్ని విధించింది. స్పృహయాలుః—గృహయాలుః—పతయాలుః—దయాలుః-నిద్రాలుః–తంద్రాలుః-శ్రద్ధాలుః—అనే కృత్ ప్రత్యయాంత రూపాలు ఏర్పడుతున్నాయి. "శీఙో వాచ్యః" అని వార్తిక కర్త 'శయాలుః' అనే రూపాన్ని కూడా అంగీకరించాడు "కృపాలుః" అనే పదాన్ని కృపాం లాతి అనే అర్థంలో డు ప్రత్యయాంతంగా రామాశ్రమీ వ్యాఖ్యాత సాధించాడు. (అమరకోశం, 3–1–15). కాగా ఈ 'ఆలుచ్' అనే ప్రత్యయం మత్వర్థీయమూకాదు తద్ధితమూకాదు. తాచ్ఛీల్యమూ కృత్తూను. మత్వర్థంలో హృదయ శబ్దానికిమాత్రం "ఆలు" అనే ప్రత్యయాన్ని—హృదయాచ్చాలురన్యతరస్యామ్-అని వార్తిక కర్త అంగీకరించాడు. ఇది పాణినీయుల సంప్రదాయం.

కానీ ప్రాకృత వ్యాకర్తలు ఆల—ఆలు అనే రెండింటినీ మత్వర్థీయాలుగానూ తద్ధితలుగానూ భావించడం జరిగింది. అందుకే 'మతుప్' ప్రత్యయానికి ఆదేశాలుగా వారు ఈ రెండింటినీ విధించారు. లక్ష్మీధరుడు 'గేహాళూ—దయాలూ—లజ్జాలూ" అనే వాటిని ఆల్వంతాలుగానూ, సద్ధాలో అనే దాన్ని 'ఆల' ప్రత్యయాంతంగానూ ఉదాహరించాడు. "సద్ధాలో" అనే రూపాన్ని ప్రాకృత లక్షణంలో కూడా ఉదాహరించడం జరిగింది. నిజానికిది "శ్రద్ధాలుః" అని ఆలజంతంగా పాణినీయంలో సాధింపబడింది కాబట్టి 'సద్ధాలూ' అనే రూపంతో ఉండాలే కానీ "సద్ధాలో" అని "ఆల" ప్రత్యయాంతంగా అదంతమై దోంతత్వాన్ని పొందడానికి వీలులేదు. కానీ "ఆల–ఆలు" అనే భిన్న ప్రత్యయాలను రెండింటినీ మతుబర్థకాలుగానే వీరు భావించారు కాబట్టి వీటి పరస్పర వినిమయం ప్రాకృత భాషలో దోషం కానేరదు. మతుప్ ప్రత్యయానికే ఇవి రెండూ ఆదేశం అవుతాయనేది వీరి భావన కాబట్టి "సద్ధాలూ–సద్ధాలో, దయాలూ—దయాలో—ఇత్యాదిగా వీరికి రెండేసి రూపాలూ సిద్ధిస్తాయి.

అదంత ప్రాతిపదికలకు పరంగా ఉన్న సుప్రత్యయానికే 'డో' ఆదేశాన్ని ప్రాకృత వ్యాకర్తలు విధించారు. (అతస్సేర్డో। హైమం, 8—3—2). కాబట్టి సద్దాలో—దయాలో—వంటి పదాలలో సద్దాల—దయాల అనే ఆల ప్రత్యయాంతమే ప్రాతిపదికమవుతుంది.

ఇలా ప్రాకృత వ్యాకరణాల ప్రకారం మతుబర్థంలో "ఆల" ప్రత్యయాంతంగా ఏర్పడే "దయాల" అనేది తెలుగులో ప్రాతిపదికమై, దీనికి అదంతత, దీర్ఘ పూర్వ లోపధత్వమూ ఉన్నాయి కాబట్టి "దయాలురు" అనే రూపం "బాలురు" అనే రూప మంత సులభంగానూ సాధ్యమవుతుంది. ఈ మేరకు శ్రద్ధాలురు, నిద్రాలురు, తంద్రాలురు, లజ్జాలురు, స్నేహాలురు—ఇత్యాదులుకూడా వ్యాకరణ సాధ్యాలయి స్వేచ్ఛగా ప్రయోగించుకోవడానికి అర్హాలు అవుతున్నాయి వీటిలో 'ఆల' అనేది ప్రాకృతీయమే అయినా—అవుతున్నప్పటికీ—యథాపూర్వ వర్ణ స్థితితో ప్రాతిపది కలను స్వీకరించడం జరుగుతోందికాబట్టి వీటిని సంస్కృత సమాలుగా పరిగణిం చడంలో విప్రతిపత్తి ఉండబోదు.

"దయాలురు" అనే రూపానికి ప్రామాణిక ప్రయోగం ఉన్నదా? లేదా? అనే శంకతో ప్రమేయం లేదు. కేతన ఈ రూపాన్ని ప్రతిపాదించాడు. (ఆం. భా. భూ—71)

ఇక్కడ విభక్తి లకారం రేఫగా మారాలంటే ప్రతిప్రాతిపదికం అదంతమూ దీర్ఘ పూర్వ లోపధమూ అవ్వాలనే నియమం ఆంధ్ర శబ్ద చింతామణిలో అస్పష్టంగానూ, బాల వ్యాకరణంలో విస్పష్టంగానూ కనబడుతోంది. కానీ, కావ్యాలంకార చూడామణి "బాలు" అనే రూపంనుంచే "బాలురు" అనే రూపాన్ని సాధిస్తోంది. (9—84) "దయాలో" అనే డోంత పదాన్ని ప్రాతిపదికంగా స్వీకరించి తుది దీర్ఘానికి హ్రస్వం చేసి రు—ర లను చేర్చుకోవడంతో ఈ మార్గాన రూపాలు ఇవి మరింత సులభంగా సాధ్యాలు అవుతాయి.

## గుణవంతురాలు

గుణవంతురాలు–ధీమంతురాలు ఇత్యాదులలో ఆలు శబ్దం స్త్రీమాత్రపరం. ఇవి సమాసాలే అయినా వీటిలోని పూర్వావయవాలకు—గుణవంత, ధీమంత— పదత్వంలేదు. గుణవంతమ్—ధీమంతమ్—అనే ద్వితీయైక వచన తుల్య రూపాలలో అంతిమ మకారం లోపించింది. ఇంకా పదత్వం సంప్రాప్తం కాలేదు. పదత్వం లేనిదే సమాసం కుదరదు సమాసం పదవిధి గదా। అందుచేతనే వీటిని విలక్షణ కర్మధారయ సమాసాలని వ్యాఖ్యాతలు చెబుతున్నారు. కానీ ప్రాకృత వ్యాకరణాల ప్రకారం వీటిలోని పూర్వావయవాలకు పదత్వం సిద్ధించే అవకాశం లేకపోలేదు.

మతుప్ ప్రత్యయానికి వన్త—మన్త అనే ఆదేశాలను ప్రాకృత వ్యాకర్తలు విధించారు. కాబట్టి గుణవన్త–ధీమన్త అనే ప్రాతిపదికలు ఏర్పడతాయి. వీటికి స్త్రీవాచకతా వివక్షలో "అవిద్యుతి స్త్రియామాత్" (షడ్భాషా వివరణం-పుట–82) అనే వాల్మీకి/త్రివిక్రమ సూత్రం ప్రకారం ఆత్వం రావచ్చు. ఇలా ఏర్పడిన ఆదంతాలు దుర్గావత్తుగా ఉంటాయని షడ్భాషా వివరణకర్త పేర్కొన్నాడు.

"అవిద్యుతః స్త్రియామాత్వం" (ప్రాకృత చంద్రికా, 1–19–5) అని శేష కృష్ణుడుకూడా విధించి అంతిమ వ్యంజనలోపానికి ఇది బాధకమని వివరించాడు. సరిత్–సరిఆ, ప్రతిపత్-పడివఆ, సంపత్–సంపఆ–ఇత్యాదులను ఉదాహరించాడు.

ఈ ఆత్వంతో గుణవన్తా–ధీమన్తా అనే రూపాలు స్త్రీత్వ వివక్షలో ఏర్పడే అవకాశం ఉంది. గుణవతీ-ధీమతీ అనేవాటినుంచి "గుణవతి–ధీమతి–" అనేవి యథాసంస్కృతవ్యాకరణం లభించినట్టే, గుణవన్త–ధీమన్త–అనే వాటిని యథా ప్రాకృత వ్యాకరణం లభింపజేయవచ్చు. అప్పుడు వీటికి పదత్వం నిరాక్షేపంగా ఉంటుంది కాబట్టి ఆలు శబ్దంతో కర్మధారయంగా సమసింప జేస్తే అత్త్వానికి ఉత్త్వమూ రుగాగమమూ లభించి (బా.వ్యా. సంధి—31) గుణవంతురాలు–ధీమంతురాలు అనేవి సుసంగతాలు అవుతాయి.

గుణవతీ నుండి గుణవఈ అన్నట్టుగా తద్భవరూపాలతో కాకుండా తత్సమ దేశ్య విభాగాలకు చెందిన పదాలతో కూర్చిన స్వతంత్ర ప్రాకృత గ్రంథాలలో గుణవన్తా-

ధీమన్త అనేరీతి స్త్రీలింగ ప్రయోగాలు లభించేవరకూ ఈ ప్రతిపాదన సావకాశమయిన ఊహగా మాత్రమే మిగిలిపోతుంది "అవిద్యుతి" అనే పర్యుదాసాన్ని బట్టీ, శేష కృష్ణుడు ఇచ్చిన లక్ష్యాలనుబట్టీ ఈ అ త్త్వం మహతీతరాలయిన స్త్రీలింగాలకేనేమో అనే సందేహం ప్రబలంగా మిగిలిపోతోంది.

సంస్కృత వ్యాకరణ సిద్ధాలయిన టాబంతాలకే తప్ప ప్రాకృత వ్యాకరణోక్తాలయిన ఈ అదంతాలకు స్త్రీత్వ బోధకతాశక్తి సంకేతిత సుప్రసిద్ధం కాకపోవడంవల్ల ఆలుశబ్దంతో సమాసం చేసుకోవడం జరిగి ఉండవచ్చు. యథాపూర్వ వర్ణస్థితి కారణంగా సంస్కృత సమతను వీటికి భావించడంతో అత్త్వానికి ఉత్త్వం సంప్రాప్తమై ఉండవచ్చు.

"బాలెంత" అనేది తనంతతాను స్త్రీవాచకమే అయినా ఆలు శబ్దంతో సమసింప జేయడం జరిగింది. ధీరా అనే టాబంతం తనంతతానుగా స్త్రీ వాచకమవుతున్నా ఆలు శబ్దంతో సమసించడమూ, అత్త్వానికి ఉత్త్వాన్ని పొందడమూ జరిగింది. ఇలాగే గుణవన్త-ధీమన్త అనేవి అదంతాలుగా స్త్రీవాచకాలు అవుతున్నప్పటికీ వీటిని ఆలు శబ్దంతో సమసింపజేయడం జరిగి ఉండవచ్చు.

"పాతకురాలు" అనే రూపాన్నికూడా కేతన "ముద్దరాలు" మొదలయిన వాటితో కలిపి విధించాడే తప్ప ప్రత్యేక విభాగం చెయ్యలేదు.

> ఆలికి రాలగు దిగువ గు
> ణాలి నిలిపి పలుకుచోట ననువగునెడ గొ
> డ్రాలు-జవరాలు-పాతకు
> రాలు-గెడపురాలు-ముద్దరాలన జనుటన్.
>
> (ఆం. భా. భూ.-168)

"దిగువ గుణాలి నిలిపి" [illegible]నల్ల ఈ సమాసాలలో పూర్వపదాలు గుణ వాచక విశేషణాలు అనీ, ఆలు వి[illegible]నీ, కాబట్టి ఇవి కర్మధారయాలేకానీ వ్యధికరణ తత్పురుషలుకావనీ-స్పష్టపడుతోంది. కాగా అత్త్వానికి ఉత్త్వాన్ని ఈతడు విధించలేదు

కాబట్టి "పాతకు+ఆలు_పాతకురాలు అనే విధంగా రూపసిద్ధిని ఈతడు భావించాడు అనుకోవాలి.

పురుష వాచకాలు స్త్రీవాచకాలతో సమసించడంవల్ల తెలుగులో స్త్రీబోధ జరుగుతోంది. ఇదే మార్గాన పురుష వాచకాలయిన పాతకో–గుణవన్తో_ధీమన్తో_ ఇత్యాది దోంత ప్రాకృత పదాలు (ప్రథమైక వచనాలు) ప్రాతిపదికలై హ్రస్వతను పొంది స్త్రీవాచకతా వివక్షలో ఆలు శబ్దంతో సమసించి ఉండవచ్చు. వీటిలోని పూర్వావయవాలకు తెలుగులో పదత్వమూ ప్రథమైకవచనాంతాలుగా వ_స్త ప్రయోగమూ లేవు. అందుచేతకూడా వీటిని నిత్య సమాసాలు అనడం జరిగి ఉండవచ్చు. ఆలోచన చేయగా చేయగా వీటిని విలక్షణ కర్మధారయాలు అని భావించి ఊరుకోవడమే తెలివయిన పనిగా కనబడుతోంది. వీటికి సంబంధించి మరింత పరిశోధన జరగాలి.

## అన్యభాషాప్రభావం :

ద్రావిడభాషాకుటుంబానికి చెందిన తెలుగు సంస్కృత ప్రాకృతాది భాషల ప్రభావానికి లోనయ్యింది. చారిత్రికంగా చూస్తే తెలుగుదేశంలోని జనబాహుళ్యం మాట్లాడే భాష, ప్రాకృత భాషా ప్రభావానికి లోనయినంతగా సంస్కృత భాషా ప్రభావానికి లోనయినట్టు కనబడదు. కాగా ఆనాటి శిష్టుల భాష అటు సంస్కృత ప్రభావానికీ ఇటు ప్రాకృత ప్రభావానికీ లోనయ్యింది. ఈ వ్యవహారంలోని భాషను కావ్యోపయోగిగా సంస్కరింపబూనిన కవులూ వ్యాకర్తలూ_కొందరు_సంస్కృత ప్రాకృత భాషలను రెండింటినీ తెలుగు భాషకు ప్రకృతులుగా అంగీకరించారు. వీరు ప్రకృతి-ప్రత్యయ_గణాదికమయిన విభాగాలను కొన్నింటిని చేసి రూపసాధనలో సౌలభ్యాన్ని సాధించారు. ఈ భాషాప్రభావంవల్ల ఈ రూపంలో ఇదిగో ఈ వికృతి వచ్చింది, లేదా-ఈ రూపంలోని ఈ వికృకి ఇదిగో ఇది హేతువు అని నిరూపించవలసిన అవసరం ఈ వర్ణనాత్మక వ్యాకర్తలకు లేకపోయింది.

వివిధ వ్యక్తుల ప్రభావానికి లోనయిన ఒక వ్యక్తి ప్రవర్తనలో ఇదిగో ఈ చేష్ట ఫలానావారి ప్రభావము, ఈ చేష్ట ఫలానావారి ప్రభావము—అవి అన్నివేళలా కచ్చితంగా నిర్ధారించి చూపడం కష్టం. అన్ని ప్రభావాలూ కలగా పులగంగా ఉండి మధ్యలో ఒక నౌతన్యమూ రావచ్చు. అలాగే భాషలోకూడా. ఒక పదం మీద

(దేశ్యేతరం) ఒక భాషా ప్రభావమే ఉంటుందని చెప్పడానికి లేదు. వివిధ భాషల ప్రభావం ఒకే పదంలో కనబడవచ్చు. అదే పదంలో స్వాభావికమయిన జీవ లక్షణమూ ఉండవచ్చు. అన్య భాషా ప్రభావం ఉన్నా లేకపోయినా స్వాభావికమయిన జీవలక్షణం మాత్రం కనబడుతూనే ఉంటుంది. ఇతర భాషలనుండి దిగుమతి చేసుకున్న పదాలకు కూడా ఈ జీవలక్షణం సోకుతుంది. అటువంటి పదాలలో రెండుభాషల జీవలక్షణాలూ స్ఫురిస్తూ ఉండవచ్చు. లేదా ఆ కలయికలో ఒక నూతన లక్షణమూ భాసించవచ్చు. కాగా ఆ భాషా జీవ లక్షణమూ, ఇతర భాషా ప్రభావమూ అనేవి ఒక్కొక్కప్పుడు ఒకే పదంలో కనబడవచ్చు, విభిన్న పదాలలో విడివిడిగా ప్రాధాన్యం వహించీ కనబడవచ్చు.

ఈ విభాల దృక్పథంతో చూసినప్పుడు "రాముడు" అనే పదంలో ప్రత్యయమేమో ద్రావిడము, ప్రాతిపదికమేమో సంస్కృతీయము, ఉదంతతా పరిణామమేమో ప్రాకృతీయము గా ఇప్పటికి భాసిస్తోంది. అయితే దీనిని తత్సమమనాలా? తద్భవమనాలా? ఇత్యాదికమైన సందేహ సందోహాలు—వీటిని వింగడించి చెప్పవలసి వచ్చినపుడు కలుగుతాయి. ప్రాతిపదికంలో వర్ణ వికృతి లేకపోతే తత్సమమనీ, ఉంటే తద్భవమనీ ఆంధ్ర వ్యాకర్తలు స్థూలంగా ఒక విభాజక సూత్రాన్ని అనుసరించినట్టు కనబడుతోంది. ప్రాకృత వ్యాకరణాలననుసరించి లాఘవ సంపాదనా దృష్టితో చేసిన ఈతత్సమాది విభజన మన భాషకు అతకడంలేదని భాషా చారిత్రికులు భావించడంలోని ఆంతర్యం ఇట్టిదికూడా కావచ్చు.

తులనాత్మకంగా పరిశీలించి వివిధ భాషల ప్రభావాలను నిరూపించడంలో చేసిన ఇటువంటి నిర్ణయాల వల్లా, ప్రతిపాదనలవల్లా, పూర్వ లాక్షణికులకు వచ్చే అగౌరవం ఏది లేదనడం అందరూ అంగీకరించే విషయమే.

# ప్రకీర్ణ విషయావళి

ప్రత్యేక పరిచ్ఛేదాలుగా విభజించడానికి అవసరమయినంత విస్తృతిలేని ఆయా విషయాలను ఈ విభాగంలో పొందుపరచడం జరిగింది.

*క్రియా ధాతుః :*

లాఘవంకోసమూ లేదా స్పష్ట ప్రతిపత్తికీ స్వతంత్రంగా సంజ్ఞలను కల్పించుకొనే అధికారం ప్రతిలాక్షణికుడికీ ఉంటుంది. పాణిని ఇలా నదీ విష్ఠాది సంజ్ఞలను కొన్నింటిని కల్పించుకున్నాడు. ఆతడు కల్పించిన సంజ్ఞలు చాలక లేదా వాటిని స్వీకరించడానికి ఇష్టపడక అనంతర లాక్షణికులు మరికొన్ని సంజ్ఞలను కల్పించుకోవడం జరిగింది.

| | |
|---|---|
| క్త క్తవతు తః। | (1–1–28) |
| సంజ్ఞా ఖుః। | (1–1–29) |
| భావ కర్మ జిః। | (1–1–30) |
| శ ధమ్। | (1–1–31) |

ఇత్యాదికాలన్నీ జైనేంద్ర వ్యాకరణంలో కనబడుతున్న స్వతంత్ర సంజ్ఞలు.
వాల్మీకి/త్రివిక్రమ ప్రాకృత వ్యాకరణంలో

| | |
|---|---|
| దీర్ఘర ధఖః। | (1—3) |
| ఆదిః ఖుః। | (1—5) |
| ద్వితీయః పుః। | (1—7) |

ఇత్యాదిగా ఎన్నో స్వతంత్ర సంజ్ఞలు కనబడుతున్నాయి. తెలుగు వ్యాకరణాలలోనూ పరుష సరళ ద్రుతాది స్వతంత్ర సంజ్ఞలు కొన్ని ఉన్నాయి.

ద్విత్వాన్ని "ద్విః" అనడం ప్రాకృత కల్పతరువులో కనబడుతోంది.

"నీడాదిత్వాత్ ద్విః। యుతే హ్రస్వః।" (1–1–13, పుట–5). మండ లక్ష్మీ నరసింహాచార్యుల "ద్విర్ద్విత్వస్య" (ఆంధ్ర కౌముది–40) అనే విధానం స్వకపోల కల్పితమే అనలేము. (ఆంధ్ర వ్యాకరణ వికాసము–ద్వితీయ, పుట–81).

లాక్షణికులకుగల ఈ స్వతంత్ర సంజ్ఞా పరికల్పనా స్వాతంత్ర్యాన్ని అనుసరించి ఆంధ్ర శబ్ద చింతామణి "క్రియా ధాతుః" (సంజ్ఞా—26) అనే సంజ్ఞను ఏర్పరచడమూ "ఉపకృతి పరిణతి సంవృతి భేదాత్ త్రివిధా క్రియా" (క్రియా–1) అని ఆ సంజ్ఞను ఉపయోగించడమూ జరిగింది. అయితే ఈ "క్రియా" అనే పదం పని అనే అర్థాన్ని బోధిస్తోంది కానీ పాణినీయం ప్రకారం తిజంతమయిన పదాన్ని "క్రియ" అనడం జరుగుతోంది. కాగా ఈతడు ధాతువునకే ఆ సంజ్ఞను నియమించడం విశేషం. దీనివల్ల అనవసరమయిన అస్పష్టత కొంత ఏర్పడినమాట వాస్తవమే. ఒకానొక సంజ్ఞికి బోధకంగా సుప్రసిద్ధమయిన సంజ్ఞా పదాన్ని తదితర సంజ్ఞి బోధకంగా ఆంధ్ర శబ్ద చింతామణి నియమించడం గమనింపదగిన విశేషం. సంజ్ఞా సామ్యమేగానీ సంజ్ఞి సామ్యం లేదు.

జైనేంద్రుడు ఏర్పరచిన "ఖు" సంజ్ఞనే వాల్మీకి/త్రివిక్రముడు స్వీకరించడం జరిగింది. అయితే దానిచేత "సంజ్ఞా శబ్ద వాచ్యో అర్థః ఖు సంజ్ఞో భవతి" అనే అర్థాన్ని జైనేంద్రుడు ఉద్దేశించగా (పుట—18) "ఆదిః ఖు సంజ్ఞః స్యాత్" అనే సంజ్ఞిని ప్రాకృత వ్యాకర్త అభిలషించడం జరిగింది. వీటిలో సంజ్ఞా సామ్యమే కానీ సంజ్ఞి సామ్యం లేనేలేదు.

త్రిమాత్రా కాలికమయిన ప్లుతాన్ని వృద్ధ సంజ్ఞతో వ్యవహరించడం ఋక్తంత్రంలో కనబడుతోంది. "త్రిస్రో వృద్ధమ్" (2–5–4) అనేది విధాయకం. ఇదే సంజ్ఞా పదాన్ని పాణిని స్వీకరించి "వృద్ధిర్యస్యాచామాదిః తద్వృద్ధమ్" (1–1–73)–యస్య సముదాయస్య అచాం మధ్యే ఆదిః వృద్ధిః తత్ వృద్ధసంజ్ఞం స్యాత్. (వృత్తి బాలమనోరమా–ద్వితీయ–పుట–75)–అని విధించడమూ "వృద్ధాచ్ఛః" (4–2–14) అని ఉపయోగించడమూ జరిగింది. ఇక్కడకూడా సంజ్ఞా సామ్యమే కానీ సంజ్ఞి

సామ్యం లేదు. "యథోద్దేశం సంజ్ఞా పరిభాషమ్" (పరిభాషేందు—2) అనేది ఇటువంటి సంజ్ఞల యథోద్దేశ పక్షానికి సమర్థకమైన పరిభాష.

ఈ ప్రసిద్ధ సంప్రదాయాన్ని ఆంధ్ర శబ్ద చింతామణి అనుసరించింది అని భావింపవచ్చు.

## సూత్రోక్తి సామ్యం

ఆంధ్ర శబ్ద చింతామణి, బాల వ్యాకరణాలలోని కొన్ని సూత్రాలు సంస్కృత ప్రాకృత వ్యాకరణాలలోని ఏయే సూత్రాలను స్ఫురింపజేస్తున్నాయో పరిశోధకులూ వ్యాఖ్యాతలూ నిరూపించడం జరిగింది.

చిన్నయసూరి "ధాతువునకు" (బా.వ్యా. క్రియా—1) అనే సూత్రం దగ్గర "ఇది యధికార సూత్రంబు . ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగునని యెఱుంగునది" అని ఒక వ్యాఖ్య రచించాడు. ఇది హేమచంద్రుని వాక్యాన్ని స్ఫురింపజేస్తోంది–

సంయుక్తస్య.। (8-2-1)
అధికారోఽయమ్।
జ్యాయామీత్ (8-2-115) ఇతి యావత్.
యదిత ఊర్ధ్వం అనుక్రమిష్యామః
తత్ సంయుక్తస్య ఇతి వేదితవ్యమ్। (హైమం, పుట-41)

ఇందులో "అనుక్రమిష్యామః" అనేది "ఉపక్రమింపంబడు"గా మారింది. ఈ ఔపసర్గికమయిన భేదమే తప్ప ఇది యథాతథానువాదమే.

పాణినీయానికి స్వర పాఠం ఉన్నది కాబట్టి "స్వరితేనాధికారః" (1-3-11) అనే నిర్వచనం మేరకు స్వరిత స్వరంలో ఉచ్చరింపబడినది అధికారమై అనంతర విధులలోకి అన్వయించడం జరిగింది. ఆ స్వరపాఠం మరుగయిన కాలానికి ఏది

అధికారమో తెలియని స్థితి వచ్చింది. అప్పుడు వ్యాఖ్యాతలు "అధికారోఽయమ్" అంటూ వివరించడం జరిగింది. ప్రాకృతాంధ్ర వ్యాకరణాలకు స్వర పాఠం ఆదినుంచీ లేదు కాబట్టి తత్కర్తలకే ఏది అధికారమో నిర్వచించుకోవలసిన అవసరం ఏర్పడింది అనంతర విధులకు అన్వయ సంగతిని కలిగించడమే అధికార సూత్రానికిగల చారితార్థ్యం.

ద్వివచనం లేక పోవడమూ, చతుర్థికి మారుగా షష్ఠీ విభక్తి ప్రచురంగా ఉండడమూ, కారక ప్రయోగంలో సంస్కృత భాషకు లేని స్వేచ్ఛను తాము కలిగి ఉండడమూ అనేవి ప్రాకృతాంధ్రాలకు కనబడుతున్న పోలికలు. ఇవి స్వాభావికాలో యాదృచ్ఛికాలో కావచ్చుగాక। కానీ వీటి విధానంలో ప్రాకృత వ్యాకరణోక్తులకూ ఆంధ్ర లాక్షణికోక్తులకూ సామ్యం గమనింపదగినది[1].

1 ద్వివచనస్య బహువచనం (ప్రాకృత ప్రకాశః, 5-63)
సుపాం తిఙాం చ విభక్తీనాం సంబంధినో ద్వివచనస్య
త్యాదేః బహువచనం ప్రాదిశ్యతే.

(సదానంద, ప్రాకృత చంద్రికా, పుట—18)

చతుర్థ్యాః షష్ఠీ। (ప్రాకృత ప్రకాశః, 6 — 64)
(క్వచిన్నతాదర్థ్యే)

2. ద్విత్వం బహుత్వేన।
షష్ఠీవచ్చతుర్థీ। (ప్రాకృత లక్షణమ్, సూ—15, 16)

3. ద్వివచనస్య బహువచనమ్ (8-3-130)
చతుర్థ్యాః షష్ఠీ (8-3-131)

---

1. గంగాధరాది సమాసాలకు లౌకిక విగ్రహంలో ద్వితీయార్థక షష్ఠీ వినియోగం అవసరమవుతోంది. "ధరతీతి ధరః, గంగాయాః ధరః గంగాధరః— ద్వితీయార్థే షష్ఠీ।"

సర్వాసాం విభక్తీనాం స్యాదీనాం త్యాదీనాం చ
ద్వివచనస్య స్థానే బహువచనం భవతి. (హైమం, పుట_94, 95)

4. ద్విత్వే అపి బహువచనమ్ (5_1)
చతుర్థ్యాః షష్ఠీ తాదర్థ్యే (5_2)
(పురుషోత్తమ, ప్రాకృతానుశాసనం, పుట_158)

5. న సుప్ తిఙాం ద్విత్వమిహ ప్రయోజ్యం।
తథా చతుర్థీ న కదాచిదేవ॥
ద్విత్వే బహుత్వం పరియోజనీయం।
షష్ఠీ చతుర్థ్యామపి యోజనీయా॥
(ప్రాకృత కల్పతరుః, 1-6 1, పుట-26)

6. ద్వివచనస్య బహువచనమ్. (వాల్మీకి/త్రివిక్రమ, 1_8)
స్వాదీనాం తిబాదీనాం చ ద్వివచనస్య బహువచనం భవతి.
(ప్రాకృత రూపావతారః, పుట-7)

వీటిని ఈ ఆంధ్ర లాక్షణికోక్తులతో సరిపోల్చవచ్చు.

1. ద్వివచనము లేదు తెలుఁగునఁ
బ్రవిమల గతి నేకవచన బహువచనములొఁ
దివిచెద ననఁ దివిచెద మనఁ
గవి యనఁ గవు లనఁగఁగ్రియలు_కారకఫణితిన్.
(ఛందో దర్పణము, 4__115)

2. తెలుగుం బ్రాకృత భంగిన
బలియుటచే నేకవచన బహువచన పదం
బుల కాని ద్వివచనంబులు
గలుగవు తత్క్రియలం గారకంబులయందున్.

(కావ్యాలంకార చూడామణి, 9_72)

3. చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱచుగా ప్రయోగంబులంగానంబడియెడి.

(బా. వ్యా. కారక—8)

ఇలాగే "సప్తమ్యాః తృతీయా ఆర్షే।" (చండ—18),
ప్రథమాయాః తృతీయా ఆర్షే। (చండ 17)
ద్వితీయా తృతీయయోః సప్తమీ। (హైమం-8-3-135)
పంచమ్యాః తృతీయా చ। (హైమం_8_3_136)
సప్తమ్యాః ద్వితీయా (హైమం, 8-3_137) ఇత్యాది

సూత్రాలతో విధింపబడిన కారక విపర్యయం బాల వ్యాకరణంలోని కారక సూత్ర రచనను స్ఫురింపజేస్తోంది. ఇది కాకతాళీయమయినా కావచ్చు.

## అనువృత్తి వైయర్థ్యం :

పాణినీయాన్ని ఆదర్శంగా పెట్టుకొని సూత్ర బద్ధంగా వ్యాకరణ రచన చేసిన ప్రాకృతాంధ్ర వ్యాకర్తలు అధికారానువృత్త్యపకర్షా సంప్రదాయాలను అనుసరించడం జరిగింది. వరరుచి—చండుడు—హేమ చంద్రుడు—వాల్మీకి త్రివిక్రముడు_వీరు ఆ కోవకు చెందినవారు వీరు ఈ సంప్రదాయాన్ని అనుసరించి సూత్ర రచనలో అల్పాక్షరతను సంపాదించారు. కానీ వీరిలో ఈ సంప్రదాయాలను వైయర్థ్యం లేకుండా నడిపించినవారు లేరంటే అత్యుక్తి కానేరదు.

వరరుచి తన ప్రాకృత ప్రకాశంలో ద్వితీయపరిచ్ఛేదాన్ని "అయుక్తస్యానాదౌ" అనే అధికార సూత్రంతో ప్రారంభించాడు.

అధికార స్త్వయు క్తస్యే
త్యపరిచ్ఛేద పూరణాత్।
అనాదావితి చాదేర్యో
జ ఇత్యస్మాత్ విధేః పురా॥

అని దీనిని కాత్యాయనుడు "ఆదేర్యోజః" (2_29) అనే సూత్రం వరకూ మాత్రమే అధికారమని నియమించాడు. "ఆదేర్యోజః" అనే సూత్రం వల్ల పదాదియందున్న అసంయుక్త యకారానికి జకారం ఆదేశంగా విధింపబడింది. ఇది "అనాదౌ" అనే మాటకు వ్యతిరేకం. అందుకని పై అధికార సూత్రాన్ని ఇంతవరకూ మాత్రమే నియమించి పై యర్థ్యావృత్తిని తొలగించాడు_ఈ ప్రాకృత మంజరీ కర్త. భామహుడు ఈ మార్గాన్ని అందిపుచ్చుకొని "అయుక్తస్యేత్యా పరిచ్ఛేద పమాప్తేః। అనాదావితి చ ఆజకార విధానాత్" (పుట_28) అని వ్యాఖ్యానించాడు. కానీ ఈ వ్యాఖ్యవల్ల "సన్ని యోగ శిష్టానామ్ అన్యతరస్యాపాయే ఉభయోరప్యపాయః" (పరి_86, పుట—170) అనే పాణినీయ పరిభాష బాధితమవుతోంది.

"అనుస్వారస్య యయి పరసవర్ణః" (8_4-58) అనే సూత్రం నుంచి అభిన్నమయిన సవర్ణపదాన్ని "ఉదః స్థాస్తంభోః పూర్వస్య" (8_4_61) అనే సూత్రంలోకి అనువర్తింపజేశారు కాబట్టి పాణినీయులే సన్నియోగశిష్ట పరిభాషను పాటింపలేదని అహోబల పండితుడు ప్రతిపాదించాడు. (కవిశిరో భూషణమ్, పుట_233) "క్వచి దేకదేశోఽప్యనువర్తతే" అనే పరిభాషకూడా పాణినీయులే కదా ప్రతిపాదించినది (పరి_18, పుట_34). అందుచేతనే భామహుడు పై విధంగా వ్యాఖ్యానించడం జరిగిఉంటుంది.

ఈ ప్రాకృత ప్రకాశికా తృతీయ పరిచ్ఛేదంలో "యుక్తస్య" అనేది తొమ్మిదవ సూత్రం. అది అధికార సూత్రంగా వ్యాఖ్యాతమయ్యింది. "సేవాదిషు చ" (3-56) అనే సూత్ర సందర్భంలో—

సేవాదిషు శబ్దేషు
విభాషా ద్విత్వముచ్యతే।
సేవా_సెవ్వా, తథా సేఅ,
నఖో_ణక్ఖో, ణహో తథా॥

యుక్తస్యేత్యధికారేఽస్మిన్
సేవాదిష్వితి శాసనాత్।
అయుక్తాక్షర సంబంధాత్
న యుక్తమితి శంకతే॥

రాత్రి దీర్ఘాదయః శబ్దాః
యుక్తాక్షర సమన్వితాః।
సేవాదిష్వపి సంత్యేవ
తేనాదోషోఽత్ర శాసనే॥

అనే శ్లోకాలు ప్రాకృత మంజరిలో కనబడుతున్నాయి. సేవాది గణంలో అసంయుక్తాక్షరాలకే ద్విత్వ విధానం జరిగింది. మరి ఇది "యుక్తస్య" అనే అధికారంలోనిది గదా! అంటే_సేవాది గణంలో రాత్రి_దీర్ఘాది శబ్దాలు కొన్ని సంయుక్తాక్షర సమన్వితాలు ఉన్నాయికాబట్టి అధికారానికి పైయర్థాపత్తి లేదని సమాధానం.

ద్వితీయ పరిచ్ఛేదంనుండి "అనాదౌ" అనే మాట ఈ పరిచ్ఛేదంలోకికూడా అనువర్తిస్తోంది. అందుకనే తృతీయ పరిచ్ఛేదంలో తొమ్మిదినుండి నలభైతొమ్మిది వరకూగల సూత్రాలతో విధింపబడిన ఆదేశాలు ఆదిమ వర్ణాలకు సంభవించడం లేదు. కాగా, "శేషాదేశయోః ద్విత్వమనాదౌ" (3-50) అనే సూత్రంలో "అనాదౌ" అనే మాట ఉపయుక్తమయ్యింది. దీని పైయర్థాన్నిగురించి వ్యాఖ్యాత లెవ్వరూ ప్రస్తావించినట్టు కనబడదు. "ఉపరి లోపః క_గ_డ_త_ద_ప_ష_సామ్" (3_1) అనే తొలి సూత్రంలోకి ఈ యాభయ్యవ సూత్రంలోని "అనాదౌ" అనేమాట అపకృష్టమవుతుంది అనైనా వ్యాఖ్యాతలు ఇద్దరూ చెప్పలేదు.

ఆలాగే సంధి పరిచ్ఛేదంలో "సంధావచామ్ అజ్లోప విశేషా బహులమ్" అనేది మొదటి సూత్రం. ఇందులోని బహుళ పదం అనంతర సూత్రాలలోకి అనువృత్తం అవుతోంది. కాగా మూడవ సూత్రంలో (కాలాయసే యస్య వా) 'వా' పదం ఉపాత్తమయ్యింది. బహుళ పదానువృత్తితో ఈ అర్థం లభిస్తున్నా వా పదోప లబ్ధివి దీనిని—

కాలాయసే యకారస్య
విభాషా లోప ఉచ్యతే।
కాలాయసం తు కాలాసం
పక్షే కాలాఅసం మతమ్॥

ప్రాకృత మంజరీ కర్త విభాషగా వ్యవస్థితం చేశాడు. ఆటుపైని "అన్త్య హలః", అనేది ఆరవ సూత్రం. దీనికి ప్రాకృత మంజరీ వ్యాఖ్యా శ్లోకం ఇలా ఉంది—

పదాంతస్య హలో లోపః
శబ్దే శబ్దే విధీయతే।
అత్ర వేత్యధికారశ్చ
నివృత్తః తదన్యథా పునః॥

'వా' పదాను వృత్తికి నివారకమేదీ ఈ సూత్రంలో లేదు. పైగా "వేత్యధికారశ్చ" అనడాన్ని బట్టి అనువృత్తికీ అధికారానికీ గల పాణినీయమయిన భేదాన్ని ఈతడు పాటింపలేదని భావింప వలసి వస్తోంది. అధికారం అనువృత్తి కావచ్చునుగానీ అను వృత్తులన్నీ అధికారాలు కావుగదా।

హేమచంద్రుడు తన సిద్ధ హేమ శబ్దాను శాసనంలో ఎనిమిదవ అధ్యాయాన్ని ప్రాకృత వ్యాకరణంగా నిబద్ధించాడు. "అథ ప్రాకృతమ్" (8-1) అనేది మొట్టమొదటి సూత్రం. "బహులమ్ ఇత్యధికృతమ్ వేదితవ్యమ్ ఆశాస్త్ర సమాప్తేః" అని మొత్తం ఈ ప్రాకృత వ్యాకరణమంతా బహుళాధికారంలోదే అని వ్యాఖ్య

నించాడు. (స్వోపజ్ఞ వృత్తి - ప్రకాశికా) అటుపైని ఎన్ని "వా" పదాలున్నాయో లెక్కపెట్టలేం!

పదయోః సంధిర్వా। (8_1_5)

ధనుషో వా। (8_1_22)

వా స్వరే మశ్చ। (8_1_24)

ఇలా ఈ ఎనిమిదవ అధ్యాయం ప్రథమ పాదంలో 63_65_66_67_68-వరస సూత్రాలలో 'వా' పదాలు కనబడుతున్నాయి. అన్నిచోట్లా దీనిని వ్యవస్థితం చెయ్యడంగానీ విశేష ప్రయోజనాన్ని చెప్పడంగానీ జరిగలేదు. అనంతరానంతర సూత్రాలలో అనువృత్తి నివృత్తికాలూ లేవు.

చండుని ప్రాకృత లక్షణంలో కూడా అధికార సూత్రానువృత్తికి వైయర్థ్యం కనబడుతోంది. వ్యంజనాదేశ విధానాలు రూపించబడిన తృతీయ పరిచ్ఛేదంలో "అసంయోగస్య" (సూ_10) అనే సూత్రం దగ్గర "అత ఊర్ధ్వం యే వ్యంజనాదేశాః తే అసంయోగస్య భవన్తి" అని వృత్తిని రచించాడు అటుపైని_

"హ_జ_థానాం రణ (న) ఖాః — (3-11) అనే సూత్రంతో జ్ఞానం-ణాణం, ఆజ్ఞా—ఆణా, స్థంభః—ఖంభో, అనే రూపాలలో సంయుక్తాక్షరానికి (జ్ఞ—ణ, స్థ—ఖ) ఆదేశాలను సాదించడం జరిగింది.

"గరహాణాం ఘణఝాః" (3-22) అనే సూత్రంతో వాహ్యః—వజ్ఝో అనే లక్ష్యంలో సంయుక్తాక్షరానికి ఆదేశం విధింపబడింది.

'మడహానాం వలభాః' (3_23) అనే సూత్రం జిహ్వా-జిబ్భా అనే రూపాన్ని సాధిస్తోంది. ఇలా అధికార సూత్రానువృత్తికి వైయర్థ్యం కనబడుతోంది.

అతి విస్తృత మయిన పరిధిలో అసంఖ్యాకమయిన ప్రజల నాల్కలపై నాట్యం చేస్తున్న ప్రాకృత భారతిని సూత్రాలతో బంధించడానికి వీలుకాక వ్యాకర్తలు పడిన శ్రమకూ పరిశ్రమకూ ఇటువంటివి నిదర్శనాలుగా నిలుస్తాయి. ప్రాకృత వ్యాకరణాలలో

నిత్యప్రవృత్తి ఉన్న సూత్రాలు అత్యల్పంగా కనబడతాయి_అసలు లేనే లేవన్నా అతిశయోక్తి కానేరదు. వ్యవహార విస్తృతి అంతటిది కాగా పాణినీయ_అధికారాను వృత్తి__ప్రణాళికకు ప్రాకృత వ్యాకరణాలు కొన్నింట సమ్యఙ్నిర్వహణం జరగలేదు అనడం సారాంశం.

ఆంధ్ర శబ్ద చింతామణి ఈ అనువృత్తి అపకర్షల ప్రణాళికను అనుసరించి నట్లు అహోబల పండితుని వ్యాఖ్యానాలనుబట్టి తెలుస్తోంది "వాతః" (సంధి—2) అనే సూత్రంనుండి వా శబ్దానువృత్తి అభిస్తూండగా "అనాదిషు విభక్తిషూతో వా" (సంధి—3) అనే సూత్రంలో మళ్ళీ "వా" శబ్దోపాదానం వ్యర్థమవుతోంది. దీనిని ఆశంకించి "అత్ర వా శబ్దః సముచ్చయార్థే. పూర్వ సూత్రాదేవ వికల్పార్థక వాశబ్దాను వృత్తేః". (కవిశిరోభూషణమ్, పుట—230) అని సముచ్చయార్థకంగా అహోబల పండితుడు సమన్వయించాడు. ఛందోబద్ధమయిన లక్షణ గ్రంథాలలో ఇటువంటివి తప్పవు.

చిన్నయసూరి తన తొలి వ్యాకరణాలలో ఈ ప్రణాళికను అనుసరించినా బాల వ్యాకరణంలో దీనిని వదలిపెట్టడం జరిగింది ఇందులో ఇంచుమించు అన్ని సూత్రాలూ స్వయం సంపూర్ణాలు. క్రియాపరిచ్ఛేదంలో "ధాతువునకు" అనేది అధికార సూత్రంగా నిబద్ధించి ఆ ప్రణాళికను పాణిని మునీంద్రునంతటి సామర్థ్యంతోనూ నిర్వహించాడు.

## *చాంద్ర పరిభాషలు :*

పాణినీయ సంప్రదాయాన్నిబట్టి చూచినప్పుడు కొన్ని ప్రాకృతాంధ్ర వ్యాకరణాలలో అధికారాను వృత్తులకు ఇలా కొంత వైయర్థ్యం స్ఫురిస్తున్నా, చాంద్ర వ్యాకరణ పరిభాషలనుబట్టి చూచినప్పుడు వీటి వైయర్థ్యం ఆభాస మాత్రంగా కూడా కనబడద

1. ఇష్టే తదధికారాణాం ప్రవృత్తి నివృత్తీ।
2. కార్యానుబంధాత్ అధికారానువృత్తిః।
3. భిన్న సంబంధే ప్రతియోగే ప్రతిఘాతే చ
   అధికారాణాం నివృత్తిః।

ఇవి మూడూ అధికారానువృత్తికి సంబంధించిన చాంద్ర పరిభాషా సూత్రాలు (చాంద్ర వ్యాకరణమ్—ద్వితీయ, పుటలు—396 నుంచి 398). వీటినిబట్టి అధికార సూత్రానువృత్తి నివృత్తులకు ఇష్టరూప సాధనంలో ఏర్పడిన ఆవశ్యకత అనావశ్యకత తప్ప మరొక హేతువేమీ అవసరం లేదని స్పష్టపడుతోంది.

ఇష్టరూప సిద్ధికి వ్యవస్థితవిభాషా పద్ధతిని చిన్నయసూరికూడా అనుసరించాడు. (బా. వ్యా సంధి—18, వివరణ—37) "వ్యవస్థిత విభాషయా యోగవిభాగాద్వా ఇష్ట సిద్ధిః" అనేది చాంద్ర పరిభాష. "యోగ విభాగాత్ ఇష్ట సిద్ధిః" (పరి–114, పుట–191), "వ్యవస్థిత విభాషయా అపి కార్యాణి క్రియంతే" (పరి—99, పుట–182) అనేవి పరిభాషేందు శేఖరంలోని వచనాలు.

"కృతాకృత ప్రసంగో విధిర్నిత్యః" అనే చాంద్ర పరిభాషా సూత్రాన్ని చిన్నయసూరి యథాతథంగా పొందుపరచాడు. (బా. వ్యా. క్రియా–50) "క్వచిత్ కృతాకృత ప్రసంగమాత్రేణాపి నిత్యతా" అనేది నాగోజీ భట్టుని పరిభాషేందు శేఖరంలోని మాట. (పరి—46, పుట—74). చిన్నయసూరి మాటకు పోలికలో సాన్నిహిత్యం చాంద్రంతోనే.

పాణినీయంలోని-వా-వికల్ప–విభాషా-అన్యతరస్యామ్ పదాలకు మౌలికంగా కొంత భేదం ఉన్నా స్థూలదృష్టికి సామ్యం అధికంగా కనబడుతుంది. ఆంధ్ర శబ్ద చింతామణి, సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము—ఈ నాలుగు పదాలనూ ఉపయోగించాయి.

ఏదంతతా చ నామ్నామన్యతరస్యామియాంతానామ్।

(ఆం. శ. చిం, అజంత—81)

ఋగ్రువుకావన్యతరస్యామ్।

(సూత్రాంధ్ర వ్యాకరణం, అచ్చిక—105)

తక్కిన వా—వికల్ప — విభాషా — పదాల వాడుక సుప్రసిద్ధమే. "వా" "అన్యతరస్యామ్" పదాలు తెలుగుభాషలో జరిగిన సూత్ర నిర్మాణంలో అతకవుకాబట్టి బాలవ్యాకరణంలో వీటిని పరిత్యజించడం జరిగింది. "వా–అన్యత రస్యామ్" పదాలు తెలుగు వ్యాకరణాలలో ఉపయోగింపబడలేదని పరిశోధకులు

కొందరు అనడంలోని అంతర్యం_తెలుగుభాషలో రచింపబడిన వ్యాకరణాలలో ఉపయోగింపబడలేదు-అనడంగా గ్రహించాలి.

వైయాకరణులు శబ్ద నిత్యత్వ వాదులు. సూత్ర విహితమయిన కార్యం ఒకసారి జరగడం మరొకసారి జరగక పోవడంవల్ల ఏర్పడిన ద్వైరూప్యం (న వేతి విభాషా) ఒక ప్రాంతంలో ఒకరూపం, మరొక ప్రాంతంలో మరొక రూపం, ఉండడంగా పర్యవసిస్తుంది ఆంధ్ర వైయాకరణులు "ఒకానొకచో" "కొందరు" అనే పదాలను విరివిగా ఉపయోగించడాన్ని "ప్రాచామ్—ఉదీచామ్" అనే పాణినీయాలతో సరిపోల్చవచ్చు. (ప్రాచామవృద్ధాత్ ఫిన్ బహులమ్—4-1-160, ఉదీచామాఙః-3-4-19, అరగుదీచామ్—4-1-30).

## ప్రాయః = బహులమ్ :

"ప్రాయః" పదాన్ని బహుళ పద పర్యాయంగా ప్రాకృత మంజరి వ్యాఖ్యానించింది.

"క_గ_చ-జ-త-ద-ప_య-వాం ప్రాయో లోపః" (ప్రాకృతప్రకాశ, 2_2)

బహులం ప్రాయ ఇత్యుక్తం<br>
ప్రాయః కాత్యాయనేన వై।<br>
యథా చిహ్నాది చోలోపే<br>
న ప్రతిజ్ఞా విరుధ్యతామ్॥

ప్రాయ ఇత్యస్య శబ్దస్య<br>
బహులార్థత్వ విశ్రమాత్।<br>
శ్రుతి స్వారస్య వైరస్యే<br>
లోపాలోప నియామకే॥

ఆంధ్ర శబ్ద చింతామణిలోని "ప్రాయస్తు స్యాత్ కిమాదికస్యేతః" (సంధి-9) అనే సూత్రం దగ్గర ప్రాయః పదాన్ని అహోబలుడుకూడా బహుళ పద పర్యాయం గానే వ్యాఖ్యానించాడు. (కవిశిరోభూషణమ్, పుట-235)

*విభక్తి విపరిణామం.*

సూత్రంలో ఉన్న పదాల విభక్తులను రూప సాధనానుకూలతకోసం అన్య విభక్తులుగా పరిణమింపజేయడం ప్రాకృత వ్యాకరణ వ్యాఖ్యాతలలోకూడా అరుదుగా కనబడుతోంది.

1. హింతో త్తో దో దుర ఙసిస్। (వాల్మీకి/త్రివిక్రమ, 2-2-6)

అత్ర ఙసిస్ ఇతి సుబ్వ్యత్యయేన షష్ఠ్యర్థే ప్రథమా।

(షడ్భాషా చంద్రిక)

2. అతో డో విసర్గః। (వాల్మీకి త్రివిక్రమ, 7-28)

అదంతాత్ విసర్గస్య డో స్యాత్। తలోపః। సవ్వో ఇత్యాది।

(షడ్భాషా వివరణమ్, పుట-99)

ఇందులో ఇతడు "విసర్గః" అనే ప్రథమాంతాన్ని "విసర్గస్య" అని షష్ఠ్యంతంగా పరిణమింపజేశాడు.

ప్రాకృత రూపావతార కర్త యుక్తిగా ఇక్కడ విభక్తి విపరిణామం చెయ్య వలసిన అవసరాన్ని తప్పించుకున్నాడు—

"అకారాత్పరో విసర్గో డో ఆదేశమాపద్యతే"। (పుట-31).

కాదాచిత్కంగా కనబడుతున్న ఈ విపరిణామ సంప్రదాయాన్ని అహోబలుడు "న్నుమ్మూ హ్రస్వాచ్ఛదే రమి శసి చ" (ఆం. శ. చిం. హలంత-15) అనే సూత్రం దగ్గర అనుసరించి అమి-శసి అనే సప్తమ్యంతాలను అమః-శసః అవి షష్ఠ్యంతాలుగా పరిణమింపజేసి "నన్నున్-మమ్మున్"అనే రూపాలను సాధించాడు.

(కవిశిరోభూషణమ్, పుట—467). ఇక్కడ వ్యాకరణ సంహితా సర్వస్వం మరొక విధానాన్ని అవలంబించింది. (వ జిల, పుట—880)

బాలవ్యాకరణంలో క్రియా పరిచ్ఛేదంలోని సూత్రాలకు "ధాతువునకు" అనే షష్ఠ్యంతాధికార సూత్రంతో అన్వయాన్ని చెప్పేటప్పుడు కొన్ని చోట్ల విభక్తి విపరిణామం అవసరమవుతోంది "ఇ ఉ ఋ ల కించుక్కు పరంబగునపుడు అయుగవు గరుక్కులగు" (క్రియా—64) అనే సూత్రంలో ఇ ఉ ఋలకు అనే బహుపద ద్వంద్వ సమాసం షష్ఠ్యంతంగా ఉంది. "ధాతువునకు" అనే షష్ఠ్యంతం అనువృత్తమవుతోంది. ఈ షష్ఠ్యంతాన్ని "ధాతువునందు" అని సప్తమ్యంతంగా పరిణమింపజేయాలి. ఇంచుక్పరత్వాన్ని నిమిత్తంగా చెబుతున్నాడుకాబట్టి ధాతువునందంతమందున్న ఇ ఉ ఋలకు అయుగవుగరుక్కులు ఆగమం అవుతాయనే అర్థం లభిస్తుంది. విశేషణ విశేష్య భావం లేదుకాబట్టి రెండూ షష్ఠ్యంతాలుగానే ఉంచే అన్వయం కుదరదు. అందుచేత విభక్తి విపరిణామమే స్పష్ట ప్రతిపత్తికి సులభమయిన మార్గంగా కనబడుతోంది.

"అనుదాత్త జిత ఆత్మనే పదమ్" (1–3–12) అనే సూత్రంలోకి "భూవాదయో ధాతవః" అనే సూత్రంనుంచి "ధాతవః" అనే ప్రథమాంతం అనువృత్తమవుతోంది. దానిని పంచమిగా పరిణమింపజేసుకుని "అనుదాత్తేతః, ఉపదేశే యో జిత్ తదంతాచ్చ ధాతోః లస్య స్థానే ఆత్మనేపదం స్యాత్' అని పాణినీయులు అన్వయం చెప్పుకున్నారు. (బాలమనోరమా, తృతీయ, పుట—4)

"తస్మాదిత్యుత్తరస్య" (1–1–67) అనే పాణినీయ పరిభాషను బాలవ్యాకరణం పాటింపలేదు. కేవలం ప్రత్యయాలనూ, ఆగమాదేశాలనూ అన్నింటినీ షష్ఠ్యంత నిర్దేశంతోనే విధించింది. 'పుంలింగంబగు మహద్వాచకంబునకు డుజ్జగు" (బా.వ్యా. తత్సమ—22) ఇత్యాదిగా అంతటా షష్ఠ్యంత నిర్దేశాలే కనబడుతున్నాయి. "పుంలింగంబగు మహద్వాచకంబునకంటె డుజ్జగు" ఇత్యాదిగా పంచమ్యంత నిర్దేశాలు తెలుగు నుడికారానికి పొసగవు. కాబట్టే "సంధిరానిచోట స్వరంబు కంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు" అనే సూత్రంలో పంచమ్యంత నిర్దేశంతో ఆగకుండా "పరంబయిన" అనే దళాన్నికూడా చేర్చాడు. నిజానికి ఈ మాట లేకపోయినా వివక్షితార్థ స్ఫూర్తికి అభ్యంతరం లేదు. పరశబ్దాన్ని ఉపయోగించకుండా పంచమితోనే

తదర్థాన్ని సంపాదించే ఆంధ్రశబ్ద చింతామణి (దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్ సుజసో॰—) యశ్రుతి విధాయక సూత్రంలో ప్రాణతః పరం ప్రాణం అని పరశబ్దాన్ని ప్రయోగించడం ఈ తెలుగు నుడికారపు ప్రభావంవల్లనే కావచ్చు.

డుజాదుల విషయంలో ఇవి ప్రత్యయాలు కాబట్టి షష్ఠ్యంత నిర్దేశాలవల్ల వచ్చే ప్రమాదం లేకపోయినా ఆగమాదేశ విధానాలలో వైరుద్ధ్యం ఏర్పడే అవకాశం అధికంగా ఉంది. దానిని వారించడంకోసం తన బాలవ్యాకరణం లోని ఆగమాలకన్నింటికీ—నుగాగమం—టుగాగమం — దుగాగమం — అంటూ ఆగమపదాన్ని అనుసంధించాడు.

"ఇ ఉ ఋ లకించుక్కు పరంబగునపుడు అయుగవుగరుక్కులగు" (బా.వ్యా. క్రియా—64) అనే సూత్రంలో ఆయుక్—అవుక్—అరుక్ అనేవి "ఇ—ఉ—ఋలకు" అనే షష్ఠ్యంత నిర్దేశంతో విధింపబడ్డాయి. కాబట్టి ఆదేశాలేమో అనే సందేహం కలుగుతుంది. కానీ ఆగమపదం లేకపోయినా వీటిచివరి కిత్త్వమే ఆగమత్వానికి సంకేతం.

"విర్జినామంబులకు అయుగాగమంబు కలుగదు" (బా. వ్యా. క్రియా. 65) అనే అనంతర సూత్రంలో వీటిని ఆగమాలుగా స్పష్టపరచాడు ఇలా ఆయా ఆగమ విధాయకాలలో పంచమ్యంత నిర్దేశం చేయవలసి ఉన్నప్పటికీ ఆంధ్ర భాషా స్వభావాన్ని అనుసరించి షష్ఠ్యంత నిర్దేశమే చేసినా అస్పష్టతకుగానీ అనిష్టాప్తికిగానీ అవకాశం లేకుండా చిన్నయసూరి జాగరూకత వహించాడు.

### సర్వత్ర యనుట :

"డుమంతంబునకు ద్వితీయాద్యేక వచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు" (బా. వ్యా. తత్సమ—23) అనే సూత్రం దగ్గర "సర్వత్ర యనుట నగాగమ బాధనార్థంబని యెఱుంగునది" అని చిన్నయసూరి ఒక వివరణ వాక్యాన్ని పొందుపరచాడు. "కువర్ణకంబు పరంబగునపుడు ఉకార ఋకారంబులకు నగాగమంబగు" (తత్సమ—28) అనే సూత్రంచేత నిత్యంగా ప్రాప్తిస్తున్న నగాగమాన్ని వారించడంకోసం ఈ సర్వత్ర అనే పదం అవసరమయ్యిందని అతని తాత్పర్యం. వ్యాఖ్యాతలూ ఇంతే వివరించారు. నిగాగమ విధానం వైకల్పికం. కాబట్టి నిగాగమం రానప్పుడు నిత్యంగా నగాగమం వచ్చి "రామునికిన్-రామునకున్" ఇత్యాదిగా

ఇష్ట రూప సిద్ధి కలుగుతూనే ఉందిగదా అనవచ్చు. కానీ నిగాగమ విధాయక సూత్రం ఔత్సర్గికం. తద్బాధక మయిన నగామ విధాయక సూత్రం విశేష విధి "సకృద్బాధితో విధిః బాధిత ఏవ" (కాశకృత్స్నం_94, పుట—69) "విశేష విధి. సామాన్యాత్" (చాంద్రం, పుటలు—396 నుండి 398) అనే కాశకృత్స్న చాంద్ర పరిభాషలమేరకు కువర్ణక పరత్వంలో నగాగమం మాత్రమే వచ్చి నిగాగమం రాకపోవలసి వస్తోంది. అందుకని తన్నివారకంగా సర్వత్ర పదాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది. రామునియందున్-రామునందున్ అనే రూపద్వయ సిద్ధికికూడా సర్వత్ర అనడమే సాధకం. "సర్వత్రోదోతోః వుర్భవతి ముపత్" (అం. శ. చిం. అజంత—43) "ఉకారాంత గో శబ్దంబుల కంతట వు వర్ణకంబగు" (బా. వ్యా. తత్సమ_48) అనే చోట్లకూడా ఇదేవిధంగా (సర్వత్ర-అంతట) భావింపవచ్చు.

"క్వచిదపవాద విషయేఽపి ఉత్సర్గః" (పరి-58, పుట-141) అనే పాణినీయ పరిభాషను అనుసరించినా ఇక్కడ రూపద్వయం సిద్ధిస్తుంది. (రామునికిన్_రామునకున్) కానీ ఈ పరిభాష "ప్రదీయతాం దాశరథాయ మైథిలీ" (మహానాటకం, సప్తమాంకం; శ్లో_ఎనిమిది—పది) వంటి క్వాచిత్క ప్రయోగాలకు సాధుతాసంపాదనకై ఏర్పడినది. (విశేషమయిన ఇఞ్ బదులు ఔత్సర్గికమయిన అణ్ చేసి, దాశరథిః అనడానికి బదులుగా దాశరథః—దాశరథాయ అనడం). కానీ తెలుగులో నిగాగమ—నగాగమ రూపాలకు అధిక ప్రాచుర్యం ఉంది. అందుచేతనే ఈ పరిభాషతో సమన్వయాన్ని అంగీకరింపక "సర్వత్ర" పదాన్ని ప్రవేశపెట్టి చిన్నయసూరి సుస్పష్టతనుకూడా సాధించాడు.

తద్ధిత పరిచ్ఛేదంలో "ఇట విశేషంబు ఉత్సర్గంబునకు విభాషను బాధకంబగు" (బా వ్యా. తద్ధిత_2) అని సూత్రించడం "వాసరూపో అస్త్రియామ్" (3_1_94) అనే పాణినీయానికి సుదూరానుకరణం కావచ్చు

సురాదేః :

"స్త్రీత్వ బహుంతే సురాదే రసమాసే" అనే ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రంలో "సురాదేః" అనేచోట "సురాది గణ పఠిత శబ్దాలకు" అనే అర్థం చెప్పడానికి అవకాశాలు తక్కువగా ఉన్నాయి. "సురలు" అన్నట్టుగా స్త్రీత్వ బహుత్వాలను

వ్యస్త స్థితిలో నిత్యంగా పొందుతున్న మరొక తత్సమ శబ్దమేదీ భాషలో కనబడడం లేదు అందుచేత "సురాదేః" అనే మాటకు—సుర అనునది పూర్వ పదమైయున్న శబ్దమునకు—(ఆది భూతాత్ సుర శబ్దాత్) అని అర్థం చెప్పాలని ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వం ప్రతిపాదించింది. (పుట-599). దానివల్ల మరికొన్ని విశేష ప్రయోజనాలనుకూడా తత్కర్త భావించడం జరిగింది. "లఘ్వేకాక్షర పూర్వక్రియేత్యాది క్రియా పరిచ్ఛేద సూత్రమునందును నిల్పె అసమస్త క్రియ యనుటకుమాఱుగా పూర్వ క్రియ యని భట్టారకుఁడు వ్యవహరించెను" అని తమ ప్రతిపాదనకు ప్రమాణాంతరాన్నికూడా వీరు చూపించారు.

## కాశకృత్స్న సంప్రదాయం :

"డానుబంధే స్వరాదేర్లోపః" (సూ_24, పుట_44) అనేది కాశకృత్స్నంలోని సూత్రం. ఇందులో "స్వరాదేః" అనే పదాన్ని పై రీతిలోనే వ్యాఖ్యాతలు సమన్వయించారు.

> దకారానుబంధవతి ప్రత్యయే పరతః అంత్యః
> స్వరః ఆదిః యస్య తత్ సముదాయస్య లోపో భవతి।
> తేన మేధృ+అ ఇత్యత్ర ఋకారస్య లోపే
> మేధ్+అ_మేధా ఇతిరూపం సిద్ధమ్॥ (పుట_44)

ఇల్లాగే "అంత్యస్వరాదేః లోపో గుణశ్చ నామీనామ్" (సూ_136) అనే సూత్రంలోకూడా "అంత్య స్వరాదేః" అనే పదానికి సమన్వయం చూపడం జరిగింది.

ఈ యుధిష్ఠిర మీమాంసకుల వ్యాఖ్య చ (చె) న్నవీరకవి కృత కర్ణాటక టీకకు సంస్కృతీకరణం. ఈ వ్యాఖ్యా సంప్రదాయాన్ని శ్రీ వజ్ఝలవారు ప్రస్తావించి యుండలేదు కాగా కాశకృత్స్నం దక్షిణ భారతంలో ప్రసిద్ధమే అనడానికి చెన్నవీర కవి వ్యాఖ్యానమే నిదర్శనం. అయితే వజ్ఝలవారి ఈ వ్యాఖ్య ఆంధ్ర శబ్ద చింతామణి కర్తకు ఉద్దిష్టమే అని విశ్వసించిన పక్షంలో దీనిని కాశకృత్స్న ప్రభావంగా పరిగణింపవచ్చు.

అలరు బోఁడి .

"బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబు మీఁది మేనునకు బోఁడి యగు". (బా. వ్యా. సమాస—23) అనే సూత్రంలో చిన్నయసూరి 'పోఁడి'ని ఆదేశించాడా? 'బోఁడి'ని ఆదేశించాడా? దానికి ముందు బిందువు ఉన్నట్టా? లేనట్టా? ఇత్యాదికమయిన చర్చలు చాలా జరిగాయి ప్రౌఢవ్యాకర్త దీనిని 'పోఁడిమి' శబ్దానికి సంక్షిప్త రూపంగా భావించి కర్మధారయంగా సమన్వయించాడు. "దీనికి పువ్వువలె మనోజ్ఞురాలైనది అని అర్థము" అని పేర్కొన్నాడు. (ప్రౌఢవ్యాకరణం సమాస—19)

అలరుబోఁడి . పువ్వుబోఁడి" ఇత్యాది సమాసాలు స్త్రీ శరీర సౌకుమార్య ద్యోతకాలు. కాబట్టి మేను శబ్దానికి పోఁడినో బోఁడినో ఆదేశించడం జరిగింది. ప్రౌఢ వ్యాకర్త చేసిన సమన్వయంలో కవిజనోద్దిష్టమయిన శరీర సౌకుమార్య స్ఫూర్తి కనబడడం లేదు.

ఉపమానం మేనునా స్త్రియామ్,
ఉపమానాత్ మేనోర్బోడిః స్త్రియామ్। (సమాస-28)

బహువ్రీహి నుపమానంబు మీఁద
మేనునకు స్త్రీత్వంబున బోఁడియగు। (ప్రకీర్ణ—41)

అనేవి వరసగా చిన్నయసూరి సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణ, ఆంధ్ర శబ్దానుశాసనాలలోని సూత్రాలు. తెలుగు సూత్రాలలో బోఁడికి ముందు అరసున్న ఉన్నదా లేదా అనే మీమాంసకు కచ్చితమయిన సమాధానం దొరకక పోవచ్చునుగాక। సంస్కృత సూత్రంలో అది కచ్చితంగా "బోఁడి" అనే రూపంతో కనబడుతోంది. "పోఁడి" కనుక అయినట్టయితే ''మేనోః'' అనే విసర్గం రేఫగా మారదు. ఉపక్మౌ

నీయంగా ఉండాలి. కాబట్టి సూరి అభిలషించినది మేను శబ్దానికి "బోఁడి" అనే నరంశాది పదాదేశమే. (దువ్వూరి_రమణీయ వ్యాఖ్య).

*బొంది - బోఁడి :*

తెలుగు ప్రజల వ్యవహారంలో "బొందితో కైలాసం వెళ్ళడం" అనే లోకోక్తి ఒకటి బహుళ ప్రచారంలో ఉంది. ఇక్కడ "బొంది' అనే మాటకు శరీరము అనే అర్థం సశరీర స్వర్గావాప్తికి తెలుగుసేత ఈ లోకోక్తి. ఈ అర్థసామ్యాన్ని పురస్కరించుకొని, 'బొంది' శబ్దమే 'బోఁడి'గా మారింది అని భావింపవచ్చు.

దకారం డకారంగా మారడం అచ్ఛిక పదాలలో చాలావాటిలో కనబడుతోంది. "కేచిత్తు వైకృతాః శబ్దాః డాదిత్వేనైవ సాధవః" (అజంత—63), "క్వచిత్తోదః క్వచిడ్డోణః దృష్టో దస్తు క్వచిచ్ఛ్రుతః" (కవిశిరోభూషణం, పుట—433) అనే వికృతి వివేకోక్తులుకూడా దీనికి ప్రమాణం. కాండము (వృక్ష శరీరము) అనే అర్థంలో తాటిబొండు—తాటి బోలు, ఈత బొండు, అరటి బోద ఇత్యాదికమయిన వ్యవహారంకూడా తెలుగునాట నోటా నోటా సుప్రసిద్ధం.

బొంది పదంలోని పూర్ణానుస్వారం ఉచ్చారణ భ్రష్టమై లోపపూర్తి కోసం ప్రథమాచ్చు దీర్ఘాన్ని పొంది బోఁడు—బోఁడి—బోలు అనే రూపాంతరాలు క్రమ క్రమంగా ఏర్పడి ఉండవచ్చు.

ఈ ప్రకారం "బోఁడి" అనేది శరీర పర్యాయమే అవుతుంది. "అలరు బోఁడి—పువ్వు బోఁడి" ఇత్యాదులలో అప్పుడు కవిజనాభీష్టమయిన కాంతా శరీర సౌకుమార్య స్ఫూర్తి లభిస్తూనే ఉంటుంది. బహువ్రీహి సమాసత సుసంగతమవుతోంది. సరళాక్షర పరత్వంలో ద్రుతానికి క్వాచిత్క పూర్ణబిందు స్థితి అంగీకరింపబడినదే కాబట్టి (బా. వ్యా. సంధి—19) "అలరుంబోఁడి" వంటి రూపాలు అవైయాకరణాలు కానేరవు. సమాసాలలో ఉదంత స్త్రీ సమాలకు సరళ వర్ణ పరత్వంలో కూడా నుగాగమాన్ని బాలవ్యాకరణం అంగీకరించింది. (బా. వ్యా. సంధి—25). కాగా "తీయంబోఁడి" వంటి రూపాలలో పూర్ణబిందువు సాధ్యం కాదు. వీటికోసమే

ప్రౌఢ వ్యాకర్త "ఎల్లయెడల" నుగాగమాన్ని (నుమ్) విధించడం జరిగిందిగదా।
(ప్రౌఢవ్యాకరణం. సమాస—19)[1]

తంత్రోచ్చారణ :

పాణినీయంలో "శేషాద్విభాషా" (8—4—154) అనే సూత్రంలో విభాషా పదం రెండు అర్థాలను బోధిస్తోంది. అనుక్త సమాసాంతాత్, శేషాధికారస్థాత్, బహువ్రీహేః కబ్వా స్యాత్" అనే వృత్తిలో దీక్షితులవారు రెండు అర్థాలనూ వివరించారు. "తంత్రాదినా శేష శబ్దో అర్థ ద్వయ పరః" అనే మాటకూడా వారిదే. (బాల మనోరమా—ద్వితీయ—పుట—599). దీనికి బాలమనోరమా వివరణం ఇలా ఉంది—

ఏకమనేకోపయోగి తంత్రమ్. ఉచ్చారయిత్రా తంత్రేణ
ఉచ్చారితాత్ శబ్దాత్ ఆవృత్త్యార్థ బోధ ఇతి బోధ్యమ్.

బాలవ్యాకరణంలో ఈ తంత్రోచ్చారణ సంప్రదాయం ఒకచోట అవసరమవుతోంది. క్రియా పరిచ్ఛేదంలో "డుజ్—రు, వు—రు, ను—ముఙ్" అనే ప్రత్యయాలను చెప్పి అనంతరం "వానిలో రుములు బహువచనంబులు, పెఱలేక వచనంబులు" (క్రియా—10) అన్నాడు. "రు—ములు" అంటే ప్రథమ-మధ్యమ-ఉత్తమ పురుష బహువచన ప్రత్యయాలు నిర్దిష్టాలయ్యాయి. రెండు 'రు'లకు బదులు ఒకే 'రు'ను ఉచ్చరించాడు. దీనిని తంత్రోచ్చారణం అనవచ్చు. రు—రు—ము లు బహువచన ప్రత్యయాలు అనే అర్థం లభిస్తుంది.

---

1. బొంది శబ్ద రూపాంతరం బోండి కావచ్చుననే ఈ ప్రతిపాదనను మాగురువర్యులు కీ. శే. కె.వి.ఎన్. అప్పారావుగారు తరగతిలో ఒకసారి ఎప్పుడో మా ముందు ఉంచారు. వారు దీనిని వ్యాసరూపంగా ప్రకటించినట్టు ఎక్కడా కనబడలేదు. ఈ ఊహ వారిది. కాగా ఈ ప్రతిపాదనను ఇంకా పరిశీలింపవలసి ఉన్నదనీ, ఇప్పుడే అంగీకరించడానికి లేదనీ మా పర్యవేక్షక గురువర్యులు ఆచార్య తూమాటి దొణప్పగారు అంటున్నారు.

రు—రు లకు అర్థభేదం ఉన్నప్పటికీ రూప సామ్యం ఉంది కాబట్టి ఏకశేష చేసి అటుపైని ము వర్ణకంతో ద్వంద్వంగా దీనిని సమన్వయించే సంప్రదాయం సుప్రసిద్ధంగా ఉంది.

## సిద్ధము - సాధ్యము :

సాంస్కృతికాచ్ఛిక మిశ్ర భేదాలతో తెలుగులోని సమాసానికి త్రైవిధ్యాన్ని ప్రతిపాదించిన చిన్నయసూరి "అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు. కేవల సంస్కృత శబ్దంబుల సమాసంబు సిద్ధంబు నాఁబడు. రాజాజ్ఞ— తటాకోదకము—లక్ష్మీవల్లభుఁడు. సంస్కృత సమంబుల సమాసంబు సాధ్యంబు. రాజునాజ్ఞ—తటాకంబునుదకంబు—లక్ష్మి వల్లభుఁడు" అని వివరించడం జరిగింది. (బా.వ్యా. సమాస—2)

సంస్కృత వ్యాకరణ నియమాల ప్రకారం ఏర్పడిన సమాసాన్ని ప్రాతిపది కంగా స్వీకరించి తెలుగు విభక్తులు చేరిస్తే అది సిద్ధ సాంస్కృతికమవుతుంది. ఏ పదానికి ఆ పదం తత్సమాలుగా చేసుకొని తెలుగు వ్యాకరణ నియమాలను అనుసరించి సమాసం కడితే అది సాధ్య సాంస్కృతికమవుతోంది. ప్రత్యేకంగా ప్రాతిపదికలు నిల్చి అవి తెలుగు విభక్తులతో (తత్సమ) పదాలయ్యి అటుపైని సమసిస్తున్నాయి.

తద్భవ రూపాలను సాధించే సందర్భంలో ప్రాకృత వ్యాకరణ వ్యాఖ్యానాల్లో కొన్నింట సిద్ధావస్థ—సాధ్యావస్థ అనే భేదాలు కనబడుతున్నాయి.

1. అనుక్తమన్యశబ్దానుశాసనవత్. (వాల్మీకి/త్రివిక్రమ, 1_1_2)

   ...... తద్భవా సంస్కృత భవా. సా చ

   ప్రకృతిభూతస్య సంస్కృతస్య సిద్ధావస్థాపేక్షయా

   సాధ్యావస్థాపేక్షయా చ జాయమానత్వాత్ సిద్ధా

   సాధ్యాచేతి ద్వివిధా భవతి. ద్వివిధాయా అపి

సిద్ధ్యర్థం ఇదం శాస్త్రం ఆరబ్ధవ్యమ్. సిద్ధావస్థయా
జాయమానం రూపం సాధ్యావస్థయా జాయమానం
రూపం చ యథా దర్శనం దర్శయిష్యామః (షడ్భాషా చంద్రికా, పుట_4)

2. అథ ప్రాతిపదికావస్థాయామేవ కేషాంచిత్ ప్రక్రియా
విశేషః ప్రదర్శ్యతే. దర్శనమ్. మనస్వినీ. అతిముక్తకమ్.
(ప్రాకృత రూపావతారః, పుట_47)

3. షడ్భాషా వివరణంలో :

ఎ. దధి+సు ఇతి స్థితే_"మట్ లుకా"__దహిం__దహిమ. సిద్ధావస్థయా
దహి ఇత్యపి. దహిని ఇత్యాది కవివత్. (పుట_42)

బి. సిద్ధావస్థయా అస్తు ఇత్యస్య అద్ధు. సంతు ఇతి
బహువచనస్య జ్ఞేయమ్. (పుట—110)

సి. వీరమాద్యాదేశైః, సిద్ధావస్థయా చ ధాతు రూపాణి
జ్ఞేయాని అథ భావ కర్మాణి. (పుట—114)

ప్రాకృత వ్యాకరణాలన్నింటిలోనూ ప్రణాళికలో ఒక సామ్యం కనబడుతోంది. ప్రాకృత భాషలోని తద్భవ రూపాలను ప్రకృతి ప్రత్యయ విభాగం చేసి ఈ వ్యాకరణాలు ప్రదర్శించాయి. ముందు ప్రకృతులలో జరుగుతున్న వర్ణ వికారాలను స్వరవిధానం-అసంయుక్తాదేశ విధానం సంయుక్తాదేశ విధానం—ఇలా విభజించారు. అటుపైవి ప్రాకృతీయాలయిన నామ విభక్తులను, క్రియా విభక్తులను, కృత్తులను, తద్ధితలను—ఇత్యాది ప్రత్యయాలను విధించారు. వీటిని అన్నింటినీ ఆయా సంస్కృత వ్యాకరణ ప్రోక్త ప్రత్యయాల స్థానంలోనే ఆదేశాలుగా చెప్పుకొన్నారు.

ప్రాకృతాలకు మాత్రమే పరిమితమయిన కొన్ని స్వతంత్ర ప్రత్యయాలు కూడా లేక పోలేదు. (విద్యుత్ పీతాభ్యాం లః—4—26, "స్వార్థే లప్రత్యయో విద్యుత్పీ తాభ్యాం పరతో భవేత్. విజ్జుళా వా అథవా విజ్జూ, పీఅళం పీఅమేవ చ", ప్రాకృత మంజరీ.) ఇవన్నీ కలిసి ప్రాకృతీయ ప్రత్యయాలు అవుతున్నాయి. వర్ణ వికృతులతో

ప్రకృతిని స్వీకరించి, దానికి ప్రాకృత ప్రత్యయాలను చేర్చడం ద్వారా ఏర్పడిన ఈ తద్భవ రూప సాధనను వీరంతా సాధ్యావస్థగా భావించారు. అలా కాక, సంస్కృత వ్యాకరణ నియమాల ప్రకారం సంస్కృతంలో ఏర్పడిన సుబంత రూపాన్ని ఆయా వర్ణ వికృతులతో తద్భవంగా స్వీకరించడాన్ని సిద్ధావస్థగా వీరు భావించారు

'దధి' అనే ప్రాతిపదికలో ధకారం "ఖ ఘ థ ధ భాం హః" (ప్రాకృత ప్రకాశః 2_27) అనే నియమం ప్రకారం హకారంగా మారుతుంది. 'దహి' అవుతుంది. ఇది ప్రకృతికి చేసిన సంస్కారం. దీనిపైని ప్రథమైకవచనంలో "సోర్బిందుర్నపుంసకే" (ప్రాకృత ప్రకాశః 5_30) అనే సూత్రం ప్రకారం బిందువు వస్తుంది. దానిని సుస్థానంలో విధించడం ప్రథమైక వచనతా స్ఫూర్తికోసమే. "న నపుంసకే" (5_25) అనే నిషేధం ఉండడంచేత "ఆదీతౌ బహులమ్" (5-24) అనే దీర్ఘం రాలేదు "దహిం" అనే రూపం ఇలా ప్రాకృత ప్రకాశ సూత్రాలతో ఏర్పడుతోంది. ఇటువంటివి సాధ్య తద్భవాలు.

నపుంసక లింగం కాబట్టి సంస్కృతంలో "దధి" అనేది (దధి_దధినీ_దధీని) ప్రథమైక వచనాంతమయిన పదం. దీనిలో ధకారాన్ని హకారంగా మార్చుకొని (2-27) "దహి" అనే రూపాన్ని తద్భవంగా ప్రాకృతంలో ప్రయోగించుకోవచ్చు. ప్రాతిపదికనుండి కాక సంస్కృత వ్యాకరణ సిద్ధమయిన సుబంతంనుండి వర్ణవికృతితో లభించిన రూపం కాబట్టి ఇట్టివి సిద్ధ తద్భవాలు.

వ్యస్త పదాలకు ప్రాకృత వ్యాకరణాలలో కనబడుతున్న ఈ సిద్ధావస్థా సాధ్యావస్థా విభాగాన్ని ఆంధ్ర లాక్షణికులు సమస్త పదాలకు అనువర్తింపజేసినట్టుగా తలంపవచ్చు.

కాగా సమాసాంతర్వర్తి పదాలకు వాక్య విభక్త్య పేక్షతో భిన్న పదత్వాన్ని యథావసరంగా అంగీకరించడం అర్వాచీన ప్రాకృత వ్యాకరణాలలో కొన్నింట కనబడుతున్న విశేషం.

1. హైమం, 8_1—11, 8—1—177.
   సమాసే తు వాక్య విభక్త్యపేక్షయా భిన్న పదత్వమపి
   వివక్ష్యతే—27, (పుట)

2. త్రివిక్రమ వృత్తిః 1_1_25.
3. షడ్భాషా చంద్రికా, 1_4_91.
4. ప్రాకృత మణిదీపః, 1_3_8, పుట_22.
5. షడ్భాషా వివరణమ్, పుట_41.

ఈ సంప్రదాయాన్ని ఆంధ్ర లాక్షణికులెవ్వరూ పరిగ్రహించినట్టు కనబడదం లేదు. అహోబలుని కవిశిరోభూషణ వ్యాఖ్యానంమీద షడ్భాషా చంద్రికా ప్రభావం ఎక్కువగా ఉంది. పాతంజలాన్ని ఆదర్శంగా పెట్టుకొని వీరిద్దరూ వ్యాఖ్యలు రచించినట్టు కనబడుతున్నారు. అహోబలుడుకూడా ఈ భిన్న పదత్వాంగీకార సంప్రదాయాన్ని పరిగ్రహింప లేదు. అవసరపడక పోవడమే కారణమై ఉండవచ్చు.

"ఎల్లన్ శిష్యులు" :

సర్వపర్యాయమయిన 'ఎల్లన్' అనే పదాన్ని చిన్నయసూరి ద్రుతాంతమయిన అవ్యయంగా భావించాడు దీనికి అసమాసంలో విశేష్యానికి ముందు ప్రయోగం కూడా లేదని వివరించాడు. (బా. వ్యా. సంధి—24)

"ఎల్లయందున్" (భారత_ఆది. 2_159). "ఎల్లన్ శిష్యులంగొంచు వత్తునో" (భీమ ఖండం, 1_120) అనే ప్రయోగాలను చూపించి ప్రౌఢ వ్యాకరణకర్త పై సూరి అభిప్రాయాన్ని కాదన్నాడు.

> సర్వ పర్యాయంబయిన యెల్ల శబ్దంబునకు సప్తమియు
> నసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబునుం
> జూపబ్టెడు. (ప్రౌఢ వ్యాకరణం, సంధి—7)

"ఎల్లయందున్" అనే ప్రయోగంలో సప్తమీ విభక్తి ప్రత్యయం కనబడు తోంది కాబట్టి 'ఎల్లన్' అనే దానిని అవ్యయంగా భావించడానికి వీలులేదని ప్రౌఢ వ్యాకర్త ఆశయం.

"అందున్" అనేది సప్తమీ ప్రత్యయం మాత్రమే కాకుండా 'తత్ర' అనే మాటకు పర్యాయంగా స్వతంత్ర ప్రయోగార్హమయిన పదంకూడా ఒకటి భాషలో

ఉంది. "సాశ్రయా నాశ్రయాపి స్యాత్ తత్రార్థగత సప్తమీ" (కవిశిరో భూషణం, అజంత—పుట–310) అనే ఆధర్వణికాన్నిబట్టి పై విషయం నిరూపితమవుతోంది. "వనముునందున్" ఇత్యాదులలోనిది ప్రత్యయమనీ, "అందున్నాడు" ఇత్యాదులలోనిది స్వతంత్ర పదమనీ భావింపబడుతోంది.

"ఎల్లన్" అనే అవ్యయానికి 'అందున్' అనే స్వతంత్ర పదంతో సమాసాన్ని చేసినందువల్ల "ఎల్లయందున్" అనే రూపం ఏర్పడుతుంది. కాబట్టి ఈ ప్రయోగాన్ని బట్టి 'ఎల్లన్' అనేది అవ్యయం కాదు అని నిర్ణయించడానికి అవకాశంలేదనీ, అందు చేత దీనిని అవ్యయంగా భావించిన చిన్నయసూరిని తప్పుపట్టవలసిన అవసరం లేదనీ వ్యాఖ్యాతలు కొందరు భావించారు. (బా. వ్యా. తత్త్వబోధిని)

ఇక్కడ 'అందున్' అనే దానికి 'ఎల్లన్' అనేదానితో సాశ్రయత్వం స్పష్టంగా కనబడుతోంది కాబట్టి దీనిని సమాసం అనడానికి వీలు లేదనీ, ఇది సప్తమ్యంత పదమే అనీ మరికొందరు భావించారు.

'ఎల్లయందు' అనుచోట అందు శబ్దము విభక్తియే కాని ప్రత్యేక పదము కాదు. ప్రత్యేక పదమన్న పక్షమున—ఎల్లన్+అందు=ఎల్లనందు అని కావలసియుండును. ఎల్లయందు కాదు. కాగా ఎల్లయందు—సప్తమీ విభక్త్యంతమే యని గ్రహింప వలెను "—ఇది పై వారి అభిప్రాయము. (ప్రౌఢ వ్యాకరణం, ఘంటా పథం, పుట—291)

'ఎల్లన్' అనే పదానికి తత్రార్థకమయిన 'అందున్' అనే స్వతంత్ర పదంతో సమాసాన్ని వివక్షించినప్పుడు సామాసిక ద్రుత లోపం సంభవించి (బా. వ్యా. సంధి—24) యడాగమంతో "ఎల్లయందున్" అనే రూపం ఏర్పడకపోదు. కాబట్టి దీనిని సప్తమ్యంతమే అని నిర్ధారించడానికి అవకాశంలేదు.

కాగా 'ఎల్లయందున్' అనేది సమాసమే కాని పక్షంలో, "అసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబును లేదు" అన్నాడు కాబట్టి "అందెల్లన్" అని ఉండవలసి వస్తుందేకానీ, బాలవ్యాకరణం ప్రకారం "ఎల్లనందున్" అని ఉండే అవకాశమే లేదు.

ఉంది. "సాశ్రయా నాశ్రయాపి స్యాత్ తత్రార్థగత సప్తమీ" (కవిశిరో భూషణం, అజంత—పుట—310) అనే ఆధర్వణికాన్నిబట్టి పై విషయం నిరూపితమవుతోంది. "వనముసందున్" ఇత్యాదులలోనిది ప్రత్యయమనీ, "అందున్నాడు" ఇత్యాదులలోనిది స్వతంత్ర పదమనీ భావింపబడుతోంది.

"ఎల్లన్" అనే అవ్యయానికి 'అందున్' అనే స్వతంత్ర పదంతో సమాసాన్ని చేసినందువల్ల "ఎల్లయందున్" అనే రూపం ఏర్పడుతుంది. కాబట్టి ఈ ప్రయోగాన్ని బట్టి 'ఎల్లన్' అనేది అవ్యయం కాదు అని నిర్ణయించడానికి అవకాశంలేదనీ, అందు చేత దీనిని అవ్యయంగా భావించిన చిన్నయసూరిని తప్పుపట్టవలసిన అవసరం లేదనీ వ్యాఖ్యాతలు కొందరు భావించారు. (బా. వ్యా. తత్త్వబోధిని)

ఇక్కడ 'అందున్' అనే దానికి 'ఎల్లన్' అనేదానితో సాశ్రయత్వం స్పష్టంగా కనబడుతోంది కాబట్టి దీనిని సమాసం అనడానికి వీలు లేదనీ, ఇది సప్తమ్యంత పదమే అనీ మరికొందరు భావించారు.

'ఎల్లయందు' అనుచోట అందు శబ్దము విభక్తియే కాని ప్రత్యేక పదము కాదు. ప్రత్యేక పదమన్న పక్షమున—ఎల్లన్+అందు=ఎల్లనందు అని కావలసియుండును. ఎల్లయందు కాదు. కాగా ఎల్లయందు—సప్తమీ విభక్త్యంతమే యని గ్రహింప వలెను "—ఇది పై వారి అభిప్రాయము. (ప్రౌఢ వ్యాకరణం, ఘంటా పథం, పుట—291)

'ఎల్లన్' అనే పదానికి తత్రార్థకమయిన 'అందున్' అనే స్వతంత్ర పదంతో సమాసాన్ని వివక్షించినప్పుడు సామాసిక ద్రుత లోపం సంభవించి (బా. వ్యా. సంధి—24) యడాగమంతో "ఎల్లయందున్" అనే రూపం ఏర్పడకపోదు. కాబట్టి దీనిని సప్తమ్యంతమే అని నిర్ధారించడానికి అవకాశంలేదు.

కాగా 'ఎల్లయందున్' అనేది సమాసమే కాని పక్షంలో, "అసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబును లేదు" అన్నాడు కాబట్టి "అందెల్లన్" అని ఉండవలసి వస్తుందేకానీ, బాలవ్యాకరణం ప్రకారం "ఎల్లనందున్" అని ఉండే అవకాశమే లేదు.

అనేది చాలచోట్ల అన్వయ వివక్షలనుబట్టి మాత్రమే నిర్ధారింపవలసిన అంశమనడం సారాంశం.

శ్రీనాథ కవి ప్రయోగంలో ఎల్లన్ అనేది విశేషణమేనా? శిష్యులన్ అనేది విశేష్యమేనా? అనే సందేహాలు తీరాలంటే మొత్తం పద్యంలో వీటి అన్వయ విధానాన్నీ, ప్రాధాన్యాప్రాధాన్య వివక్షనూ చూడాలి.

తల్లీ! యిన్ని దినాల కేనియు సుధా
ధారా రస స్యందియై
యుల్లంబున్ బులకింపఁజేయు పలుకెల్లో
వింటి నివ్విటిలో,
పెల్లాకొన్న కతాన నేనొకఁడనే
భిక్షానకున్ వత్తునో?
యెల్లన్ శిష్యులఁగొంచు వత్తునా?
నిజంబేర్పాటుగాఁ దెల్పుమీ! (భీమఖండం, 2-120)

ఆ తల్లి భోజనానికి పిలిచింది. ఈయనగారు అడుగుతున్నాడు. నేను ఒక్కడనే రానా? శిష్యులను అందరినీ తీసుకొని రానా? వంటకాలు ఎంతమందికి సరిపడా తయారు చేసి వడ్డించ గలవు తల్లీ?—ఇదీ వ్యాసుని సందేహం. ఇక్కడ ఎంతమందిమి రాము? అనే దానికే ప్రాముఖ్యం. ఆ రాబోయేవారు అందరూ ఇతనికి శిష్యులా? సోదరులా? మరొకరా? ఇటువంటి పరామర్శలతో ప్రమేయంలేదు. శిష్యులయినా కావచ్చు, మరింకెవరయినా కావచ్చు. సంఖ్య ప్రధానం. కాబట్టి ఇక్కడ 'శిష్యులన్' అనే దానికన్నా 'ఎల్లన్' అనే దానికే ప్రాధాన్య వివక్ష. ఒక్కడనే రానా? అందరితోనూ రానా? అనేదే ఆశంక. ఈ మేరకు మొదటి ప్రశ్నలో 'ఒకడనే' అనే దానికీ, రెండవ ప్రశ్నలో 'ఎల్లన్' అనే దానికి విశేష్యత్వం సముపాత్తమవుతోంది. ఇది ఆర్థికమయిన వివక్ష. 'వత్తునో' అనే క్రియ ఉత్తమైక వచనంలో ఉంది కాబట్టి 'నేను' అనే దానికి కర్తృతా వివక్ష తావన్మాత్రమే. ఇది శాబ్దికమయిన వివక్ష. ఈ ఆర్థిక శాబ్దిక వివక్షా విధానాలను బట్టి చూచినప్పుడు 'ఎల్లన్' అనేది విశేష్యమే అవుతోంది. కాబట్టి సూరిమాటను కాదనవలసిన అవసరం ఏమాత్రమూ కనబడడంలేదు.

మరొక ప్రామాణిక ప్రయోగం లభించి ప్రౌఢ వ్యాకర్త చేసిన నవరణను. నిర్ధారించేటంతవరకూ వేచి చూడాలి. అటువంటిది మరొకటి మృగ్యమనుట.

తెలుగు వాక్యాలలో ఇటువంటి శాబ్దికాన్వయము ఆర్థికాన్వయము అనే వివక్ష, రాముడు వాడినేసిన బాణము ఇత్యాదులలో మరొక దిశలో అవసరమవుతోంది (కవిశిరో భూషణం, పుట_481, బా. వ్యా. సమాస—25).

## ఐకారంబీతుల్యంబు :

బాలవ్యాకరణ కర్త "ఐకారంబీతుల్యంబు" (తత్సమ_65) అని ఒక ప్రత్యేక విధానం చేశాడు. ఈ తౌల్య కథనంవల్ల రైనిన్-రైకిన్ ఇత్యాదులలో "ఇకారంబు మీఁది కు ను వు క్రియా విభక్త్యుయుత్త్వంబున కిత్త్వంబగు" (బా. వ్యా. తత్సమ_26) అనే సూత్రం వర్తించి, ఇత్త్వం సంప్రాప్తించడం ప్రయోజనంగా వ్యాఖ్యాతలు ప్రతిపాదించారు.

కానీ ఈ ఇత్త్వ సంప్రాప్తి "ఐకారంబు ఇతుల్యంబగు" అని హ్రస్వేకార తుల్యతా కథనం వల్లకూడా జరుగుతోంది కదా! దీర్ఘేకార తుల్యతా కథనం వల్ల ప్రత్యేక ప్రయోజన మేమిటి? మాత్రా గౌరవాన్ని పెంచడం తప్ప—అని ఒక ఆక్షేపం.

శబ్ద లక్షణ సంగ్రహంలో "ఐత్త్వంబిత్త్వతుల్యంబు" (తృతీయ_71) అని సూత్రించాడు. బాలవ్యాకరణంలో దీర్ఘంగా మార్పుచేశాడు. దీని ప్రయోజనమేమిటి? అనేది పైవారి అభిప్రాయం కావచ్చు.

సహేతూకంగా వృత్త గంధిగా సూత్ర రచన చేయడం చిన్నయసూరి ప్రత్యేకత. శబ్ద లక్షణ సంగ్రహంలో రెండింటినీ త్వప్రత్యయాంతాలుగా పొందుపరచడమూ, బాలవ్యాకరణంలో దీర్ఘీకరించడమూ (ఈతుల్యంబు) ఈతని సూత్ర రచనా శైలికీ, శ్రావ్యతకూ నిదర్శనాలు.

మరొక ప్రయోజనం కూడా లేక పోలేదు. ఇత్త్వతుల్యతా కథనంవల్ల ఐకారాన్ని ప్రారంభకులు (బాలురు) లఘువుగా భ్రమపడే ప్రమాదం ఉంది. దీనిని వారించడం

కోసం ఈతుల్యంబు అని దీర్ఘీకరించడం జరిగి ఉంటుంది. ఇది శబ్ద లక్షణ సంగ్రహానికి చేసిన మెరవడిగా భావించవచ్చు.

ఇత్త్వతుల్యతా కథనం వల్ల, బహువచన పరత్వంలో ఈ ఐకారం కూడా ఉత్త్వంగా మారవలసిన స్థితిని ఆశంకించి (బా.వ్యా తత్సమ_45) తన్నివారకంగా "ఈతుల్యంబు" అని చెప్పడం జరిగింది అనడానికి అశకాశం లేదు. లు—అ పరత్వంలో ఐకారం ఉకారంగా మారిన ప్రయోగాలు—వ్యవహారంలోకూడా—లేవు. ప్రయోగ శరణమయిన వ్యాకరణంలో ఇటువంటి ప్రయోజనాలను చెప్పడం సమంజసం కానేరదు. నిషేధం ఎప్పుడూ ప్రాప్తి పూర్వకమేనాయె. కాగా లఘుతా భ్రాంతి వారణమే ప్రధాన ప్రయోజనంగా—ఈ దీర్ఘీకరణకు—భావించడం సమంజసం.

## శాస్త్ర గ్రంథాలలో సరసోక్తులు :

వ్యాకరణాది శాస్త్ర గ్రంథాలలో రసానందం మృగ్యం. వీటి అధ్యయన—అధ్యాపనాలలో ఆనందమంటూ ఉన్నా అది సర్వాత్మనా కావ్యానందం వంటిదికాదు. పాండిత్య పీరాన్ని రస భేదంగా అంగీకరించిన పక్షంలో దీనికి కావ్యానంద సామ్యం సరిపడుతుంది. కాగా వీటి అధ్యయనానికి కావలసిన మానసిక స్థితీ, బుద్ధి పాటవమూ వేరు. "శాస్త్రేషు హీనాః కవయో భవంతి—" అనే సూక్తి ఏకదేశంలో చరితార్థం కాకపోదు. వేదశాస్త్ర ప్రతిపాదిత విషయాలనూ, ఆయా పురుషార్థాలనూ వేదశాస్త్రి—అధ్యయన పాటవం లేనివారికి పంచదార పూసి అందించడానికి ఆవిర్భవించింది కావ్య శాఖ. అందుచేత ఇందులోని రసానందం అందరికీ అందుబాటులోనిది కాగా, వేదశాస్త్రాధ్యయనాధ్యాపనాదులలోని ఆనందం కతిపయైక పరిమితం అవుతోంది. అనంతరానంతర కాలంలో పండిత కవుల సంఖ్య పెరిగి కావ్యాలలో శాస్త్రీయ భారం హెచ్చింది. ఆది కావ్యాలకన్నా అనంతర కావ్యాలలో ప్రసన్నత తగ్గింది. ఇలా తమ కావ్యాలపై అనవసరమయిన బరువును పడనీకుండా జాగరూకత వహించిన కవులు కూడా లేక పోలేదు. ఇది ఇలాఉండగా—

శాస్త్రాధ్యయనంలో విషయ క్లేశాన్ని బట్టి ఏర్పడే మానసిక గ్లానిని వారించడం కోసమో అన్నట్టు వ్యాకరణాది శాస్త్ర గ్రంథాలలోనూ కొన్నింట అక్కడక్కడా

సుకుమారమయిన హాస్య రసోక్తులు కనబడుతున్నాయి ఇటువంటి వాటికి అవి ఉన్న స్థానంలో ఒక చారితార్థ్యం ఉన్నప్పటికీ బుద్ధికి ఊరట కలిగించడమూ ఉల్లాస పరచడమూ అనేవికూడా ప్రధాన ప్రయోజనాలుగానే భావింపబడుతున్నాయి.

*పాతంజలంలో :*

గురు శిష్య సంభాషణాత్మకంగా సులభ శైలిలో సాగిన వ్యాకరణ మహా భాష్యంలో ఇంచుమించు ప్రతి సూత్ర వ్యాఖ్యలోనూ ఏదో ఒక లౌకిక దృష్టాంతమూ, ఏదో ఒక హాస్యోక్తి కనబడుతూనే ఉంటుంది.

కిరిణా, గిరిణా ఇత్యాదులలో అచ్చుల స్థితి అవృత్తితః సాధ్యమని ప్రతిపాదిస్తూ పస్పశాహ్నికంలో భాష్యకర్త సహస్ర గో దక్షిణను దృష్టాంతంగా చూపించాడు.

"ఏతదపి సిద్ధమ్।
కథమ్ ?
లోకతః।
తద్యథా—ఋషి సహస్రమేకాం కపిలాం ఏకైకశః
సహస్రకృత్వో దత్త్వా తయా సర్వే తే సహస్ర
దక్షిణాః సంపన్నాః। ఏవమిహాప్యనేకాచ్త్వం భవిష్యతి।

(భాష్యం, 1-1-2, పుట-68, ప్రథమ)

విత్తేన క్రీత్వా క్రీత్వా ప్రత్యేకం దత్త్వా దత్త్వా
సహస్ర దక్షిణా ఋషయః సంపన్నా ఇత్యర్థః। (ప్రదీపః)

వాక్యాలలో వివక్షననుసరించి సామాన్యం విశేషం కావచ్చు. విశేషం సామాన్యమూ కావచ్చు. ఈ విషయాన్ని స్పష్టపరచడానికి పితా పుత్రవత్త్వాన్ని ఉదాహరించాడు.

"—కృష్ణః సామాన్యమ్, గౌర్విశేషో భవతి।—
యదాస్య గౌః సామాన్యేన వివక్షితో భవతి కృష్ణో
విశేషత్వేన, తదా గౌః సామాన్యం కృష్ణః విశేషః।
యదాస్య కృష్ణః సామాన్యేన వివక్షితో భవతి గౌః విశేషత్వేన
వివక్షితః, తదా కృష్ణః సామాన్యమ్, గౌర్విశేషః।
అపర ఆహ। 'ప్రకల్పేతే చ"।
కథమ్?
పితా పుత్రవత్।
తద్యథా—స ఏవ కంచిత్ప్రతి పితా భవతి,
కంచిత్ప్రతి పుత్రో భవతి।
ఏవమిహాపి। స ఏవ కంచిత్ప్రతి సామాన్యం
కంచిత్ప్రతి విశేషః।" (భాష్యం, 1–1–9, పుట–360, ప్రథమ)

"సిద్ధే శబ్దార్థ సంబంధే—" అనే చోట వివిధాన్వయాలను చూపుతూ సాగించిన చర్చలో మట్టి ముద్దనూ బంగారు ముద్దనూ ప్రస్తావించాడు. ఈయన దృష్టిలో రెండూ సమానమే.

"అథవా ద్రవ్య ఏవ పదార్థే ఏష విగ్రహో న్యాయ్యః—
సిద్ధే—శబ్దే—అర్థే—సంబంధే చేతి। ద్రవ్యం హి నిత్యమ్।
ఆకృతిరనిత్యా।
కథం జ్ఞాయతే ?
ఏవం హి—దృశ్యతే లోకే మృత్ కయాచిదాకృత్యా యుక్తా
పిండో భవతి। పిండాకృతిముపమృద్య ఘటికాః క్రియన్తే।
ఘటికాకృతిముపమృద్య కుండికాః క్రియన్తే। తథా-
సువర్ణం కయాచిదాకృత్యా యుక్తం పిండో భవతి।
పిండాకృతిముపమృద్య కటకాః క్రియన్తే। కటకాకృతిముపమృద్య
స్వస్తికాః క్రియన్తే। పునరావృత్తః సువర్ణ పిండః

> ఏవమపరయాకృత్యా యుక్తః ఖదిరాంగార సవర్ణే కుండలే భవతః।
> ఆకృతిరన్యా చాన్యా చ భవతి।
> ద్రవ్యం పునస్తదేవ। ఆకృత్యుపమర్దేన ద్రవ్యమేవావశిష్యతే।
>
> (భాష్యం, 1-1-1, పుట-49, ప్రథమ)

"అజాదేర్ద్వితీయస్య" (6-1-2) అనే సూత్ర వ్యాఖ్యానంలో, "తత్ర పూర్వస్యాచో నివృత్తౌ వ్యంజనస్యానివృత్తిః శాసనాత్పూర్వస్య" అనే ఆక్షేప వారక వార్తికాన్ని ప్రస్తావించి, వ్యంజనాలకు స్వరాలతో సంబంధం ఎటువంటిదో తెలియ జేయడానికి ఒక సరసమయిన దృష్టాంతాన్ని పతంజలి మహర్షి ప్రతిపాదించాడు.

> తత్ర పూర్వస్యాచో నివృత్తౌ వ్యంజనస్యానివృత్తిః సిద్ధా।
> కుతః ?
> వ్యంజనాని పునః నట భార్యావత్ భవంతి।
> తద్యథా—నటానాం స్త్రియః రంగగతాః
> యోయః పృచ్ఛతి—"కస్య యూయం?
> కస్య యూయమ్?" ఇతి, తం తం "తవ తవ" ఇతి
> ఆహుః। ఏవం వ్యంజనాన్యపి యస్య యస్యాచః
> కార్యముచ్యతే, తం తం భజన్తే।"
>
> (భాష్యం, 6-1-1, పుట-374, ద్వితీయ)

"న మునే" (8-2-3) అనే సూత్ర వ్యాఖ్యలో అనేకార్థాలను ఒకే వాక్యంతో సంగ్రహింప వచ్చును అనడాన్ని ప్రతిపాదిస్తూ సావిత్రీవరంవంటి ఒక దృష్టాంతాన్ని చూపించాడు.

> " అథవా ద్విగతా అపి హేతవో భవంతి।
> తద్యథా—ఆమ్రాశ్చ సిక్తాః పితరశ్చ ప్రీణితాః భవన్తి।
> తథా వాక్యాన్యపి ద్విగతాని దృశ్యన్తే। శ్వేతో ధావతి,
> అలంబుసానాం యాతేతి।

అథవా వృద్ధ కుమారీ వచనవత్ ఇదం ద్రష్టవ్యమ్।
తద్యథా—వృద్ధ కుమారీ ఇంద్రేణోక్తా....
"వరం వృణీష్వ" ఇతి। సా వరం అవృణీత—

"పుత్రా మే బహుక్షీర ఘృతం ఓదనం కాంస్య పాత్ర్యాం
భుంజీరన్"ఇతి। న చ తావదస్యాః పతిర్భవతి,
కుతః పుత్రాః? కుతో గావః? కుతో ధాన్యం?।
తత్ర అనయా ఏతేన వాక్యేన, పతిః పుత్రాః గావః
ధాన్యం ఇతి సర్వం సంగృహీతం భవతి।
ఏవమిహాపి—" (భాష్యం, 8-2-1, పుట-362, తృతీయ)

ఇటువంటి ఎన్నో సరసోక్తులకు కాణయాచి ఈ మహాభాష్యం. వీటిలో కొన్నింటికి పౌనఃపున్యం కనబడుతోంది. అవసరపడడమే కాకుండా చమత్కృతి లౌలుప్యంకూడా దీనికి కారణం కావచ్చు. ఈ దృష్టాంతాలవల్ల ఆనాటి ఆచార వ్యవహారాలు, ఆభరణ స్వరూపాలు తెలియడమూ మొదలయిన అనుషంగిక ప్రయోజనాలు కూడా ఎన్నో నెరవేరుతున్నాయి.

*విసర్గ లిపి :*

విసర్గకు లేఖన చిహ్నాన్ని నిరూపించే శ్లోకం ఒకటి సుప్రసిద్ధంగా కనబడుతోంది. దానిలోని ఉపమానాలు తత్కర్తల హాస్య ప్రీతికీ సరసతకు తార్కాణాలుగా భాసిస్తున్నాయి.

శృంగవ ద్వాలవత్సస్య
బాలికా కుచ యుగ్మవత్।
నేత్రవత్ కృష్ణ సర్పస్య
విసర్గోఽయమితి స్మృతః॥

(ప్రాకృత లక్షణం, అథస్సూచిక, పుట—19)

లేదూడ కొమ్ముల్లాగా, బాలికా కుచయుగ్మంలాగా, కోడె త్రాచు కన్నుల్లాగా ఉంటుందిట విసర్గ లేఖనం. కాతంత్రానికి భావసేనుడు రచించిన రూపమాలా వ్యాఖ్యానంలోనూ ఈ శ్లోకం ఉదాహృతమయ్యింది. ఇందులో ఒకటి రెండూ ఉపమానాలు ప్రకృతి పరిశీలనకు నిదర్శనాలు. నిజానికి ఈ శ్లోకం ఏదో ఒక మహాకావ్యంలో ఉండవలసినదిగా కనబడుతోంది.

*శాంకరంలో :*

శ్రీమచ్ఛంకర భగవత్పాదుల ఉపనిషద్వ్యాఖ్యలలో కూడా ఇటువంటి హాస్య రసోక్తులు ఎన్నెన్నో కనబడుతున్నాయి.

తైత్తిరీయోపనిషత్తులోని "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనే ఆనందవల్లీ వాక్యాన్ని వ్యాఖ్యానిస్తూ శంకరాచార్యులవారు ఈ క్రింది శ్లోకాన్ని ఒక సందర్భంలో ఉదాహరించారు

"సత్యాదీనా మనృతాది ధర్మ నివృత్తి పరత్వాత్ విశేష్యస్య చ బ్రహ్మణ ఉత్పలాదివదప్రసిద్ధత్వాత్ –

మృగతృష్ణాంభసి స్నాతః
ఖ పుష్ప కృత శేఖరః।
ఏష వంధ్యా సుతో యాతి
శశ శృంగ ధనుర్ధరః॥

ఇతివత్ శూన్యార్థతైవ ప్రాప్తా సత్యాది వాక్యస్యేతిచేత్, న। లక్షణార్థత్వాత్।"
(తైత్తిరీయం, పుట—358)

మృగతృష్ణలో స్నానం చేసి, మింటి పూవును కైసేసి, కుందేటి కొమ్మును విల్లుగా పూని, గొడ్రాలి కొడుకు ఇడుగో వెడుతున్నాడు—అనేది ఈ శ్లోక తాత్పర్యం. అసంభవత్వాన్నీ శూన్యార్థతనూ ప్రతిపాదించడానికి ఈ హాస్యోక్తిని నిక్షేపించారు.

**వాక్యపదీయంలో :**

భర్తృహరి మరింత సరసమయిన మాటను మరొకటి అన్నాడు. "యజేత పశునా" అనే వేదోక్తికి సంబంధించి ప్రసంగిస్తూ—

యథైవాహిత గర్భాయాం
గర్భాధాన మనర్థకం।
తథైకేన ప్రసిద్ధాయాం
పశ్వంతర మనర్థకమ్॥ (వాక్యపదీయం, 3–1–64)

అప్పటికే అంతర్వత్ని అయిన స్త్రీకి గర్భాధాన మహోత్సవం అనర్థకమయినట్టుగా— అని పశ్వంతరానర్థక్యానికి ఉపమానం చెప్పాడు. ఇది లౌకికమయిన హాస్యోక్తి.

ఎంతగా వేదాంతులయినా, ఎంతటి శాస్త్ర పండితులయినా మన ప్రాచీనులలో సరసత ఇఱ్ఱింకిపోలేదు అనడానికి ఇట్టివి నిదర్శనాలుగా నిలుస్తాయి. పైగా పాణిని, శంకరాచార్యులు, భర్తృహరి, వీరంతా కవులుకూడాను. ఇంతేల—సుభాషిత సుధానిధిలోని శ్లోకాలను చూస్తుంటే, వేదాలకు భాష్యం చెప్పిన సాయణాచార్యులవారేనా ఈ శ్లోకాలను సంగ్రహించినది—అని విస్తుపోనివారు ఉండరు.

**లీలావతిలో :**

విద్యార్థులకు విసుగును కలిగించే శాస్త్రాలలో గణితం ఒకటి. ఆధునిక గణిత శాస్త్ర గ్రంథాలలో కనిపించే లెక్కలలో (ప్రోబ్లమ్స్) హాస్యాది రస స్ఫూర్తి మచ్చుకికూడా కనిపించదు. కానీ లీలావతీ గణితంలో అన్నీ రసవంతమయిన సమస్యలే. లీలావతి అనే అమ్మాయి భాస్కరాచార్యుని పాణి గృహీత అని కొందరూ పాణి గృహీతి అని కొందరూ భావిస్తున్నారు. గణిత శాస్త్రోపదేశానికి ఆవిడను ఎన్నుకోవడంలోని ఆంతర్యం అలా ఉండగా—

కామిన్యాః హార వల్ల్యా సురత కలహతో
మౌక్తికానాం త్రుటిత్వా
భూమౌ యాః త్రిభాగః, శయన తల గతః
పంచమాంశోఽస్య దృష్టః।
ఆత్తః షష్టః సుకేశ్యా, ఐక (?) దశమకః
సంగృహీతః ప్రియేణ,
దృష్టం షట్కం చ సూత్రే, కథయ కతిపయైః
మౌక్తికైరేష హారః॥ (ఆంధ్ర లీలావతి-332)

ఒక కామిని ముత్యాల హారం సురతోద్ధత కలహంలో తెగిపోయిందిట. అందులోని ముత్యాలలో మూడవ వంతు భూమి మీద పడ్డాయి. అయిదవ వంతు సెయ్య మీద పడ్డాయి. ఆరవ వంతు ముత్యాలను ఆవిడే పట్టుకుంది. పదవ వంతు ముత్యాలను అతగాడు పట్టుకున్నాడు. పోగా ఆరు ముత్యాలు మాత్రం దారానికి ఉండిపోయాయి. ఆ ముత్యాల హారంలో మొత్తం ముత్యాలు ఎన్ని?—ఇది ఇక్కడి సమస్య. ఎంత సరసమయిన ఉదాహరణమో! ఒక చెట్టుమీద కాకులున్నాయి. వాటిలో మూడవ వంతు తూర్పుకేసి ఎగిరిపోయాయి—అంటూ ఇదే లెక్కను ఇవ్వవచ్చు. కానీ ఈ కాకుల లెక్కలోకన్నా ముత్యాల లెక్కలో విద్యార్థులను ఆకట్టుకొనే గుణం ఉంది. మరొక ప్రమాదమూ ఉంది.

కాల వయ ఆది భేదాలనుబట్టి రుచి భేదం ఏర్పడుతూ ఉంటుంది. ఇటువంటి సరసోక్తులు పాయసంలో జీడిపప్పుల్లా కొందరికి భాసిస్తే, ఎడారిలో ఒయాసిస్సులుగా మరికొందరికి ఆభాసిస్తాయి. "అది యట్టిద!"

## షడ్భాషా చంద్రికలో :

లక్ష్మీధరుడు తన షడ్భాషా చంద్రికలో "మోచివా।" (1_1_39) అనే సూత్రం దగ్గర "వబయో రభేదః" అనే మాట వ్యాకరణాంతర సిద్ధమా? ఏతచ్ఛాస్త్ర

సిద్ధమా? "సీపీ స్వప్నే వా" అనే విధానం అవసరమా? అనవసరమా? ఇత్యాది శంకలను లేవనెత్తి సుదీర్ఘమయిన చర్చను చేసి చేసి చివరికి

"—అథ యది జ్ఞాపకాత్ వబయోరభేదః స్యాత్
తర్హి 'బోవః' ఇతి సూత్రేణ బస్య వత్వ విధానమ్
అనర్థకమేవ స్యాదితి చేన్నైవమ్,
తద్విధానస్య నియమార్థత్వాదిత్యలం సూత్ర కలహ చర్చయా।"

అని ముగించాడు. ఇందులో సున్నితమయిన హాస్యస్ఫూర్తి కనబడుతోంది.

అటుపైని 'ద్వితీయ' శబ్దంలో ముందు వలోపమూ, తరువాత దలోపమూ ఆయా విధులతో చేసేస్తే—అని ఆశంకించి—

"—తర్హి ఉభయ లోపో భవత్వితి చేదహో
విస్మరణ శీలతా దేవానాం ప్రియస్య
యదుదాహరణ స్వరూప భావమపి న జానాతి!"

అని ఒక హాస్యోక్తిని విసిరాడు. ఇటువంటివి పాఠకుల పెదవులపై చిరునవ్వులను చిందించి ఉల్లాసాన్ని కలిగించక మానవు.

**కవి శిరోభూషణంలో :**

ఈ హాస్యోక్తి సన్నివేశ సంప్రదాయంలోని స్ఫూర్తిని అందుకొని అహోబల పండితుడు అక్కడక్కడా ఒకటి రెండు చెణుకులను విసిరాడు.

"అంద్వింందునాస్తు సప్తమీ" (అజంత—7) అనే సూత్రంలో ఆంధ్ర శబ్ద చింతామణి చేసిన ఇంద్యు గ్రహణ ఫలాన్ని ప్రతిపాదిస్తూ, "సవిధ వర్తినామిందు" (అజంత—27) అనే సూత్రం దగ్గర అహోబలుడు సచమత్కారమయిన శంకలను లేవనెత్తాడు.

"నను అంద్విత్వస్య సాశ్రయత్వమనాశ్రయత్వమప్యస్తీతి
సాశ్రయత్వే విభక్తిత్వ మనాశ్రయత్వే అత్రేత్యవ్యయ
పర్యాయత్వ మేవేతి తస్య విభక్తిత్వేన గ్రహణం యుక్తం।
ఇంద్విత్వస్యతు కేవలమనాశ్రయత్వేన తస్య
విభక్తి త్వేనోపాదానం కథముపపన్నం స్యాత్?
కించ తస్య విభక్తిత్వేన గ్రహణే ఎంద్విత్వేనేన
కిమపరాద్ధమ్?, తస్యాపి అధికరణతాపన్న
పరోక్ష పదార్థాభిధాయిత్వాదితిచేత్ సత్యమ్।—"

(కవి శిరోభూషణం, పుట—310)

"అహమాదీనాం ద్విత్వమ్" (అజంత—29) అనే సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ—

నను కథం "కృపయా భోక్తవ్యమన్పల్కులున్"
(ఆముక్త మాల్యద, 1—18) "మరణే సతి
కిం భయమనిన చదువు చదువంబోలున్"
(పాండురంగ మాహాత్మ్యం, 3—70) ఇత్యాది ప్రయోగః?

అని ఒక శంకను లేవదీశాడు. వీటిలో అమకరణ పరత్వాన మకారానికి ద్విత్వం లేక పోవడం ఎలా సాధువు? అనేదే ఆశంక. కానీ ఈ వాక్య నిర్మాణం చూడగా యతిక్కంచిచ్చమత్కార జనకంగా ఉంది.

"నాస్త్యుష్ణతా, నాస్త్యపూపో, నాప్త్యోదన సౌష్ఠవం చ, కథం కృపయా భోక్తవ్యమన్ పల్కులున్?" అనేది మొత్తం పద్యంతో స్ఫురించి, "ఏమీ లేదంటున్నావు, దయచేసి తినండంటున్నావు, ఏమిటి ఈ వైష్ణవం?" అనే చమత్కార స్ఫూర్తికి అనుకూలంగా అహోబలుడు వాక్య నిర్మాణం చేశాడు.

ఈ గ్రంథంలో అన్నింటికన్నా అత్యద్భుతమయిన హాస్యోక్తి ఏమంటే—

యస్సారోఽథర్వణ గ్రంథే
సోఽప్యత్రైవ విధీయతే।
తేన తత్పక్కికాలోక
లాలసా త్యజ్యతాం బుధైః॥ (కవి శిరోభూషణం, పుట—25)

అని అహోబిల పండితుడు బుజాలు తడుముకోవడమే!

ఇటువంటి సున్నితమయిన సరసోక్తులు పఠితలకూ పాఠయితలకూ క్లేశాపనోదకాలుగా, ఉల్లాస జనయిత్రులుగా ఉపకరిస్తాయి.

**లక్ష్యాలతో కథలు :**

సూత్రానికి అనేక లక్ష్యాలు చూపవలసిన అవసరం ఏర్పడినచోట, ఆ ఇచ్చిన లక్ష్యాల క్రమంతో ఒకానొక కథను లేదా ఒకానొక సన్నివేశాన్ని, సచమత్కృతిగా స్ఫురింపజేసే సంప్రదాయం కొందరు లాక్షణికులలో కనబడుతోంది బాల వ్యాకరణంలో ఇటువంటి చమత్కృతులనెన్నింటినో రమణీయ వ్యాఖ్యాత బహుధా నిరూపించారు.

ప్రియుడు పువ్వులు తేగా, ఆ ప్రియురాలు వాటిని ముడుచుకోకుండా ఆభరణాలు దిగేసుకుంటే, ఆతడు అలిగి వెళ్ళిపోయాడుట. "వాఁడు పువ్వులు దెచ్చె—ఆకె సొమ్ములు దాల్చె—వాఁడు ఇల్లు వెడలె" (బా. వ్యా. కారక—24) అనే లక్ష్యాల క్రమంలో ఈ కథ స్ఫురిస్తున్నమాట నిజమే అయితే వాడు శాలీనుడా? ఆకె సుగాత్రియా? అనేది సందేహం.

హేమ చంద్రుడు తన ప్రాకృత వ్యాకరణంలో ఒకటి రెండు చోట్ల ఇటువంటి చమత్కృతులను స్ఫురింపజేసే లక్ష్యాలను ఇచ్చాడు.

మోఽనుస్వారః। (8–1–23)

అంత్యమకారస్యానుస్వారో భవతి।

జలం, ఫలం, వచ్ఛం, గిరిం పేచ్ఛ। (హైమం, పుట–5)

ఈ లక్ష్యాల క్రమంతో ఒక వాక్యమూ ఒక ప్రకృతి దృశ్యమూ స్ఫురిస్తున్నాయి. వీటిలో ఒక కథా స్ఫూర్తిని ఊహించనూవచ్చు.

భట్టోజి దీక్షితుల వారు తమ సిద్ధాంత కౌముదిలో చూపిన లక్ష్యాల క్రమంలో కూడా అక్కడక్కడ ఇటువంటి కథాస్ఫూర్తులు కనబడుతున్నాయి. "ధ లో

పూర్వస్య దీర్ఘోఽణః" (6—3—111) అనే సూత్రానికి ఇచ్చిన లక్ష్యాలు వరుసగా ఇవి—

పునా రమతే। హరీ రమ్యః। శంభూ రాజతే।
(బాల మనోరమా, ప్రథమ—పుట–113)

వీటితో "పునా రమతే, అథాపి హరీ రమ్యః। ఏవమేవ శంభూ రాజతే।" అని ఇద్దరేసి ఇల్లాండ్రుగల ఈ హరిహరులకు ఒక కథను స్ఫురింపజేశారా? అనే ఊహకు అవకాశం లేకపోలేదు.

లక్ష్యాలద్వారా ఈయీ చమత్కార కథా స్ఫూర్తులను గ్రంథకర్తలు ఉద్దేశించారా? అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టం కానీ యథావకాశంగా యావత్తెలంగా సభ్యతా పరిధి మేరకు వ్యాఖ్యానించడంలో సరసత లేకపోలేదు. లక్ష్యాలనూ వాటి క్రమాన్నీ విద్యార్థులు ధారణ చేయడానికి ఇది కొంత ఉపకరిస్తుంది.

*"మంగళాదీని–"* :

"మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథన్తే" అనే సూక్తి సుప్రసిద్ధంగా కనబడుతోంది.

సంజ్ఞా సంజ్ఞులను సందేహానికి తావులేని విధంగా నిర్దేశించాలనీ, సంజ్ఞలను ముందు చెప్పి తరువాత సంజ్ఞను విధించడమనే పాణినీయ సంప్రదాయం తన్నిమిత్తకమేననీ ప్రస్తావిస్తూ "వృద్ధి రాదైచ్" (1–1–1) అనే సూత్రరచనలో ఆ సంప్రదాయం విటతాటమైనదనీ దానికొక ప్రయోజనం ఉన్నదనీ భాష్యకారుడు నిరూపించాడు.

క్రియమాణేఽపి సంజ్ఞాధికారే సంజ్ఞా సంజ్ఞినోః
అసందేహో వక్తవ్యః।
కుతో హ్యేతత్—వృద్ధి శబ్దః సంజ్ఞా, ఆదైచః
సంజ్ఞిన ఇతి। న పునరాదైచః సంజ్ఞా, వృద్ధి శబ్దః సంజ్ఞీతి।
(భాష్యం, 1–1–3, పుట–106, ప్రథమ)

ఈ సందేహానికి సమాధానంగా సుదీర్ఘమయిన చర్చను చేసి చివరికి ఇలా అన్నారు–

కథం "వృద్ధిరాదైచ్" ఇతి?
ఏతదేక మాచార్యస్య మంగలార్థం మృష్యతామ్।
మాంగళిక ఆచార్యో మహతః శాస్త్రౌఘస్య మంగళార్థం
వృద్ధి శబ్ద మాదితః ప్రయుజ్క్తే। మంగళాదీని
హి శాస్త్రాణి ప్రథన్తే వీర పురుషాణి చ భవన్తి,
ఆయుష్మత్పురుషాణి చ। అధ్యేతారశ్చ వృద్ధియుక్తా
యథా స్యురితి। సర్వత్రైవ హి వ్యాకరణే
పూర్వోచ్చారితః సంజ్ఞీ, పరోచ్చారితా సంజ్ఞా।
'అదేఙ్గుణః' ఇతి యథా। (భాష్యం, 1–1-3, పుట–110, ప్రథమ)

సంజ్ఞా వాచకమయిన వృద్ధి శబ్దాన్ని ముందు ప్రవేశ పెట్టడం మంగళార్థ ప్రతీతికి అని భావించాడు. దీని వల్ల పైని పేర్కొన్న సూక్తికి చారితార్థ్యం సిద్ధించింది.

"ఏఙథోవక్రః" (ఆం శ. చిం. సంజ్ఞా-29) అనే సూత్రంలో అథశబ్దాన్ని మంగళార్థకంగా కూడా భావించవచ్చుననీ ఇది మధ్యశాస్త్రం మంగళ వాచకమనీ అహోబలపండితుడు ప్రతిపాదించాడు.

"అథశబ్దస్యాత్ర ప్రయోగ ఐచ్ఛికశ్ఛందోఽనుసారీ,
మధ్యే మంగళార్థో వా,
అత్ర విశేష సంజ్ఞా విధి ప్రారంభార్థో వా।
(కవి శిరో భూషణం, పుట-200)

ఇష్ట దేవతా స్తుతి పరమయిన ప్రార్థనా శ్లోకాలతో గ్రంథాలను ప్రారంభించడం సర్వే సర్వత్ర కానవస్తున్న సంప్రదాయం. వ్యాఖ్యాతలుకూడా తమ వ్యాఖ్యానాలను ఈ సంప్రదాయంతోనే ప్రారంభించారు. కాగా కొందరు వ్యాఖ్యాతలు ప్రతి పరిచ్ఛేద ప్రారంభంలోనూ ప్రార్థనా శ్లోకాలను నిక్షేపించడం జరిగింది. ఈ సంప్రదాయం

షడ్భాషా చంద్రికా, కవి శిరో భూషణాలలో కనబడుతోంది. ఉపాసనా విధానానికి సంబంధించిన అనేక రహస్యాలను విగూఢంగా విశేషించి తన ఉపాస్య దేవత అయిన మేధా దక్షిణామూర్తిని లక్ష్మీధరుడు బహుధా స్తుతించాడు. అతని శ్లోకాలు ఇవి—

అమల స్ఫటికాంగాయ
చంద్రమః ఖండ ధారిణే।
వటాధః స్థితి దక్షాయ
దక్షిణా మూర్తయే నమః॥

నమో బ్రహ్మాది దేవానామ్
అజ్ఞాన ధ్వాంత భానవే।
సర్వార్థ బద్ధ దీక్షాయ
దక్షిణామూర్తయే నమః॥

మతి ముద్రా పరశ్వేణ
జానుభిః న్యస్త బాహవే।
భుజంగ బద్ధ కక్షాయ
దక్షిణా మూర్తయే నమః॥

వాసవాది సుపర్వాళి
కోటీర ద్యోతితాంఘ్రయే।
సోమ సూర్యానలాక్షాయ
దక్షిణామూర్తయే నమః॥

యమి వర్యావలి స్వాంత
ద్యోతమానాత్మమూర్తయే।
వేదాంత పక్షపాతాయ
దక్షిణామూర్తయే నమః॥

అశేష విద్యా సందోహా
వేష్టితాయ పరమాత్మనే।
సర్వదేవ పరీతాయ
దక్షిణామూర్తయే నమః॥

ఓంకారాదిమ మంత్రాణాం
సర్వేషామర్థరూపిణే।
సర్వశ్రేయో నిమిత్తాయ
దక్షిణామూర్తయే నమః॥

"దక్షిణా మూర్తయే నమః" అనే మకుటంతో ఏదయినా ఒక శతకం రచించి ఇతడు అందులోని శ్లోకాలను కొన్నింటినిందులో పొందుపరచాడా? అనే సందేహం కలుగుతోంది. ఇతడు పరిణత వయస్సులో సన్న్యసించాడనీ, గీత గోవిందానికి శ్రుతి రంజనీ వ్యాఖ్యను రచించాడనీ ఈ క్రింది అవతారికా శ్లోకాలవల్ల తెలుస్తోంది.

స గార్హస్థ్యే చిరం స్థిత్వా
జిత్వా సర్వ దిశః సుధీః
సన్న్యస్యాజని యోగీంద్రో
రామానందాశ్రమాభిధః॥

తేన లక్ష్మీధరాఖ్యేణ
క్రియతే శ్రుతిరంజనీ
విద్వత్కవి ముదే గీత
గోవిందస్యార్థ దీపికా

నబుధ్యతే బుధైః గీత
గోవిందస్యార్థ గౌరవం
వ్యాఖ్యాన శతకేనాపి
విహాయ శ్రుతి రంజనీమ్॥

(షడ్భాషా చంద్రికా, పుట–15)

తన ప్రాకృత వ్యాఖ్యానానికి "షడ్భాషా చంద్రికా" అని పేరుపెట్టి దానిలోని సార్థక్యాన్ని (చంద్రికా=వెన్నెల) కవితా సుందరంగా సవినయంగా నిరూపించాడు.

తేన లక్ష్మీధరార్యేణ
షడ్భాషా చంద్రికానఘా
విద్వత్కవి చకోరాణాం
ప్రీతయే క్రియతేఽధునా॥ (14)

యత్నేన గచ్ఛతః క్వాపి
స్ఖలనం స్యాన్మహీయసః
హసంత్యసాధవ స్తత్ర
సమాదధతి సజ్జనాః॥ (17)

రాగద్వేష విహీనైః
అతి సరళైః పరగుణ స్తవనే
విద్వత్కవిభీ రసికైః
షడ్భాషా చంద్రికా సేవ్యా॥ (20)

అపశబ్ద మహా గర్తే
షడ్భాషా కృష్ణ రాత్రిషు
పత న్తి కవిశార్దూలాః
షడ్భాషా చంద్రికాం వినా॥ (21)

ఈ చివరి శ్లోకంలో అహంకార స్ఫూర్తిని ఆశంకింపనవసరంలేదు. కవితా చమత్కృతి మాత్రమే ఉపాదేయం. అదే కవ్యుద్దిష్టంకూడా అయిఉంటుంది.

అహోబల పండితుడు ప్రతి పరిచ్ఛేదానికీ ప్రారంభంలో సీతారామ స్తుతిపరాలయిన శ్లోకాలను సంతరించాడు. హలంతపరిచ్ఛేదానిని మూడు శ్లోకాలు కనబడుతున్నాయి. వాటిలో మొదటిది—

నీతే! సుచ్ఛదనావృతేర్విగళనాన్మందానిల వ్యాపృతా
గుచ్ఛ ద్వంద్వ మతుచ్ఛమృచ్ఛతి మహాన్ పుష్పంధయోఽయం ప్రియే!
పశ్యేత్యాలపతి ప్రియే కుచభరే సాపత్రపా సత్వరం
కుర్వాణా మృదులాంశుకం సురచితం భూనందినీ పాతు నః॥

(కవి శిరో భూషణం, పుట—446)

ఈ శ్లోకం లక్ష్మీధరుని గ్రంథారంభ శ్లోకాన్ని స్ఫురింపజేస్తోంది. రెండూ శార్దూల విక్రీడితాలే. రెండింటా మృదులాంశుక సురచన కనబడుతోంది.

వీసద్ధం కఅఈసరాఇ రహసా ణీసాస ఖుణ్ణం ఛిహా
పువ్వం దిట్ఠ మహోక్ఖఏణ సమి ఆసే అంబు ఏక్కత్థలే
ఆలోలామల హార కుండల పహా కిమ్మీర కుప్పాసఅం
లచ్ఛీఏ థణ మండలం హవఉ దే ఇట్ఠత్థదాణుమ్ముహం॥

విస్రబ్ధం కృత విస్మరాతిరభసా నిశ్వాస నున్నం స్పృహా
పూర్వం దృష్టమథోక్షజేన శమిత స్వేదాంబు చైకస్థలే
ఆలోలామల హార కుండల ప్రభా కిర్మీర కూర్పాసకం
లక్ష్మ్యాః స్తనమండలం భవతు తే ఇష్టార్థ దానోన్ముఖమ్॥

(షడ్భాషా చంద్రికా—శ్లో—2)

గ్రంథాంతంలోని పద్యాలలో అహోబల పండితుని ఔద్ధత్యం స్పష్టంగా కనబడుతుంది. "తుష్టో భవే ద్రఘుపతిర్మయి సత్కృపావా నేతన్మదీయ వచనైరపి దుష్టభావైః—" (పుట _ 634) అని తన గ్రంథాన్ని శ్రీ రామాంకితం చేసినా మమకారాన్నీ దానివల్ల వచ్చే అహంకారాన్నీ విడిచిపెట్టుకోలేక పోయాడు మన అహోబలుడు. శాస్త్రాధ్యయనంవల్ల చిత్తశుద్ధి ఏర్పడి, శమ ప్రాధాన్యం పరిఢవిల్లి, రాగద్వేష విహీనమయిన ఉదాత్తత, ప్రవృత్తిలో పొడసూపుతుందనడానికి మహామనీషి లక్ష్మీధరుని ఈ షడ్భాషా చంద్రికాంత శ్లోకమే బలీయమైన నిదర్శనం.

ఏతన్నిబంధ నిర్మిత్యా
యా పరోపకృతి స్తయా।
వృషాకపాయీ రమణః
ప్రీయతాం పరమేశ్వరః॥

# "అగుణవతాం సర్వహలాం స్వోర్లోపః"

## ఇతి చింతామణి సూత్రస్యార్థ నిర్ణయః।

ఆంధ్ర శబ్ద చింతామణౌ హలంత పరిచ్ఛేదే వర్తమానస్య "అగుణవతాం సర్వహలాం స్వోర్లోపః" ఇత్యస్య సూత్రస్య కవిశిరోభూషణ నామక వ్యాఖ్యానకారేణ అహోబల పండితేన వివక్షితమాత్రే అర్థే స్వీకృతే "ఆత్మన ఇమనంతానాం డా వా" ఇతి సూత్రం, "క్వచిన్మనుజ సంజ్ఞాయాం డుఙ్ నాంతాన్న విధీయతే" ఇతి అదర్వణిక_ వికృతి_వివేకోక్తా చ కారికా ముధా భవిష్యతః।

అతః "ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్," "ద్విత్వం తు దీర్ఘతో బహులమ్" ఇతి సూత్ర ద్వయస్య యత్ర ప్రవృత్తిః తత్రైవ సులోప విధాయకస్య "అగుణవతామ్" ఇత్యస్య ప్రకృత సూత్రస్యాపి ప్రవృత్తిరితి నియమః కర్తవ్యః।

కృతేఽస్మిన్ నియమే "భగవానుడు" "ప్రశానుడు" "ఇంద్రజిత్తుడు" ఇతి రూపత్రయం చింతామణేః అసాధ్యం భవిష్యతి। "భగవానుడు"—"ప్రశానుడు" ఇత్యేతయోః ప్రామాణికః ప్రయోగః మృగ్యః। "భగవానుడు" ఇతి తు రూపం మార్గాంతరేణ చిన్నయ సూరిణా సాధితమేవ। "ఇంద్రజిత్తుడు" ఇతి భాస్కరాదిభిః కవిభిః ప్రయుక్తస్తు అపి వ్యాకరణేషు అనేకేషు కవిప్రయోగేషు ఏక ఏవేతి సారాంశః।

(29th All India Oriental Conference, Poona, 1978,

SUMMARIES OF PAPERS ; Pages—264 & 265)

ఆంధ్ర శబ్ద చింతామణిరితి ఆంధ్ర భాషాయాః సంస్కృత భాషాయాం శ్లోక రూపేణ విరచితః వ్యాకరణ గ్రంథః. అస్య కర్తా మహా భారతాంధ్రీ కర్తా

నన్నయ భట్టారకః (క్రీ. శ. 11) ఇతి ప్రాచీన కవి పండిత పరంపరాగతః అయమభిప్రాయః. ఆధునికాః విమర్శకాస్తు తం నాంగీకుర్వంతి. కేచిత్తు ఏలకూచి బాల సరస్వతి నామకం ప్రప్రథమ వ్యాఖ్యాన కర్తారం అస్య గ్రంథస్య కర్తృత్వే నిక్షిపన్తి. ఏకాధికాశీతి సంఖ్యాకాః ఆర్యా శ్లోకాః అస్మిన్ వర్తంత ఇత్యస్మిన్నప్యభిప్రాయే ఆధునిక విమర్శకా నైకకంఠ్యం జగ్ముః.

వికృతి వివేక ఇతి అన్యోఽస్యాంధ్ర వ్యాకరణ గ్రంథః, చింతామణేః పరిశిష్ట ప్రాయః దృశ్యతే. సోఽపి సంస్కృత భాషాయాం విరచితః అనుష్టుప్ శ్లోకమయః. అథర్వణాచార్యః (క్రీ.శ. 12) అస్య కర్తేతి ప్రవాదః. ఆధునికాస్తమపి నాంగీచక్రుః. ఉభయోరపి గ్రంథయోః కర్తృతా నిర్ణయ విషయే శ్రీమంతః అమరేశం రాజేశ్వర శర్మ మహోదయాః (రీడర్, ఉస్మానియా యూనివర్సిటీ) ప్రమాణమ్. వ్యాసస్యాస్య నైష లక్ష్య ఇతి ప్రకృతిమనుసరామః.

అనంతరే కాలే అహోబల పత్యుపనామకః ప్రభంజనం నృసింహ మహోదయః అభినవ నన్నయ భట్టారక బిరుదాంచితః ఆంధ్ర శబ్ద చింతామణేః సమగ్రాం వ్యాఖ్యాం సంస్కృత భాషాయామేవ వ్యరచయత్. వికృతి వివేక ప్రోక్తాః కారికా అపి యథా సంభవం స్వకీయేఽస్మిన్ వ్యాఖ్యానే అహోబలపతిః ప్రావ్వియాయ.

సంస్కృత వ్యాకరణ శాస్త్రస్య యథా పాణిని కాత్యాయన పతంజలయః ఆంధ్ర వ్యాకరణ శాస్త్రస్య నన్నయాథర్వణాహోబల పండితాస్తథేతి పండితాశ్చ విమర్శకా అచకథన్. ఇతి భూమికా.

ఆంధ్ర శబ్ద చింతామణౌ హలంత పరిచ్ఛేదే తత్సమ రూపసాధన విషయే సంస్కృత హలంత శబ్దాః సర్వేఽపి గుణవద్గణత్వేన అగుణవద్గణత్వేన చ ద్విధా విభక్తాః. తత్ర గుణవద్గణ పతితస్య శబ్దస్య ద్వితీయైక వచనాంత తుల్యం రూపం, అగుణవద్గణ పతితస్య శబ్దస్య ప్రథమైక వచనాంత తుల్యం రూపం చాంధ్ర భాషాయాం ప్రాతిపదికం స్యాదితి "గుణవద్గణో ద్వితీయైక వచన తుల్యో భవేద్వికృతౌ, ప్రథమైక వచన తుల్యం

సర్వత్ర హలంతమగుణవత్త్వప్రభృతి" (447) ఇతి సూత్ర ద్వయేన సూపపాదితమేవ. అస్య శబ్దస్య అస్మిన్నేవ గణే పాఠః ఇతి నాఽపి నిర్ణయోఽస్తి. కింతు, ప్రథమైక వచన తుల్య రూపస్య ప్రాతిపదికత్వాంగీకారే తత్సమం రూపం యది సిద్ధం భవిష్యతి తర్హి తస్య శబ్దస్య అగుణవద్గణే పాఠః ఏవమేవ గుణవద్గణేఽపి పాఠో నిర్ణేయ ఇతి తు ఉరరీకృతమేవ ఆంధ్ర వ్యాకరణ పాకిజ్ఞైః. తథాపి మతుప్ ప్రత్యయాంతస్య శబ్దస్య గుణవద్గణ ఏవ పాఠః. మతుబర్థక ప్రత్యయాంతరాంతస్య తు శబ్దస్య 'కఠిన్' ఇత్యాదేః అగుణవద్గణ ఏవ పాఠః ఇతి వివేకః. అన్యథా 'గుణవద్గణ' ఇతి మతుబంత నిర్దేశః అర్థ రహితః భవిష్యతి. అస్తు నామ. ఇదానీం తావత్ ప్రథమైక వచన తుల్య రూపాత్ ప్రాతిపదికాత్ తత్సమ రూప విష్పత్తి విషయే "అగుణవతాం సర్వహలాం సోర్లోపః" ఇతి చింతామణి సూత్రస్య ప్రవృత్తిః కీదృశీ ఇతి విచార్యతేఽత్ర.

మరుత్, జలముక్ ఇత్యాదయః హలంతాశ్శబ్దాః ప్రథమైక వచనాంత తుల్యాః ప్రాతిపదికాః భవంతి. తుల్య శబ్ద వ్యవహారేణ సంస్కృత భాషాయాం ఏతేషాం యత్పదత్వం, ప్రథమైక వచన బోధకతా శక్తిమత్త్వం చ తదత్ర నివార్యత ఇతి అక్షరానుపూర్వీ మాత్రస్య ప్రాతిపదికత్వమ్ అంగీక్రియతే. "ద్విత్వోత్త్వే సర్వహలాం హ్రస్వాత్" (447) ఇత్యనేన సూత్రేణ పూర్వోక్త ప్రాతిపదికస్య అంత్యహలః ద్విత్వే ఉత్త్వేచ కృతే అనంతరం సంస్కృత సంప్రదాయానుసారేణ పదత్వ సిద్ధ్యర్థం సు ప్రత్యయే వివక్షితే 'మరుత్తు+సు' ఇత్యవస్థాయాం 'అగుణ వతాం సర్వహలాం సోర్లోపః' (448) ఇత్యనేన సూత్రేణ సోర్లోపే మరుత్తు, జలముక్కు ఇత్యాదీని ప్రయోగార్హాణి పదాని స్యుః. ఏవమేవేతర విభక్తిషు చ. వాక్, స్వరాట్ ఇత్యాదిషు 'ద్విత్వం తు దీర్ఘతో బహుళమ్' ఇతి సూత్రేణ ద్విత్వస్య వైకల్పికత్వేఽపి ఉత్త్వస్య తు నిత్యత్వేన వాకు—వాక్కు, స్వరాటు—స్వరాట్టు ఇతి ద్వైరూప్యం సిద్ధ్యతి.

ఏవం చ కవి శిరో భూషణ నామక వ్యాఖ్యాన కృతా అహోబల పండితేన "అగుణవతాం సర్వహలాం సోర్లోపః (448) ఇత్యస్య సూత్రస్య అయమర్థో వివక్షితః__

"గుణవద్గుణ వ్యతిరిక్తానాం మహతామమహతాం శబ్దానాం సోర్లోపః స్యాత్,"
(448)

అస్మిన్ విశాలేఽర్థే వివక్షితే సతి "ఆత్మన ఇమనంతానాం డా వా" (449) ఇతి డా విధానం వ్యర్థమేవ భవిష్యతి. కథమితిచేత్—ఆత్మన్ శబ్దస్య అగుణవద్గుణత్వేన ప్రథమైక వచనాంత తుల్య రూపస్య 'ఆత్మ' ఇత్యస్య పుంలింగే ప్రాతిపదికత్వే "దీర్ఘాణాం హ్రస్వః స్యాత్" (344) ఇత్యంత్యదీర్ఘస్య హ్రస్వే అనంతరం పదత్వ సిద్ధ్యర్థం సుప్రత్యయే వివక్షితే ఆత్మ+సు ఇత్యవస్థాయాం "అగుణవతాం_" ఇత్యాది ప్రకృత సూత్రేణ సుప్రత్యయస్య లోపే 'ఆత్మ' ఇతి పదం స్యాత్. ఏవమేవ గరిమ ఇత్యాదీన్యపీమనిజంతాని.

'డా' ప్రత్యయే కృతే యాని రూపాణి ఆత్మ, లఘిమ, గరిమ ఇత్యాదీని సిద్ధ్యంతి తాన్యేవ రూపాణి డా ప్రత్యయ విధానేన వినాపి సిద్ధ్యంతీతి సూత్రమ్ ఇదం డా ప్రత్యయ విధాయకం వ్యర్థమేవ భవిష్యతి. 'ఆత్మము' ఇత్యాదీనాం సిద్ధ్యర్థం, డా ప్రత్యయ విధాన, స్త్రీ సమతా కథనాదికేన అనేన ప్రక్రియా గౌరవేణ వినా, సుప్రత్యయస్య లోప వైకల్పికతా కథనమేవాలం భవిష్యతి.

సతి సుప్రత్యయే ఖలు మువర్ణకో వా డుజ్వర్ణకో వా ఆదేశః స్యాత్. అతః వినా డా ప్రత్యయ విధానాత్, సుప్రత్యయస్య లోప వైకల్పికతా విధాన ఏవ లాఘవశ్చ లఖిష్యతి.

అతః అగుణవతామిత్యాదేః సూత్రస్య యః కోఽప్యర్థ నియమః కర్తవ్యః. "ద్విత్వోత్త్వే సర్వహలాం హ్రస్వాత్, ద్విత్వం తు దీర్ఘతో బహుళమ్" ఇతి సూత్ర ద్వయేన యత్ర ఉత్త్వం తత్రైవ "అగుణవతాం సర్వహలాం సోర్లోపః" ఇత్యస్య

సూత్రస్య సులోప విధాయకస్య ప్రవృత్తిః, నాన్యత్ర—ఇతీత్యర్థ నియమః కర్తవ్యః. తర్హి ఆత్మా. లఘిమా, గరిమా ఇత్యాదిభ్యః ప్రాతిపదికేభ్యః "ఆత్మన ఇమనంతానాం డా వా" ఇత్యనేన వివక్షితస్య డా ప్రత్యయస్య స్త్రీ ప్రత్యయ తుల్యత్వేన "అమతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః" ఇత్యనేనైవ సులోపః సిద్ధ్యతి. డా ప్రత్యయస్య వైకల్పికత్వేన తదభావే ఆత్మా+సు, లఘిమా+సు, గరిమా+సు ఇత్యాదిష్వవస్థాసు ఉత్వాంతత్వం నాస్తీతి కృత్వా అగుణవతామిత్యాదినా ప్రకృత సూత్రేణ సుప్రత్యయస్య న లోపస్సిద్ధ్యతి. అతః సుప్రత్యయస్య స్థానే మహదమహ ద్విపక్షమనువృత్య డు జీ పువర్ణకే చ ఆత్ముఁడు—ఆత్మము, గరిముఁడు—గరిమము—ఇత్యాదీని పదాని సిద్ధ్యంతి. ఏవంచ ఆత్మ—ఆత్ముఁడు—ఆత్మము, గరిమ—గరిముఁడు—గరిమము ఇత్యాదికం రూపత్రయ మిష్టం సిద్ధ్యతి.

"సాంతాదవయః ప్రభృతేః స్లోపః" (452) ఇత్యనేన ప్రాతిపదికాంతస్య సకారస్య ఉత విసర్గస్య లోపే మన+సు, ప్రచేత+సు ఇత్యాదిషు స్థలేషు చ అనేనైవ అర్థకల్పనేన 'అగుణవతాం సర్వహలాం సోర్లోపః' ఇత్యస్య సూత్రస్య ప్రవృత్తిః నివార్యత ఇతి మనము, ప్రచేతుఁడు ఇత్యాదీని రూపాణి సాధితాని భవన్తి. అతః అర్థకల్పనేఽస్మిన్ చింతామణి కర్తురపి సమ్మతిరస్తీతి ప్రతిభాతి.

వికృతి వివేక కారస్య అథర్వణాచార్యస్యాపి అర్థోఽయమిష్ట ఏవ. అన్యథా "క్వచిన్మనుజ సంజ్ఞాయాం డుజ్ నాంతాన్న విధీయతే" ఇతి కారికేయం వ్యర్థా భవిష్యతి. 'నిగమ శర్మా+సు' ఇత్యత్ర 'దీర్ఘాణాం హ్రస్వఃస్యాత్' ఇతి హ్రస్వే నిగమ శర్మ+సు ఇతి జాతే అగుణవతామిత్యనేనైవ సుప్రత్యయస్య లోపే కృతే, విభక్తి నిమిత్తతాయా అభావేన 'మహతోఽత ఉద్విభక్తౌ' ఇత్యనేన ఉత్వమపి న భవతీతి నిగమశర్మ, సుశర్మ ఇత్యాదయోఽపి అథర్వణ వచనాద్వినైవ సుసాధితాః స్యుః. అతః సుప్రత్యయస్య స్థానే డుజ్వర్ణక నిషేధం ప్రవదతః అథర్వణాచార్య వర్యస్యాపి ఉపరి నియమితోఽయమర్థః ఇష్ట ఏవేతి రాద్ధాంతః.

అత ఏవ పరమ ప్రామాణికః వైయాకరణః చిన్నయసూరి మహోదయః స్వీయే బాలవ్యాకరణే "ఇగ్లొరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" ఇత్యసూత్రి.

అస్మిన్నత్యర్థే నియమితే పూర్వోక్తదిశా సూత్ర కారికాది వైయర్థ్యం నివార్యత ఇతి మహాన్ ప్రమోద ఏవ. కింతు హనుమానుఁడు—భగవానుఁడు, ప్రశానుఁడు, ఇంద్రజిత్తుఁడు ఇత్యాదునికాని రూపాణ్యసాధూని భవన్తి.

సర్వలక్షణ సంగ్రహ కారేణ కూచిమంచి తిమ్మకవినా (క్రీ. శ. 17) ఏవము క్తం—

కం। హనుమద్భగవత్పదములు
పనిపడి హనుమంతుఁడనఁగ భగవంతుఁడినన్
హనుమానుఁడు భగవానుఁడు
ననుచుఁ బ్రయోగింపఁజెల్లు నంబరవసనా। (1–20)

సీ। జిత్పదంబునకింద్ర జిత్తింద్రజిత్తుండు— (1–21)

"భగవానుఁడు–ప్రశానుఁడు" ఇత్యేతయోః ప్రామాణికః ప్రయోగః మృగ్యః. తథాపి 'భగవానుఁడు' ఇతి తు రూపం చిన్నయ సూరిణా బాలవ్యాకరణే సుసాధితమేవ మార్గాంతరేణ, "ఇంద్రజిత్తుఁడు" ఇత్యస్య రంగనాథ, భాస్కర, మొల్ల రామాయణేషు బహవః ప్రయోగాః దృశ్యంతే. అవైయాకరణేషు అనేకేషు ప్రయోగేషు అయమప్యేక ఏవేతి విరమామి.

# నదిసుతేతి నన్నయోక్తిః ప్రాకృతీయా

**Paper submitted to Prakrit & Jainism Session of 30th A.I O.C.**
**SANTINIKETAN—1980**

వ్యాస మహాభారతమ్ ఆంధ్రీ చకార స్వేచ్ఛయా ఆదికవిః నన్నయ భట్టారకః (11. క్రీ. శ). తస్మిన్ గ్రంథే వర్తమానస్య ప్రయోగ ద్వయస్య సాధుతా సంపాదన విషయే ఆంధ్ర శబ్ద చింతామణ్యాఖ్యస్య ఆంధ్ర వ్యాకరణస్య వ్యాఖ్యాతా అహోబల పండితః (క్రీ. శ. 17) మార్గమేకమన్వసరత్. తస్మిన్ మార్గే సామీచీన్యమ్ అపశ్యతా మయా ప్రాకృత వ్యాకరణ సంప్రదాయమనుసృత్య తస్య విలక్షణస్య ప్రయోగ ద్వయస్య సాధుతా ప్రతిపాద్యతే.

"—నదిసుత గుర్రు కర్ణ శల్య నాగపురీశులన్, (1-1-69)" "—యమునా నది తుంగ తరంగ సంగతావిల శిశిర స్థలాంతర వినిర్మిత విర్మల హర్మ్య రేఖలన్" (1-8-232) ఇతి హి ఆదికవేః నన్నయ భట్టారకస్య విలక్షణమ్ ప్రయోగ ద్వయమ్.

అత్ర నదీ శబ్దస్య ఈకారాన్త స్త్రీలింగత్వాత్ నదీసుత-నదీతుంగ ఇతి భవితవ్యే నదిసుత ఇతి, నదితుంగ ఇతి చ హ్రస్వసహితః ప్రయోగః న సాధుః పాణినీయ సంప్రదాయమనుసృత్య.

ఆంధ్ర వైయాకరణాస్తు సమాసస్య సాంస్కృతిక ఆచ్ఛిక మిశ్ర భేదాత్ త్రైవిధ్యం ప్రత్యపాదయన్. తత్ర చ సాంస్కృతికస్య సమాసస్య పునః ద్వైవిధ్యమూచుః

సంస్కృత వ్యాకరణోక్త లక్షణ మనుసృత్య సంస్కృత భాషాయామేవ సమాసం కృత్వా యథావసరమ్ తదన్త విధీంశ్చ కృత్వా పరిణిష్ఠితస్య తస్య సమస్త పదస్య ఆంధ్ర విభక్తి చిహ్నితత్వేన ఆంధ్ర కావ్యేషు యది ప్రయోగః క్రియతే సః సిద్ధ సాంస్కృతికః.

సంస్కృత శబ్దాన్ యథార్హమ్ ఆంధ్ర విభక్తి ప్రత్యయ చిహ్నితాన్ కృత్వా ప్రత్యేకమ్ తత్సమత్వేన స్వీకృత్య ఆంధ్ర వ్యాకరణోక్త లక్షణమనుసృత్య యది సమాసః క్రియతే సః సాధ్యసాంస్కృతికః స్యాదితి చ నియమః.

సాధ్య సాంస్కృతికేషు సమాసేషు అనేకాక్షరవతామ్ సంస్కృత ప్రాతిపదికానామ్ అంతే దీర్ఘాణామ్ హ్రస్వః స్యాత్ పార్థక్యేన తత్సమత్వాంగీకారాత్. యథా—

లక్ష్మీ వల్లభుఁడు—కాంత ముఖము ఇత్యాదయః. అత్ర పూర్వపదస్య సాక్షాదుత్తర పదేన అన్వయః స్యాత్. అతః అనయోః ప్రాగుక్తయోః నన్నయార్యేణ ఉపయుక్తయోః సమాసయోః సాధ్య సాంస్కృతికత్వమ్ అన్వయావరోధాత్ న స్యాదితి అత్ర దీర్ఘస్య హ్రస్వత్వం న ఆంధ్ర వ్యాకరణ సాధ్యమ్.

సిద్ధ సాంస్కృతికేషు సమాసేషు సంస్కృత వ్యాకరణ లక్షణమంతరా అనుత్తరస్య అవయవస్య అంతే వర్తమానస్య దీర్ఘస్య హ్రస్వః న కదాపి స్యాత్.

ఏవం చ నన్నయ భట్టారకస్య ప్రయోగ ద్వయేఽస్మిన్ సిద్ధ సాంస్కృతికయోః సమాసయోః మధ్యే నదీశబ్దస్య దీర్ఘస్య హ్రస్వః న పాణినీయః నాపి ఆంధ్ర వ్యాకరణ సమ్మతశ్చ.

న చాత్ర "ఙ్యాపోః సంజ్ఞా ఛందసోః బహులమ్" (6-3-63) ఇతి పాణినీయం సూత్రమనుసృత్య నదీశబ్దస్య హ్రస్వః, సంజ్ఞాత్వాభావాత్ అచ్ఛాందసత్వాచ్చ.

"—ఏత్య దూతీకృత మార్గ దర్శనః—" (19-23) ఇతి రఘువంశ శ్లోక వ్యాఖ్యానే మల్లినాథః 'ఙ్యాపోరితి బహుల గ్రహణాత్ హ్రస్వ ఇతి వల్లభః" ఇతి అవోచత్. కింతు తాదృశస్య వచనస్య వైయాకరణ సమ్మతిః మృగ్యా, మల్లినాథస్యాపి సమ్మతిః నాస్తీతి కథయతి పరాభిప్రాయ కథనమేవ.

అహోబల పండితస్తు అత్ర సుదీర్ఘాం చర్చాం కృత్వా అస్య ప్రయోగ ద్వయస్య సాధుతా సంపాదనార్థమ్, అంతతః "హ్రస్వో దీర్ఘస్సమాసేఽపి క్వచిన్నిపః ప్రయోగతః" ఇతి వికృతి వివేకోక్తాం కారికాముదాజహార. (కవిశిరోభూషణమ్-345)

కింతు అస్య వికృతివివేకస్య కర్తృతావిషయే అస్తితావిషయే చ విమర్శకేషు సంతి బహవః సందేహాః. అహోబల పండిత ఏవ యథావసరం కారికాః విరచయ్య ప్రామాణికతా సిద్ధ్యర్థమ్ అథర్వణాచార్యః కర్తేతి వ్యాజహారేతి కేషాంచిత్ పరిశోధకానాం రాద్ధాంతః.

అస్తునామ అహోబల పండితోక్త దిశా అథర్వణ కర్తృకః వికృతి వివేకాఖ్యః గ్రంథః, తస్మింశ్చ ఇయం కారికా.

కింతు నన్నయ భట్టారకస్య ప్రయోగ ద్వయేఽస్మిన్ ప్రాకృత భాషా సంప్రదాయస్య ప్రభావః సుస్పష్టం ప్రతిభాతి.

ప్రాకృత భాషాయాం సంస్కృత సమాన మధ్యగస్యాపి దీర్ఘస్య హ్రస్వ స్థితిః సుప్రసిద్ధా.

వరరుచి విరచితే (4_6. క్రీ. శ.) ప్రాకృత ప్రకాశే వర్తమానస్య "సంధావచామజ్లోప విశేషా బహులమ్" (4_1_అజ్లోప విశేషా ఇతి పాఠాంతరమ్) ఇత్యస్య సూత్రస్య వ్యాఖ్యానావసరే ప్రాకృత మంజర్యాం కాత్యాయనేన (4_6, క్రీ. శ) ఏవముక్తమ్—

> పరతోఽసతి సంయోగే
> పూర్వస్య హ్రస్వతా క్వచిత్
> నదీజలమ్ ణఇజలమ్
> తద్భవేద్వా ణఈ జలమ్॥ ఇతి (పుట_51)

భామహ కృతాయాం మనోరమాఖ్యాయాం వ్యాఖ్యాయాం చాత్రైవ_
"అజ్విశేషాస్తావత్—జఉణ అడమ్—జఉణా అడమ్—.
అత్ర బహుళ గ్రహణాత్ "ణా" ఇత్యత్ర హ్రస్వత్వం వికల్పేన.
ణఇ సోత్తో—ణఈ సోత్తో. హ్రస్వ వికల్పః" (పుట—81) ఇత్యుపాత్తమ్.
ప్రాకృత చంద్రికాయామపి శేష కృష్ణేన ప్రతిపాదితమ్ యథా—

> 'దీర్ఘ హ్రస్వౌ పమాసేఽచామ్
> సంధిర్వా పదయోః క్వచిత్
> ఐదాత్త్వాదేర నాసవర్ణే య్వోః
> వోద్వృత్తే క్వచిచ్చ లుక్। (1-18, పుట-4)

దీర్ఘస్య హ్రస్వః. ణిఅంబ సిలక్ఖలిఅ వీఇ మాలస్స. (నితంబ శిలా స్ఖలిత వీచి మాలస్య) క్వచిద్వా_జఉణ జలమ్_జఉణా జలమ్. (యమునా జలమ్) ణఇ సోత్తమ్_ణఈ సోత్తమ్. (నదీ స్రోతః) బహు ముహమ్-బహూ ముహమ్. (వధూముఖమ్) గౌరి హరమ్_గోరీ హరమ్. (గౌరీ గృహమ్)" (1-18-1) ఇతిచ తేనైవ కృతా వృత్తిః.

నన్నయ భట్టారకాత్ నిస్సందేహమర్వాచీనః లక్ష్మీధరశ్చ (16. క్రీ శ) షడ్భాషా చంద్రికాయామ్ "దిహా మిథస్సే" (1-1-18) ఇతి వాల్మీకి/త్రివిక్రమ సూత్రస్య వ్యాఖ్యానావసరే—

"ఏవం సమాసేషు సర్వత్ర దీర్ఘ హ్రస్వయోః
వ్యత్యయోఽనుసంధేయః"

ఇత్యుక్త్వా "ణఇ గామో—ణఇ గ్గామో— ణఈ గామో" (నదీ గ్రామః) ఇత్యుదాహరణం చ ప్రాదాత్. (పుట-46, 47)

ఉద్ధృతేషు ప్రాకృత వ్యాకరణ గ్రంథేషు నదీ శబ్దస్య దీర్ఘస్య హ్రస్వః వైకల్పికత్వేన సర్వత్ర దరీదృశ్యతే.

అతః అమున్మేవ సుప్రసిద్ధమ్ప్రాకృత భాషా సంప్రదాయమనుసృత్య నన్నయ భట్టారకః సిద్ధ సాంస్కృతిక సమాస మధ్యేఽపి నదీశబ్దస్య దీర్ఘస్య హ్రస్వత్వమ్ ప్రాయుఙ్క్తేతి వక్తుం శక్యతే. నన్నయార్యః తస్య సహాయకః, మిత్రమ్, నారాయణ భట్టశ్చ సంస్కృత భాషాయామివ ప్రాకృత భాషాయామపి పండితావితి విదితచరమేవ.

నందమపూడి శాసనే నన్నయార్యః నారాయణ భట్ట ముద్దిశ్య "సంస్కృత కర్ణాట పైశాచికాంధ్ర భాషాసు కవిరాజ శేఖర ఇతి ప్రథితః" ఇత్యరచయత్

అనయోః ప్రయోగయోః అపాణినీయత్వేన అసాధుతాం మన్యమానాః కేచన ముద్రాపకాః "పది దినములయిదు ప్రొద్దులు—" (1-1-69) ఇత్యాదికం ప్రథమం పద్యం విసృజ్య, ద్వితీయే "యమునా హ్రద తుంగ" ఇతి పాఠాంతరం చాకల్పయన్. కింతు అనయోరస్తితా విషయే అహోబల పండితోక్తిః బహుషు ప్రత్యంతరేషు విద్యమానౌ చ హ్రస్వపాఠౌ ప్రమాణమిత్యలమ్.

ఛందోఽనురోధాత్ హ్రస్వీచకార ఆదికవిరితి వక్తుం నాహం పారయామి ఆంధ్ర భాషాయాః ద్వితీయ ప్రకృతిత్వేన ప్రాకృతభాషా మంగీచక్రు రాంధ్ర వ్యాకర్తారః కేచన. "ఆద్య ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్భవేద్వికృతిః" ఇతి ఆంధ్ర శబ్ద చింతామణిః. అపి చ "అనుక్త మన్యశబ్దానుశాసనవత్" ఇతి నియమమనుసృత్య యథావసరమ్ తత్ర తత్ర "సానునాసికోచ్చారం జిత్" ఇత్యాదీన్ ప్రాకృత వ్యాకరణ సంప్రదాయాంశ్చ అనుసస్రుః. అతః అనయోః ప్రయోగయోః సాధుతా సంపాదన విషయే ప్రాకృత వ్యాకరణ సంప్రదాయ ముద్ఘాటయన్ న సాహసికో భవామి.

# ఉపయుక్త - అతిముఖ్య - గ్రంథసూచిక

## సంస్కృతం


పాణినిః : అష్టాధ్యాయీ
నిర్ణయసాగర—బొంబాయి—1954

శంకరాచార్యః : ఉపనిషద్భాష్యమ్
హరిరఘునాథ భాగవతః, అష్టేకర్ అండ్ కో,
పూనా—1927, ద్వితీయ ముద్రణం.

శాకటాయనః : ఋక్తంత్రమ్
సూర్యకాంతః, ఢిల్లీ—1970

కాశకృత్స్నః : కాశకృత్స్న వ్యాకరణమ్
యుధిష్ఠిర మీమాంసక్, వారాణసీ, వి.సం. 2022

శర్వ వర్మా : కాతంత్ర వ్యాకరణమ్
భావసేన రూపమాలా సహితమ్,
వీరపుస్తక భండార్, జయపూర్. వి.వి.సం. 2481

దేవ నందీ (జైనేంద్రః) : జైనేంద్ర వ్యాకరణమ్
అభయనంది మహావృత్తి సహితమ్,
ఇ.జె. లాజరస్ అండ్ కో, బెనారస్—1918.

తిత్తిరిః (?) : తైత్తిరీయ ప్రాతిశాఖ్యమ్
ఏసియాటిక్ సొసైటీ—కలకత్తా-1872.

అమరసింహః : నామలింగానుశాసనమ్ (అమరకోశః)
రామాశ్రమీ సహితమ్, చౌఖాంబ—1970

నాగోజి భట్టః పరిభాషేందుశేఖరః (1)
భండార్కర్—పూనా—1962.

పాణినిః (పింగలః) ? : పాణినీయ శిక్షా
మన్మోహన్ ఘోష్—కలకత్తా—1938.

| | | |
|---|---|---|
| వరరుచిః | : | ప్రాకృత ప్రకాశః<br>భామహ మనోరమా సహితః<br>చౌఖాంబా_195?. |
| కాత్యాయనః | : | ప్రాకృత మంజరీ<br>ముకుంద శర్మ, నిర్ణయ సాగర-1959. |
| చండః | : | 1. ప్రాకృత లక్షణమ్<br>రేవతీ కాంత భట్టాచార్యః_కలకత్తా_1923.<br>2. (ప్రాకృత కల్పతరోః అనుబంధః_3) |
| శేష కృష్ణః | : | ప్రాకృత చంద్రికా<br>ప్రభాకర ఝా, భారతీయ విద్యా ప్రకాశన్,<br>వారణాసీ—1969. |
| మార్కండేయః | : | ప్రాకృత సర్వస్వమ్<br>గ్రంథ ప్రదర్శినీ_విశాఖపట్టణం_1890. |
| రామ శర్మా | : | ప్రాకృత కల్పతరుః<br>మన్‌మోహన్ ఘోష్, ఏసియాటిక్ సొసైటీ,<br>కలకత్తా—1954. |
| త్రివిక్రమ దేవః | : | ప్రాకృత వ్యాకరణ వృత్తిః<br>జగన్నాథ శాస్త్రీ, చౌఖాంబ. సం_? |
| లంకేశ్వరః | : | ప్రాకృత కామధేనుః<br>(అనుబంధః-2, ప్రాకృత కల్పతరుః) |
| సింహరాజః | : | ప్రాకృత రూపావతారః<br>ఇ. హల్‌ట్‌జ్_కలకత్తా-1909. |
| పురుషోత్తమ దేవః | : | ప్రాకృతానుశాసనమ్<br>(అనుబంధః —1, ప్రాకృత కల్పతరుః) |
| భర్తృహరిః | : | వాక్యపదీయమ్<br>కె. వి. అభయంకర్_పూనా_1965 |

పతంజలిః : వ్యాకరణ మహా భాష్య (3)
కైయట ప్రదీప, నాగేశకృతోద్యోత సహిత,
మోతీలాల్ బెనారసీ దాస్_ఢిల్లీ_1967.

: శబ్ద కల్ప ద్రుమః
మోతీలాల్ బెనారసీ దాస్_ఢిల్లీ_1961.

లక్ష్మణాచార్యః : శారదా తిలకమ్ (సారదా?)
చౌఖాంబ_1934.

శిక్షా సంగ్రహః : (బహు) శిక్షాణాం సంగ్రహః
యుగల కిశోర వ్యాసః,
వ్రజ పి. దాస్ అండ్ కో_బనారస్–1863.

కాత్యాయనః : శుక్లయజుః ప్రాతిశాఖ్యమ్
వ్రజ పి. దాస్ అండ్ కో-బనారస్-1888.

లక్ష్మీధరః : షడ్భాషా చంద్రికా
కమలా శంకర ప్రాణ శంకర త్రివేదీ,
నిర్ణయసాగర_బొంబాయి_1916

లడుకేశ్వర శతపథీ శర్మా : సంస్కృత వర్ణానాం స్వరూపం సముత్పత్తిశ్చ
విష్ణుప్రియా శతపథీ_పూరీ_1980.

అనుభూతి స్వరూపః : సారస్వత వ్యాకరణమ్ (సిద్ధాంత చంద్రికా)
చౌఖాంబా-వారాణసీ-1956.

విశ్వనాథ కవిరాజః : సాహిత్య దర్పణః
మోతీలాల్ బెనారసీ దాస్-1956.

భట్టోజి దీక్షితః : (వైయాకరణ) సిద్ధాంత కౌముదీ (4)
బాలమనోరమా సహితా, చౌఖాంబ_వి సం. 2034

హేమ చంద్రః : సిద్ధహేమ శబ్దానుశాసనమ్ (హైమమ్)
పి.ఎల్. వైద్య_సంగ్లి_1928.

## వ్రాత ప్రతులు


సదానందః : ప్రాకృత చంద్రికా (ఎమ్. ఎస్. 866)
డా॥ వి.ఎస్.కె. లైబ్రరీ,
ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

చండీ దేవ శర్మా : ప్రాకృత దీపికా (ఎమ్. ఎస్. 1076)
డా॥ వి ఎస్. కె. లైబ్రరీ,
ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

చిన బొమ్మ భూపాలః/ అప్పయ్య దీక్షితః : ప్రాకృత మణిదీపః (ఎమ్.ఎస్. 1250)
డా॥ వి.ఎస్.కె. లైబ్రరీ, ఆం. వి. వాల్తేరు.

బాల సరస్వతీ; ఏలకూచి : షడ్భాషా వివరణమ్ (టి. ఆర్.–451)
అడయార్ లైబ్రరీ, మద్రాసు.


## హిందీ


యుధిష్ఠిర మీమాంసక్ : సంస్కృత వ్యాకరణ శాస్త్రి కా ఇతిహాస్ (3)
రామ్‌లాల్ కపూర్ ట్రస్ట్,
సోనీపట్ (హర్యానా)–వి.సం. 2020.


## తెలుగు


అధర్వణాచార్యుడు (?) : అధర్వణ కారికావళి (వికృతి వివేకము)
కవిజనమండన సహితము, వావిళ్ల ప్రతి-1955.

అప్పకవి, కాకునూరి : అప్పకవీయము
వావిళ్ల ప్రతి—1934.

వేంకటకవి, గణపవరపు : ఆంధ్ర కౌముది
ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలు,
సంపుటం–23, సంచికలు–2,3,4.

| | | |
|---|---|---|
| కేతన, మూలఘటిక | : | ఆంధ్ర భాషా భూషణము (ఆం.భా.భూ) వావిళ్ల ప్రతి_1949. |
| వేంకట నరసప్ప, కే | : | ఆంధ్ర లీలావతి_గణిత రత్నాకరము బ్రిటానియా ముద్రాక్షరశాల, మదనపల్లె_1926. |
| వెంకయ్య, తా. | : | ఆంధ్ర వ్యాకరణము వావిళ్ల ప్రతి-1916. |
| రాజేశ్వర శర్మ, అమరేశం | : | ఆంధ్ర వ్యాకరణ వికాసము (2) ప్రాచ్య విద్యాపరిషత్, కామారెడ్డి_1973, 1976 |
| చిన సీతారామస్వామి శాస్త్రి,వజ్ఝల | : | ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము (2) వ్యా. సం. స. ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు_1951. |
| నన్నయ భట్టారకుడు (?) | : | ఆంధ్ర శబ్ద చింతామణి వావిళ్ల ప్రతి— 1956. |
| రంగకవి, కస్తూరి | : | ఆనంద రంగరాట్ఛందము, వావిళ్ల ప్రతి—1922. |
| రామశాస్త్రి, పారనంది | : | ఉద్యోతిని (ఆం శ.చిం.వ్యాఖ్య.) కాశీనాథుని నాగేశ్వరరావు, మద్రాసు_1923. |
| భైరవ కవి | : | కవి గజాంకుశము వావిళ్ల ప్రతి—1950. |
| భీమకవి, వేములవాడ/రేచన | : | కవిజనాశ్రయము ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రతి_1959. |
| అహోబల పండితుడు | : | కవి శిరో భూషణమ్ ఆంధ్ర రచయితల సంఘము హైదరాబాదు_1955. |
| అరుణాచల శాస్త్రి, అకెళ్ళ | : | కవిశిరోభూషణ వివృతి విజయనగరం, కొవ్వూరు, గుంటూరు_1972. |

సూరకవి, అడిదము : కవి సంశయ విచ్ఛేదము
వావిళ్ల ప్రతి_1925.

పెద్దన, విన్నకోట : కావ్యాలంకార చూడామణి
చంద్రికాప్రెస్,
చెన్నపురి_1936.

ఆర్ముగం పిళ్లెయి, తాళ్యూరు : కుమార దేవ పండితీయము (ప్రౌ.వ్యా.వివరణ)
వేదము వేంకటరాయ శాస్త్రి అండ్ బ్రదర్సు,
మద్రాసు—1947.

చిన సీతారామస్వామిశాస్త్రి, వఝ్ఝల : చింతామణి విషయ పరిశోధనము
కాకినాడ_1937.

అనంతామాత్యుడు : ఛందో దర్పణము
వావిళ్ల ప్రతి—1958.

వేంకట రమణశాస్త్రి, వేదం : తెలుగు లఘు వ్యాకరణము
వావిళ్ల అండ్ కో,
మద్రాసు_1915.

గురుమూర్తిశాస్త్రి, రావిపాటి : తెలుగు వ్యాకరణము
వావిళ్ల ప్రతి,
మద్రాసు_1951

పురుషోత్తం, బొడ్డుపల్లి : తెలుగు వ్యాకరణ వికాసము (2)
గుంటూరు—1969.

సీతారామాచార్యులు, బహుజనపల్లి : త్రిలింగ లక్షణ శేషము
(ప్రౌఢ వ్యాకరణము)
వావిళ్లప్రతి,
మద్రాసు_1952

సూరయ్య, దేవినేవి : దివ్య ప్రభా వివరణ
(ఆంధ్ర భాషా భూషణము)
కళా కృష్ణుల కావ్యమాల_2.
1953.

గణపతిశాస్త్రి, చర్ల : నారాయణీయాంధ్ర వ్యాకరణము
లలితా ప్రెస్,
హైదరాబాదు–1969

సీతారామశాస్త్రి, పుదూరి : ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము,
వావిళ్ల ప్రతి
మద్రాసు–1951.

చిన్నయసూరి, పరవస్తు : పద్యాంధ్ర వ్యాకరణము

పట్టాభిరామశాస్త్రి, వేదము : పట్టాభిరామ పండితీయము (ఆంధ్ర వ్యాకరణము)
వావిళ్ల ప్రతి—1951.

చిన్నయసూరి, పరవస్తు : బాలవ్యాకరణము (బా.వ్యా.)
వావిళ్ల ప్రతి—1952.

చిన సీతారామస్వామిశాస్త్రి, వఝ్ఝల : బాల వ్యాకరణోద్ద్యోతము
ఆంధ్ర. సా. అకాడమి.–హైదరాబాదు-1977.

వేంకటరామశాస్త్రి కల్లూరి : బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక

బాలసరస్వతి, ఎలకూచి : బాల సరస్వతీయము,
వావిళ్ల ప్రతులు—1932, 1963.

రామకృష్ణయ్య, కోరాడ : భాషా చారిత్రిక వ్యాసములు
కోరాడ నాగేశ్వరరావు, మద్రాసు-1971.

రామమూర్తి, ధర్మాల : మృదంగ తత్త్వము
సరస్వతీ పవర్ ప్రెస్-రాజమండ్రి–1966.

చిత్రకవి పెద్దన : లక్షణ సార సంగ్రహము
ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకాశితము,
కాకినాడ–1940.

వేంకట నృసింహ అప్పారావు, కే. : వ్యాసపీఠము
కొవ్వూరు—1974.

: వ్యాకరణ పద కోశము
తెలుగు అకాడమీ–హైదరాబాద్–197[illegible].

చిన సీతారామస్వామిశాస్త్రి, వఝ్ఝల : వైయాకరణ పారిజాతము
ఆంధ్ర విశ్వకళా పరిషత్–వాల్తేరు–1[illegible]5[illegible].

చిన్నయసూరి, పరవస్తు : శబ్ద లక్షణ సంగ్రహము
పొన్నూరు—1958.

పున్నారావు, ఆకురాతి : సంస్కృతంలో వ్రాసిన తెలుగు వ్యాకరణాలు-ఒక పరిశీలన
అముద్రిత సిద్ధాంత వ్యాసం, ఆం యూ.–1974.

చిన్నయసూరి, పరవస్తు : సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమ్

తిమ్మకవి, కూచిమంచి : సర్వ లక్షణ సార సంగ్రహము
మంజువాణీ ప్రెస్, ఏలూరు—1927.

తాతంభట్టు, వెల్లంకి : సులక్షణ సారము
కొండపల్లి వారి ప్రతి—1963.

తిమ్మకవి, లింగమగుంట : సులక్షణ సారము
వావిళ్ల ప్రతి—1965.


ఆంగ్లం


K.V. Abhayankar & M, Shukla : A Dictionary of Sanskrit Grammar (D.S.G.) Gaekwad Oriental Series-134-Baroda-1977.

Bhaskaracharya : Lilavati
Eng. Translation by Cole Brooke, Kitab Mahal, Allahabad-1967.

Belvalkar, S.K. : Systems of Sanskrit Grammars (Appendix-I, Chandra Varna Sutras) Bharatiya Vidya Prakasan, Delhi, Varanasi-1976.

Luigia Nitti – Dolei : The Prakrit Grammarians Translated by Prabhakrjha, Motilal Benarsidas – 1972.

గణపతిశాస్త్రి, చర్ల : నారాయణీయాంధ్ర వ్యాకరణము
లలితా ప్రెస్,
హైదరాబాదు—1969

సీతారామశాస్త్రి, పుదూరి : ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము,
వావిళ్ల ప్రతి
మద్రాసు—1951.

చిన్నయసూరి, పరవస్తు : పద్యాంధ్ర వ్యాకరణము

పట్టాభిరామశాస్త్రి, వేదము : పట్టాభిరామ పండితీయము (ఆంధ్ర వ్యాకరణము)
వావిళ్ల ప్రతి—1951.

చిన్నయసూరి, పరవస్తు : బాలవ్యాకరణము (బా.వ్యా.)
వావిళ్ల ప్రతి—1952.

చిన సీతారామస్వామిశాస్త్రి, వఝ్ఝల : బాల వ్యాకరణోద్ద్యోతము
ఆంధ్ర. సా. అకాడమి—హైదరాబాదు-1977.

వేంకటరామశాస్త్రి కల్లూరి : బాల వ్యాకరణ గుప్తార్థప్రకాశిక

బాలసరస్వతి, ఎలకూచి : బాల సరస్వతీయము,
వావిళ్ల ప్రతులు—1932, 1963.

రామకృష్ణయ్య, కోరాడ : భాషా చారిత్రిక వ్యాసములు
కోరాడ నాగేశ్వరరావు, మద్రాసు-1971.

రామమూర్తి, ధర్మాల : మృదంగ తత్త్వము
సరస్వతీ పవర్ ప్రెస్-రాజమండ్రి—1966.

చిత్రకవి పెద్దన : లక్షణ సార సంగ్రహము
ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకాశితము,
కాకినాడ—1940.

వేంకట నృసింహ అప్పారావు, కే. : వ్యాసపీఠము
కొవ్వూరు—1974.

: వ్యాకరణ పద కోశము
తెలుగు అకాడమీ—హైదరాబాద్—197[illegible].

చిన సీతారామస్వామిశాస్త్రి, వఝ్ఝల : వైయాకరణ పారిజాతము
ఆంధ్ర విశ్వకళా పరిషత్—వాల్తేరు—1[illegible]5[illegible].